





# మహిళలు

## జీవిత చరిత్ర,ధర్మాలు

## వ్యాస చిత్రాలు-అబ్బూరి ఛాయాదేవి





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ధనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక


వ్యాసార్థం : వాకాటి పాండురంగారావు ix
వ్యాసగతం xiii

I

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనుభవాలూ, రచనలూ 1
శ్రీ శ్రీ కథనం 21
'కొత్త చూపు' 29
విశ్వనాథ చెప్పిన విలక్షణ కథ : 'ముగ్గురు బిచ్చగాళ్ళు' 33
కథలు ఎలా రాయాలి ? 39
నవల : సామాజిక సంస్కరణ 44
సీతాదేవి నవలల్లో స్త్రీవాదం 51
'వరవిక్రయం' 58
ఇల్లాలిస్థానం – 'బొమ్మరిల్లు' 62

II

పారిస్‌లో నా పర్యటనానుభవాలు 69
కోపరూపాలు ! 81
చేతిచేష్టలు 85
'ఉత్తరక్రియ' 88
మన వెనకటి తరాలస్త్రీలు – చెళ్లపిళ్లవారి విశ్లేషణ 91
చేనుమేసే కంచెలుంటే....? 95
వివాహమంత్రాల తాత్పర్యం 98
తోచకపోవడం 103

ప్రేమించడం ఎలా?! 106

స్వేచ్ఛ—సమస్య—మనిషి 110

## III

జీవనమార్గం - జిడ్డు కృష్ణమూర్తి 115

జీవిత వ్యాఖ్యాత - జిడ్డు కృష్ణమూర్తి 120

ఒంటరితనం, విసుగు — కృష్ణమూర్తి చూపిన వెలుగు 126

హింసకి మూలం 131

బెర్ట్రాండ్ రసెల్ భవిష్యద్దర్శనం 137

——

# వ్యాసార్థం

ముప్పై రెండు సంవత్సరాల క్రింద ఢిల్లీలో ఒక ఉద్యోగంలోచేరి, కాపురం వుండడానికోసం వెతకగా కరోల్ బాగ్, పూసారోడ్, 15 నంబరు ఇంటి రెండో అంతస్తుమీద హాలూ, గదీ, వరండా వున్న వాటా దొరికింది. పక్కనే విశాలమైన డాబా కూడా వున్న అలాటి వాటాల్ని ఢిల్లీలో 'బర్సాతీ'లు అంటారు. ఆ వాటా లోకి దిగాక తెలిసింది. క్రింద మొదటి అంతస్తులో అబ్బూరి వరద రాజేశ్వర రావుగారు కాపురం వుంటున్నారని. బెరుకు బెరుకుగా వెళ్ళి కలుసుకుంటే, గల గల నవ్వుతూ పలకరించారు వరద రాజేశ్వరరావు. ఆయన వ్యాఖ్యలూ, విమర్శలూ, వెక్కిరింతలూ, వివరణలూ వింటుంటే కొత్త ప్రపంచం తలుపులు తెరిచినట్లుండేది. హిమశిఖరం వంటి ఆయన వ్యక్తిత్వానికి సుందర, మౌన నేపథ్యంలాటి ఆకాశంలా ఆ వెనకే ఛాయాదేవి గారుండేవారు. ఆయన వర్షం అయితే ఆమె మేఘం; ఆయన తెరిచిన అట్లాసు పుస్తకం అయితే ఆమె గప్‌చిప్‌గా వుండే గ్లోబ్ అన్పించేది. ఎప్పుడో గాని ఆమె మాటాడేవారుకాదు. నవ్వుతూ పలకరించేవారు. బట్ట ముక్కలతో, అట్ట ముక్కలతో అలవోకగా అందాల బొమ్మల్ని సృష్టించేవారామె. సప్రూహౌస్ గ్రంథాలయంలో కాబోలు పని చేస్తుండేవారు. నటీనటులు, కవులు, రచయితలు ఎందరెందరో వస్తుండే వారా సరస్వతీ సదనానికి, అంతేకాని గాంభీర్యతకు నడిచే నిర్వచనం లాటి ఛాయాదేవి గారిని మాత్రం అప్పట్లో ఎక్కువగా తెలుసుకోలేదు.

పదిహేనేళ్ళ క్రింద నానా తీర్థంబులూ గ్రుంకి మేము భాగ్యనగరం చేరే టప్పటికి అబ్బూరి దంపతులూ రిటైరయి ఈ వూరు చేరారు. వరద రాజేశ్వరరావు గారి ఆత్మీయతను, ఛాయాదేవి గారి అతిథి మర్యాదలనూ తరచుగా అనుభవించే అదృష్టం కల్గింది. క్రమంగా ఆమె అక్కడా అక్కడా మాట్లాడగా విన్నాను. ఆమె రాసిన కథలు, వ్యాసాలు చదువుతూ వచ్చాను. ఆమె పట్ల గౌరవం పెరగ సాగింది ముఖాముఖీ మాట్లాడినా, మైకులోకి మాట్లాడినా, రచన చేసినా- ఆమెలో నేడు సమాజంలో చాలా వరకు అదృశ్యమైపోతున్న 'సెన్సిటివిటీ', 'డిగ్నిటీ'

కనిపిస్తూంటుంది. ఈ వ్యాసాలను చదివిన తర్వాత ఆమె పఠనా వైశాల్యము, ఆలోచనల సాంద్రత, భావ వ్యక్తికరణలో స్పష్టత- అవగతమయ్యాయి.

వేలాది సంవత్సరాల నాగరకత మనది. ఇంకే దేశంలోనూ ఎగరనంత ఎత్తులకు మనసు ఎగిరిన సంస్కృతి ఇది. మారేది ఏదో, మారనిది ఏదో స్పష్టం చేసి ఈ ద్వైతానికి అతీతంగా వుండడం వాంఛనీయమేకాదు, సాధ్యం కూడా అని చెప్పిన దేశం ఇది. ఆ దొడ్డ సంస్కృతి బిడ్డ అయిన ఈ ఇల్లాలు-మన సమాజంలోని కుళ్ళుని, క్రౌర్యాన్ని, చాపల్యాన్ని శస్త్ర వైద్యుడంత నైపుణ్యంతో ఖండించగలరు; మార్పు పేరుతో, పరిష్కారం పేరుతో మోగించే దుందుడుకు దుందుభుల చప్పుళ్ళను అంతే నాగరకంగా విశ్లేషించగలరు.

జిడ్డు కృష్ణమూర్తి, బెర్ట్రెండ్ రసెల్, ఇబ్సెన్, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వంటి మేధావులను, మార్గదర్శకులను బాగా ఆకళింపు చేసుకున్న ఈ మేధావి-రచయిత్రి వారి ఆలోచనల పట్టుదారాలతో అల్లిన అద్భుతమైన తివాసీ లాంటిది ఈ సంకలనం.

మనిషి ఒంటరితనం, ప్రేమ-ప్రేమించక పోవడం, స్వేచ్ఛ, సంప్రదాయం-సమాజం-సంస్కరణ, రచన-దాన్ని ధ్యేయం వంటి అనేకానేక విషయాలను మృదువుగా స్నేహితురాలిలాగా విడమరచిన ఈమె ఈనాటి స్త్రీ పడే బాధల గురించి పదే పదే ప్రస్తావిస్తారు. ఈ సమస్యమీద అటు పురుషాహంకార వాదులు, ఇటు అతివాద ధోరణులలో రాస్తున్న రచయితలూ-ఇద్దరినీ చూపిస్తూనే-మధ్యే మార్గం వుంది-అన్నమాట ఈ వ్యాసరస్వతి వాక్రుచ్చారు.

సమకాలీన రచయిత్రి వాసిరెడ్డి సీతాదేవి రచనలలోని స్త్రీవాద ధోరణులను టంకించిన వ్యాసంలో ఆమె ఉదహరించిన ఈ భాగం చూడండి :

"కొత్త విలువలతో సాహిత్య సృష్టి జరగాలి- స్త్రీ పురుషుల్ని ఇద్దర్నీ సమానంగా చిత్రించే మానవతా వాదం సాహిత్యం ద్వారా ముందు తరాల వారికి అందించాలి". అప్పటికీగాని నిజంగా స్త్రీకి పూర్తిగా విముక్తి కలగదు".

కాళ్ళకూరి నారాయణరావుగారి 'వరవిక్రయం'లో వదువు చెప్పిన

"కట్నమే కోరి వచ్చిన ఖరము తోడ<br>దగుదునని కాపురము సేయు దాని కంటె

బెండ్లియే మానుకొని మగబిడ్డ వలెనె
తల్లి దండ్రుల కడనుండ తప్పిదంబె ?"

అనుమాటల నుదహరించి చివర-"66 ఏళ్ళు గడిచినా మనం ఇంకా మేలుకోలేదు !" అను ఛాయాదేవి గారి ఆఖరి వాక్యం-కట్నం ఇచ్చి పుచ్చుకునే వారి ఎదలమీద ఎక్కుపెట్టిన సీత బాణం!

"ఇక్కడి నియమ నిబంధనలన్నీ మనిషి బుద్ధి విభవాలే. దేవుడు సాయించినవికావు" అను శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి విశ్లేషణతో ఏకీభవించిన ఈవిడ "సమాజంలో మూఢాచారాల్నీ, దుర్మార్గాల్నీ నిర్మూలించవలసిన అవసరం ఒక్క తరంతోనో ఒక్క సారితోనో అంతమైపోదు. ఎప్పటి కప్పుడు సమకాలీన పరిస్థితులను సమీక్షించి తోటి ప్రజలను హెచ్చరించవలసిన అగత్యం ఉంది. సాహిత్యానికి ఉండవలసిన సామాజిక ప్రయోజనం అదే !" (నవల-సామాజిక సంస్కరణ)-అని గమ్యాన్నీ, దారినీ కూడా నిర్దేశించారు.

'హింసకి మూలం!' అను జిడ్డు కృష్ణమూర్తి పైన వ్యాసంలో రచయిత్రి-

"ప్రపంచంలో ప్రతి భాగంలోనూ తిరుగుబాట్లూ, విప్లవాలూ జరుగుతున్నాయి. సామాజిక వ్యవస్థని నిస్సంశయంగా మార్చవలసిందే. దానిని హింస లేకుండా మార్చడం సాధ్యమా? ఎందువల్లనంటే హింస మళ్ళీ హింసనే సృష్టిస్తుంది హింసను సృష్టించకుండా, పెంచకుండా ప్రపంచంలోనూ మనలోనూ మార్పు తీసుకొచ్చే మార్గం ఏదయినా ఉందా అన్నదే మన ప్రశ్న- అన్నారు కృష్ణమూర్తిగారు" అని వివరించి ఆఖరున "హింస లేకుండా చేసుకోవడం మనలోనే ఉంది అని కృష్ణమూర్తిగారి వివరణ సారాంశం" అంటారు ఛాయాదేవి.

"ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో లభించిన అపారమైన శక్తులవల్ల ప్రపంచానికి ఏర్పడిన ప్రమాదమంతా మానవ మనస్తత్వం మీదే ఆధారపడి ఉందనీ, మనుషుల మనసుల్లోని దుష్టమైన రాగద్వేషాలలోనే ఇమిడి ఉందనీ, ఈ విషయాన్ని గ్రహించి పరమత సహనాన్ని పాటించి సర్వమానవ సౌఖ్యాన్ని కాంక్షించినట్లయితే ప్రపంచం ఇంతకుముందెన్నడూ లేనంత సుఖప్రదంగా ఉంటుందనీ రసెల్ విశ్వాసం", అన్న ఉటంకింపుతో వ్యక్తిమీద, మనసు మీద రచయిత్రి కేంద్రీకరించడం గమనార్హం.

ఇట్లా నేటి వ్యక్తినీ, మానవజాతినీ వేధిస్తున్న ప్రధానమైన సమస్యల మీద స్పష్టమైన, సాధికారికమైన, సవ్యమైన ఆలోచనా మార్గాన్ని సూచించటంలో రచయిత్రి సఫలురాలయినారు. విషయం ఎంత గహనమైనా ఈమె శైలి హాయిగా చదివిస్తుంది.

ఈ సంపుటంలోనే 'శ్రీశ్రీ కథనం' అన్న (కథకులందరూ తప్పక చదివి తీరవలసిన) వ్యాసంలో

"కష్టంగా రాయడ మంత సులభమైన పనిలేనట్టే, సులభంగా రాయడ మంత కష్టమైన పనికూడా లేదు. ఆడంబరంగా జీవించడం సులభం. నిరాడంబరంగా బతకడం కష్టం. జీవితంలోనూ, సాహిత్యంలోనూ సౌలభ్యత సాధించ దగ్గది" అని శ్రీశ్రీ చెప్పిన దాన్ని జీవితంలోనూ, రచనలోనూ సాధించిన ఛాయా దేవిగారి ఈ సంకలనం- ఆలోచించడానికి భయపడనివాళ్ళకి అవశ్యం పఠనీయం.

జీవితపు లోతుల నరసిన వేదాంతింకా హాయిగా పసిపిల్లవాడి వలె నవ్వ గలడు. అందుకే ఇంత తాత్త్వికమైన విషయాలను చిత్తశుద్ధితో విశ్లేషించిన ఈమె తన పారిస్ యాత్ర గురించి, 'మృత్యుంజయుడై'న తన తండ్రిగారి కోపం గురించి, తన కోపం గురించి, 'చేతి చేష్టల' గురించి రాసిన వాటిలో లేలేత హాస్యం మల్లెల వాసనవలె మనసు పందిరిని ఆవరిస్తుంది.

తెలుగు దినపత్రికలు రాజకీయాల రొచ్చుగుంటల్లోనూ, వారపత్రికలు ఆనాలోచన, అశ్లీలతల ఎండమావుల్లోనూ విహరిస్తున్న రోజుల్లో— తెలుగుమాట పూర్తిగా సంకరమై వంకరటింకర దారిలో విలవిలలాడుతున్న ఈ కృష్ణపక్షంలో ఈ వ్యాస సంకలనం ఒక పున్నమి చందమామ!

అట్టముక్కలతో అందాల బొమ్మలను సృష్టించిన ఆ సోదరీమణియే అక్షరాలతో వెలిగించిన శుక్లపక్షం ఇది.

చాల సంతోషం!

మనఃపూర్వకంగా స్వాగతం!

8—12—95
భాగ్యనగర్

వాకాటి పాండురంగారావు

# వ్యాసగతం

ఆడపిల్ల గొంతువిప్పి గట్టిగా మాట్లాడటం, నోరు తెరిచి నవ్వడం సహించని సాంప్రదాయక పురుషాధిక్య వాతావరణంలో పుట్టి పెరగడం వల్ల నాకు నలుగురి ఎదుటా ధైర్యంగా మాట్లాడటం అలవాటు కాలేదు. నా స్వభావం కూడా నా పేరుకి తగినట్లే రూపొందింది. కానీ నా అభిప్రాయాలను ప్రకటించాలనీ, నా అనుభూతుల్ని ఇతరులతో పంచుకోవాలనీ తపన ఉండేది. అందుకే కథలూ, వ్యాసాలూ రాయడం ప్రారంభించాను. తండ్రి సాహచర్యంలో తాత్త్విక విషయాల్లోనూ, భర్త సాహచర్యంలో సాహిత్య విషయాల్లోనూ అభిరుచి పెంపొందడంతోబాటు, వృత్తిరీత్యా వివిధ గ్రంథాలతో పరిచయం ఏర్పడింది. అయితే, అడపాతడపా రాయడమేగాని ఎక్కువగా రాయలేకపోయాను.

నేను రాసిన కొద్ది రచనల్ని చదివిన సాహితీ మిత్రులూ, పెద్దలూ నన్ను అడుగడుగునా ప్రోత్సహిస్తూ నాచేత వ్యాసాలు రాయించారు. 'ఉదయం', "ఆంధ్రజ్యోతి" దిన పత్రికల సంపాదకులుగా శ్రీ ఎ. బి. కె. ప్రసాద్‌గారూ, 'ఉదయం' నవతరం వారపత్రిక సంపాదకులుగా శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మగారూ, 'ఆంధ్రప్రభ' సంపాదకులుగా శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారూ, తరవాత శ్రీ వి. వాసుదేవ దీక్షితులుగారూ, 'ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక' సంపాదకులుగా శ్రీ వాకాటి పాండు రంగారావుగారూ, 'మిసిమి' సంపాదకులు శ్రీ రవీంద్రనాథ్ ఆలపాటి గారూ నన్ను ప్రోత్సహిస్తూ వచ్చారు.

వీరు కాక, నేను ఇదివరకు పారిస్‌లో ఉండగా రాసి పంపిన వ్యాసాన్ని 'ఆంధ్ర జ్యోతి' సంపాదకులు శ్రీ నండూరి రామమోహనరావుగారు అందిన వెంటనే తమ పత్రికలో ప్రచురించారు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి స్వీయ చరిత్రాత్మక, సృజనాత్మక రచనలన్నిటినీ చదవడానికి నాకిచ్చి, శ్రీపాద వారిపై వ్యాసం రాయడానికి, 'ఆంధ్ర ప్రభ'లో ప్రచురింప బడటానికి దోహదం చేసిన అప్పుడు శ్రీ ఫణికుమార్. కథాపఠనం, కథా సంకలనాల సేకరణ ప్రవృత్తిగా చేసుకున్న కథకుల మిత్రులు శ్రీ రామడుగు రాధాకృష్ణమూర్తిగారూ, శ్రీ సమ్మెట

నాగమల్లీశ్వర రావూ అప్పుడప్పుడు నాకు కావలసిన పుస్తకాలు తెచ్చిపెట్టి నా వ్యాసరచనకు దోహదం చేశారు. ప్రఖ్యాత రచయిత, సహృదయులు శ్రీ మునిపల్లె రాజుగారు శ్రీశ్రీ కథలపై వ్యాసం రాయమని నన్ను ప్రోత్సహించారు. ఆ వ్యాసాన్ని శ్రీశ్రీ అభిమాని, 'స్వాతి మాసపత్రిక' సంపాదకులు శ్రీ వేమూరి బలరాం గారు ప్రచురించారు. నవలా రచనలోగాని, సంఘ సంస్కరణలోగాని అనుభవం లేకపోయినా, నామీద అభిమానంతో ప్రముఖ సంఘ సంస్కర్తలూ, స్త్రీవాదులూ శ్రీమతి మల్లాది సుబ్బమ్మగారూ, శ్రీ మల్లాది రామమూర్తిగారూ తాము నిర్వహించిన సదస్సుకై నాచేత ప్రసంగవ్యాసాన్ని రాయించి, తరవాత దాన్ని తమ సంకలనంలో ప్రచురించారు.

ఈ విధంగా నా వ్యాసరచనకూ, ప్రచురణకూ తోడ్పడిన సహృదయు లందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

ఈ వ్యాస సంపుటానికి ముందుమాట రాయవలసిందిగా కోరగానే ఆనందోత్సాహాలతో అంగీకరించి, సంపుటిపై ప్రశంసా పూర్వక ముద్రని వేసిన స్నేహశీలి, 'మిత్రవాక్య' కర్త ప్రొ॥ వాకాటి పాండురంగా రావుగారికీ, ఈ పుస్తకానికి ముఖచిత్ర లేఖనం చేసిన సాహితీ బంధువు శ్రీ శీలా వీర్రాజు గారికి నా కృతజ్ఞతాభి వందనాలు.

ఈ పుస్తకాన్ని ముద్రించడంలో శ్రద్ధతీసుకుని అనుకున్న సమయానికి అందించిన శ్రీ నాగేంద్రగారికీ, శ్రీ బాలా ప్రసాద్‌గారికీ ప్రత్యేక కృతజ్ఞతలు.

అబ్బూరి ఛాయాదేవి



# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి
# అనుభవాలూ, రచనలూ

ఏ సాహితీ ప్రక్రియ విశిష్టంగా ఉండాలన్నా ఆ ప్రక్రియకి పూనుకున్న వారికి భావుకతతో బాటు, భాషాజ్ఞానం, జీవితానుభవం విశేషంగా ఉండాలి. కొన్ని విశిష్ట రచనలు చదివిన తరవాత, ఆ రచనలు చేసిన వ్యక్తుల గురించి తెలుసుకోవాలనే కుతూహలం కలుగుతుంది సహజంగా.

ఆ రచయితల వ్యక్తిగత విషయాల గురించే కాక, వారు అటువంటి విశిష్టమైన రచనలు ఎలా చేయగలిగారో, ఎటువంటి అనుభవాలు వారికి ప్రేరణ కలిగించాయో, వారి రచనావిధానం ఎటువంటిదో, వారి ఆలోచనలు ఎటువంటివో మొదలైన విషయాలెన్నో తెలుసుకోవాలనే ఆసక్తి పెరుగుతుంది పాఠకుల్లో. అందువల్లనే ఈ రోజుల్లో వస్తున్న పత్రికల్లో రచయితలతో పాఠకుల "ముఖాముఖీ" లనీ, ప్రత్యేక "ఇంటర్‌వ్యూ" లనీ ప్రచురించడం పరిపాటయింది. పాఠకులు గాని, విలేఖరులు గాని సరైన ప్రశ్నలు అడగ్గలిగినట్లయితే, రచయితలు ఇచ్చే సమాధానాలు కొన్ని వారి అసలు రచనల కన్న ఆసక్తిదాయకంగా ఉంటాయి. నిజానికి ప్రముఖ రచయితలు తమ వివిధ రచనల ద్వారా వ్యక్తం చేసిన అభిప్రాయాలే కాకుండా, తమ జీవితానుభవాల్నీ, అనుభూతుల్నీ, అభిప్రాయాల్నీ ప్రత్యేకంగా రాసి ప్రచురించగలిగితే పాఠకులకు అంతకన్నా కావల్సింది ఏముంటుంది?

## అనుభవాల రచన :

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ "గజం యెత్తు" రచనలతో బాటు, "నవోదయ" పత్రికకోసం నీలరాజు వేంకటశేషయ్యగారి ప్రోద్బలంతో తమ అనుభవాలూ, జ్ఞాపకాలూ కొన్నిటిని పాఠకులకు అందించారు అప్పట్లో–నాలుగున్నర దశాబ్దాల క్రితం. పత్రికాముఖంగానే కాకుండా, తరవాత వాటిని "అనుభవాలూ, జ్ఞాపకాలూను" అనే శీర్షికతో గ్రంథాలుగా కూడా ప్రచురించారు. వీటిని ప్రచురించిన "కళాభివర్ధినీ పరిషత్తు" (రాజమహేంద్రవరం) అవి మొత్తం ఎనిమిది

సంపుటాలవుతాయనీ, ఒక్కొక్క సంపుటం పరిమితి దాదాపు 400 పేజీల వరకూ ఉంటుందనీ అంచనా వేసుకున్నప్పటికీ. శ్రీపాదవారి అకాల మరణం వల్ల మూడో సంపుటంతోనే ఆ పథకం అప్పట్లో ఆగిపోయింది. అది ఆంధ్రుల దురదృష్టం.

## ప్రముఖుల ప్రతిస్పందన :

"అనుభవాలూ, జ్ఞాపకాలూను" మొదటి సంపుటం (1955) చదివాక వేలూరి శివరామశాస్త్రిగారు "తెలుగువారిలో తెలుగు ఉన్నదని ఈ పుస్తకం కళ్లు తెరిపిస్తుంది. ప్రతి హైస్కూలును, ప్రతి కాలేజీని, ప్రతి తెలుగు వ్యక్తినీ ఈ పుస్తకం చదవమని అనురోధిస్తాను" అని రాశారు. విశ్వనాథ సత్యనారాయణగారు శాస్త్రిగారిని, "సర్వదా తమరీనాటి యాంధ్ర వ్యావహారికభాషా నిర్మాతృగణ ప్రథమ గణనీయులు" అని ప్రశంసించారు. గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు "మన వీరేశలింగంగారితో ఆరంభమైన స్వీయచరిత్రలు-మీ దానితో-నాకు తెలిసినంతవరకు 14మాత్రమే.... ఈనాడు భాష నానా సంకరమై నశించిపోతున్నది. ఇటువంటి సమయంలో మీ రచన భాషకు మహోపకారం కాగలదని నా అభిప్రాయం...." అని రాశారు శాస్త్రిగారికి.

సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "అనుభవాలూ, జ్ఞాపకాలూను" మొదటి సంపుటానికే తన్మయుడవుతూ, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి- "మీరు గిరివృక్షం వంటివారు. ఉద్యానంలోని చెట్టుకారు. అంత జీవశక్తిని క్షణం క్షణం వెచ్చిస్తేనేగానీ- 'ఇల్లుపట్టిన వెధవాడబడుచు', 'షట్కర్మయుక్తా' 'అపిదళతివజ్రస్యహృదయం' 'మార్గదర్శి', 'జాగ్రత్తపడవలసిన ఘట్టాలు', 'కచ్చితమైన జవాబు' ఇత్యాది ఘన కథల రచయిత- ఏ ఆంగ్ల కథనో తెరవాటు కొట్టి వెలిగే సాటి రచయితల్లో కేవలం సాలీడువలె-తనలోంచే అంతా సృష్టించుకొనే రచయిత ఆవిర్భవించ లేదు. కావడానికి మీరు సిద్ధాంతి గారి అబ్బాయి, కాని నవీనాంధ్ర కథకులలో ఘనాపాఠీ.... ఇది సామాన్య మానవుడికి చరిత్ర కాదు. క్షోభ! ఘోష!" అని రాశారు శాస్త్రిగారికి.

## కథాంశంలో కొత్తదనం :

ఈ మధ్య దాదాపు పదిహేనేళ్లనుంచీ తెలుగు నవలారచన శైలిలో, ఇతివృత్తంలో "కొత్త ధోరణి" ఉంటున్నట్లు పాఠకులూ, పత్రికల సంపాదకులూ నమ్ముతూ వచ్చారు. నవ, యువరచయితలను ప్రోత్సహించడానికీ, వారి కొత్త

తరహా రచనల్ని పాఠకులచేత విశేషంగా చదివించడానికీ, పత్రికల అమ్మకాల్ని పెంచడానికీ వివిధ పత్రికల సంపాదకులూ, పుస్తకాల అమ్మకాల్ని పెంచడానికి ప్రచురణకర్తలూ చాకచక్యంగా కల్పించిన నమ్మకం అది. ఈ కొత్తతరహా నవలల్ని కొందరు "పరిశోధనాత్మక" నవలలంటూ ఉంటారు. మందులు తయారు చేసే కంపెనీల గురించీ, డాక్టర్ల గురించీ, వ్యాపారవేత్తల గురించీ, రోగుల గురించీ, వేశ్యల గురించీ, గూండాల గురించీ, ఇంకా వివిధ రంగాల్లోని వ్యక్తుల వాస్తవిక జీవన విధానాల గురించీ ప్రత్యేకంగా పరిశోధనచేసి వాటిని ఆధారంగా చేసుకుని నవలలు ప్రచురించబడుతూ ఉంటాయి పాశ్చాత్యదేశాల్లో. అదే పద్ధతి మనదేశంలోనూ, మన భాషలోనూ ప్రారంభమైంది. ఇది కొత్తగా ప్రారంభమైన రచనా విశేషమా అని ప్రశ్నించుకోవలసిన అగత్యం ఉందని తోస్తుంది- శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథలూ, నవలలూ, నాటికలూ కొన్ని చదివితే.

## శైలి, శిల్పం :

శ్రీపాద వారి రచనల్లో వస్తు వైవిధ్యంతో బాటు, శైలిలో, శిల్పంలో విలక్షణత గోచరిస్తుంది. ఆయన ఈ శతాబ్దం ఆరంభ దశలో ప్రారంభించి నాలుగైదు దశాబ్దాల పాటు తెలుగులో, ఎక్కువగా వ్యావహారిక శైలిలో ఎన్నో విశిష్ట రచనలు చేశారు. సనాతన వైదిక సాంప్రదాయక కుటుంబంలో పుట్టి పెరిగిన వారు. "ఇంగ్లీషు చదువు" చదువుకోలేదు. "వారాలు" చేసుకుంటూ పొరుగూళ్లలో గురుకుల సాంప్రదాయంలో వైదిక విద్యలూ, సంస్కృత కావ్యాలూ అభ్యసించినటువంటి వ్యక్తిలో "తిరుగుబాటు" తత్వం ఎలా ఏర్పడిందో, ఆయన "అనుభవాలూ, జ్ఞాపకాలూను" చదివితే- తెలుగులో వ్యావహారిక శైలిలో "పరిశోధనాత్మకం"గా, మార్గదర్శకంగా ఎలా రచనలు చేయగలిగారో తెలుస్తుంది మనకి కొంతవరకు. ఆయన చేపట్టిన వివిధ సాహితీ ప్రక్రియల్లో "పదహారణాల" తెలుగుతనం ప్రతిబింబిస్తుంది. ఆయన మీద ఆంగ్ల సాహిత్య ప్రభావం ఎంతమాత్రం పడలేదనే చెప్పవచ్చు. ఆయన రచనలకు ఎక్కువగా స్ఫూర్తినిచ్చినవి—ఆయన చదువుకున్న సంస్కృత కావ్యాలూ, తెలుగు సాహితీ గ్రంథాలూ, జానపద గాథలూ, చారిత్రక గ్రంథాలూ మొదలైన వాటి కన్న ఆయన చుట్టూ ఉన్న పరిసరాలూ, మనుషుల సంభాషణలూ, వారి మనస్తత్వాలూనూ. "కథలంటే.... మనుష్యుల నడకలకు ప్రతిబింబాలు కావుటోయి వెర్రివాడా? అనుభవపరుడంటే, చాలా కథలు అర్థం చేసుకొని, వాటి భావం జీర్ణింప చేసుకొన్నవాడు కాడూ, అయితే కథల నర్థం చేసుకోవాలంటే,

కళ్ళ ఎదుట జరిగితే చూడనైనా చూడాలి. పుస్తకాలు చదివయినా గ్రహించాలి. కథలంటే పైపైని ఉన్నా యనుకున్నావేమో? అవి కల్పించడానికి చాల గొప్ప ప్రతిభ ఉండాలి. వొక్కొక్క కథ ఎలాంటి ఘట్టంలోనూ కూడా వొక్కొక్కళ్లని వొడ్డెక్కిస్తుంది. కథలు చదవడమూ అర్థమం వినడమూ ఎప్పుడూ దండుగ అను కోకేం?" అని రాశారాయన "మార్గదర్శి" అనే "చిన్నకథ"లో. తనతో కలిసి చదువుకునే ఆడుకునే కుర్రవాళ్లకి కథలు కల్పించి చెప్పడం ఆయనకి చిన్నప్పుడే అలవాటయింది. తరవాత రాయడం కూడా మొదలు పెట్టారు.

## కథలకు ఆరంభం :

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఖరసంవత్సరంలో చైత్రశుద్ధ చతుర్దశి, గురువారం (23 ఏప్రిల్, 1891) నాడు రామచంద్రపురం తాలూకాలోని పొల మూరు గ్రామంలో పుట్టారు. "యజ్ఞయాగాది వైదిక కర్మానుష్ఠానం అనూచాన సంపత్తిగా ఉండిన వంశం వారిది. వేదం, శ్రౌతం, స్మార్తం, జ్యోతిశ్శాస్త్రం, మంత్రశాస్త్రం, సంస్కృత సాహిత్యం– ఇవి వారి కులవిద్యలు. నేర్చిన ఆ విద్య లన్నీ నిరసనభావంతో విడిచిపెట్టేసి, "కొత్తదారి" తొక్కారాయన.

ఆ "పూలబాట"కి మళ్ళడానికి కారణమైందొక చిన్న సంఘటన. ఆయన చిన్నతనంలో సంస్కృత విద్యాభ్యాసానికి వల్లూరు వెళ్ళి అక్కడ ఉంటున్న రోజుల్లో ఒకనాడు ఒక ముసలావిడ చిత్రమైన కోరిక ఒకటి కోరింది. తన ఇంటికి వచ్చి రోజూ కొంతసేపు ఒక పుస్తకం చదివి వినిపించమని అభ్యర్థించింది తీరా చూస్తే అది "మదనకామరాజు కథల" పుస్తకం. అదే మొదటిసారి ఆయనా పుస్తకం చూడటం.

"కథలు వింటున్నాను– కథలు చెబుతున్నాను. కథలల్లుతూనూ ఉన్నాను; గాని కథల పుస్తకం చూసి యెరగనప్పటికి నేనెప్పుడూ. 'కథలకు పుస్తకా లుంటాయా? అనిన్నీ అనిపించింది నాకు. అంచేత, చిరకాలంగా ఉన్న లోటేదో తీరిపోయిందన్న తృప్తి కలిగింది. దాని పరిచయంతో నాకు... పద్యం మీదకంటే వచనం మీదా, వచనంలో మళ్ళీ సులభమైన సరళ వచనం మీదా రుచి. అభి మానమూ కలగడానికదే కారణం అయింది నాకు" అని రాశారు శ్రీపాదవారు.

## తిరుగుబాటు :

తెలుగులో కవిత్వం రాయాలన్న అభిలాష కూడా తపనగా రూపొందసాగింది ఆయనలో. గురువు దగ్గర సంస్కృత కావ్యాలు చదువు

కుంటూనే చాటుగా దొరికిన తెలుగు గ్రంథాలు చదువుతూండేవారు. రచన కూడా సాగిస్తూండే వారు. కానీ, తండ్రిగారూ, చిన్నన్న గారూ తెలుగు చదవడం, రాయడం నిషేధించే వారు. కుల విద్యల్ని సాధన చేయమని నిర్బంధించే వారు. కులక్రమంగావస్తున్న వైదికవిద్యలకు అంతరాయం కలిగిస్తుందన్న అనుమానంతో బాటు "తెనుగులో కవిత్వం చెయ్యగూడదు" అనీ, అది "అప్రతిష్ఠాకరం" అనీ "పతనం" అనీ వాళ్ల విశ్వాసం. వాళ్ల దృష్టిలో "తెనుగు వొక సభ్య భాషకాదు. తెనుగులోసాహిత్య కృషి చెయ్యడం అంటే అకార్యకరణం. వైదిక విద్యలన్నీ సంస్కృతంలో ఉన్నాయి కనక... వారిదృష్టిలో సంస్కృతం వొక్కటే పవిత్రమైన భాష. పండితుడంటే సంస్కృత పండితుడే పండితుడు. కవి అంటే కూడా సంస్కృత కవే కవి. ఇది వైదికుల సిద్ధాంతం!!!" కనక తెనుగులో కవిత్వం చెయ్యవద్దని శాస్త్రిగారి మీద పెద్దవాళ్ల ఆంక్ష. తెలుగులో రచన చెయ్యడం అంటే వాళ్ల దృష్టిలో "కులం చెడ్డమే" శాస్త్రిగారి చేత తెలుగు రచనలు చదవడం, రాయడం మానిపించాలని వారి నాయన గారూ, చిన్నన్నగారూ "నిర్బంధ విధానం అవలంభించిన కొద్దీ శాస్త్రిగారు "ప్రతీకారం" ప్రారంభించారు. వైదిక విద్యలంటే నిరసన భావం, ప్రాతికూల్యం, ద్వేషం పెరిగిపోవడంతోబాటు, "సంధ్యావందనం అన్నమాట మీదే రోత పుట్టేసింది" ఆయనకి. దీనికి తోడు, కందుకూరి వీరేశలింగం గారి ఉపన్యాసాలు రెండు ఆయన కళ్ళ బడ్డాయి. "కులము", 'వేశ్యకాంతలు" అనే రెండు ఉపన్యాసాలూ బాగా చదివారు. అవి ఆయన్ని బాగా ఆకర్షించి, ప్రభావితం చేశాయి. దాంతో "శుద్ధ ప్రచ్ఛన్న బ్రాహ్మ సామాజికుడి"గా అయిపోసాగారు. ఆచార బహిష్కారం ప్రారంభించారు.

## విప్లవ భావాలు :

ఈ అనుభవాల ఫలితంగా కలిగిన అనుభూతులూ, అభిప్రాయాలూ విప్లవాత్మక ధోరణిలో తరవాత ఆయన రాసిన "అరికాళ్ల కింద మంటలు", "కన్యాకాలే యత్వాద్వరితా", "కొత్త చూపు", "ఇలాంటి తవ్వాయి వస్తే", "బ్రాహ్మణాగ్రహారం" మొదలైన కథల్లో ప్రస్ఫుటమవుతాయి. వైదిక సంప్రదాయ కుటుంబాల్లో స్త్రీలు పడేఅవస్థల్నీ గ్రామాల్లో నిమ్నకులాల వారు పడే అవమానాల్నీ, హింసల్నీ చూసి, వారి పరిస్థితుల్ని మెరుగుపరచాలనే తపనతో రాసిన కథలూ, నవలలూ రూపికలూ వారివి.

## వ్యావహారిక భాష-స్త్రీల భాష :

లోకుల సంభాషణలు వింటూ ఉండడం, గ్రంథాలు చదువుతూ ఉండడం,

ఎడతెగకుండా రచన సాగిస్తూ ఉండడం అలవరచుకున్నారు శాస్త్రిగారు చిన్నప్పటినుంచీ. తెలుగు భాష ఎలా ప్రయోగించాలో స్త్రీల వల్లనే తమకు అలవడిందంటారాయన.

"పురుషుల భాషలో కంటే స్త్రీల భాషలో మాధుర్యమూ, హృదయాలను పట్టివేసే జాతీయతా కనబడింది నాకు. వారి మాటల పొందికా, వారి హావభావ ప్రదర్శన చాతుర్యమూ తెనుగు భాషలో నాకు మాతృభిక్ష ప్రసాదించాయి" అని చెప్పుకున్నారాయన.

చిన్నతనం నుంచీ వైదిక విద్యలు అభ్యసించడం వల్లా, సంస్కృత కావ్యాలు అధ్యయనం చేయడం వల్లా కలిగిన సంస్కృత భాషాజ్ఞానం ప్రభావం వల్లనే ఆయన కొన్ని కథలకు పెట్టిన పేర్లలో సంస్కృత ప్రయోగాలు విరివిగా చోటు చేసుకున్నాయి. తెలుగులో సామాన్యుల సంభాషణల్ని ఆకళింపు చేసుకోవటం వల్లనే వారి కథల్లో తెలుగు నుడికారాలు విరబూశాయి.

తండ్రి ఏ పొరుగూరికో వెళ్ళినప్పుడు, మధ్యాహ్న సమయాల్లో ఇరుగు పొరుగు స్త్రీలు కొందరు తమ ఇంట్లో చేరి ముచ్చట్లాడుకుంటూంటే శాస్త్రిగారు పొంచి వింటూండేవారుట. ఆ "స్త్రీల గోష్ఠి"లో వారి లోకాభిరామాయణం శాస్త్రిగారికి సాహిత్య గోష్ఠిలా అనిపించేదిట. వారి కబుర్లలో వాదోపవాదాలూ, ఛలోక్తులూ, శ్లేషలూ, సామెతలూ, పలుకుబళ్ళూ దొర్లుతూ "నవరసాలూ చిప్పిలేవి"ట. "సరస్వతి లాస్యం చేస్తున్నట్లుండేది"ట అక్కడ. "కాళిదాసు నాలుక మీద బీజాక్షరాలు రాసి" నట్లుగా "నా చెవిలో ఆ మాతృదేవతలు బీజాక్షరాలు కుమ్మరించారు" అంటారాయన. వారి ఇంట్లోనేకాక, నలుగురు స్త్రీలు ఎక్కడ మాట్లాడుకుంటున్నా వింటూ ఉండిపోయే వారుటాయన. అందుకే కాబోలు శాస్త్రిగారి కథలు చాలా వరకు సంభాషణలతో నిండి ఉంటాయి. వర్ణనల కంటే సంభాషణలే ఎక్కువుంటాయి వాటిలో. ఆ సంభాషణల రూపంలోనే శాస్త్రిగారి విశిష్ట కథాశిల్పం, విలక్షణ కథనశైలీ ద్యోతకమవుతాయి. "గూడు మారిన కొత్తరికం", "జాగ్రత్త పడవలసిన ఘట్టాలు", "కూతుళ్ల తల్లి", "ముళ్ళచెట్టూ కమ్మని పువ్వూను", "యావజ్జీవం హోష్యామి", "షట్కర్మయుక్తా", మొదలైన కథల్లో వ్యక్తం చేసిన సమస్యలూ పరిష్కారాలూ అన్నీ సంభాషణల ద్వారానే. రచయిత వాటి మధ్యకి అరుదుగా జొరబడతాడు. మనకి పాత్రలే సజీవంగా కళ్ళ ఎదుట నిలిచి కథని చకచకా నడిపిస్తాయి. పరుగెత్తిస్తాయి.

ఒక్కగా నొక్క కూతుర్ని అతికష్టం మీద కాపురానికి పంపించడం; ఒక బాల్య వితంతువు ఇంట్లో తల్లీ, అక్క చెల్లెళ్ళూ, అమ్మమ్మా పెట్టే హింసలు భరించలేక అర్ధరాత్రి వేళ ఇల్లు వదిలి వీరేశలింగం గారి ఆశ్రమానికి బయలు దేరడం; మేనరికాలు కుదుర్చుకుని తాంబూలాలు పుచ్చుకోవడం; అత్తాకోడళ్ళ తగువులూ, మధ్యలో భర్త నలిగిపోవడం; కన్నకూతురు జీవితాంతం వైధవ్యాన్ని అనుభవించకుండా మళ్ళీ పెళ్ళి చేయించడానికి అత్తగారినీ, భర్తనీ ఎదిరించడం; పండక్కి కూతుళ్ళనీ, అల్లుళ్ళనీ పిలిచి బట్టలు పెట్టడానికి ప్రయత్నించడం; భార్యాభర్తలు చిటపడలాడుకుని తరవాత సర్దుకోవడం-ఇలా ఏ సమస్య తీసుకుని కథ రాసినా సంభాషణల రూపంలోనే ఎక్కువగా రాశారు శాస్త్రిగారు.

## మనస్తత్వ పరిశీలన :

స్త్రీ పురుషుల్ని సునిశితంగా పరిశీలించడం అలవాటవడం వల్ల, శాస్త్రిగారు ఆంగ్లభాషలో ఏ సైకాలజీ పుస్తకాలూ చదవకుండానే తెలుగులో బహుశా మొట్ట మొదటి-"సైకలాజికల్" నవల "ఆత్మబలి" అనే పేరుతో రాశారు. తరవాత వచ్చిన హేమాహేమీలయిన తెలుగు రచయితలమీద ఆంగ్ల సాహిత్య ప్రభావం లేకుండా లేదు. అసలైన తెలుగు జీవితం, తెలుగువారి మనస్తత్వం అంటే ఏమిటో తెలుస్తుంది శ్రీపాద వారి రచనల్లో.

మనస్తత్వ పరిశీలనలో శాస్త్రిగారికి ఎంత ప్రావీణ్యం ఉందో ఒక్క ఉదా హరణలో చూడొచ్చు-యుక్తవయస్సులో ఉండగా, పద్యరచనలోని మెళుకువ లన్నిటినీ నేర్చుకోవాలనే ఉద్దేశంతో తిరుపతి వేంకటకవుల వద్దకు గానీ, రామ కృష్ణ కవుల వద్దకు గానీ వెళ్ళాలనుకున్నారాయన. తిరుపతి వేంకటకవుల ప్రభ అప్పటికే కొన్ని దశాబ్దాలుగా వెలుగుతోంది. రామకృష్ణ కవులు చిన్నవాళ్ళ యినా ప్రసిద్ధులయారు. ఎవరి దగ్గరికి వెళ్ళాలా అన్న మీమాంస పట్టుకుంది శాస్త్రిగారికి. ఎందుకంటే వారుభయుల మధ్యా వైరం కొనసాగుతోంది. "వారి మనస్తత్వాలెలాంటివో గుర్తిద్దామనుకుని ఆకార విశేషాలను బట్టి అవి గ్రహించ వచ్చు కనక, వొకరిది విడిచి వొకరిదిగా ఫోటోలు వరకాయిస్తూ కూచున్నా. నా కూ చోడం ..."మనం రామకృష్ణకవులదగ్గరికే వెళ్ళడం" అన్న స్థిరనిశ్చయం కలిగి పోయింది నాకు. ఎందుచేతనంటే, తిరుపతి వేంకటకవులు చొక్కాలు తొడుక్కో లేదు. కాళ్ళకి బందరు ఆకు చెప్పులే తొడుక్కుని ఉన్నారు. గంధాక్షతలూ రుద్రాక్ష మాలలూ కూడా ధరించి ఉన్నారు; కాగా, వారి దగ్గరికి వెడితే కవితా

సాధన చేయించడం మాట దేవుడెరుగును. ముందు మూడుపూట్లా సంధ్యావందనం చేస్తే గాని నిలవ నివ్వరేమో అనిపించింది" శాస్త్రిగారికి. ఆయనకి అప్పటికే వైదిక వృత్తులన్నా సంధ్యావందనం అన్నా నిరసన భావం, ద్వేషం పుట్టి ఉంది. చొక్కా తొడుక్కోవడం కూడా ఆరంభించాడు అప్పటికే. ఆయన చొక్కా తొడుక్కొని ఉండగా మొదటిసారి వారి తండ్రి చూసి, "చొక్కాలు కూడా తొడుగుతున్నాడూ అప్రాచ్యుడూ?" అంటూ పళ్ళు కొరికారుట. శాస్త్రిగారి పెద్దక్క గారు చూసినప్పుడు "నీకిదేం పని?" అంటూ మందలించారుట

## సామాజిక చైతన్యం :

మనో విశ్లేషణాత్మక నవలతో బాటు, అపరాధ పరిశోధక నవల కూడా ఒకటి రాశారు శాస్త్రిగారు-బహుశా తరవాత తరవాత, ఇతర భాషల్లోని గ్రంథాలకు వచ్చిన అనువాదాల్ని చదవడంవల్లనేమో. ఆయన రాసిన "డిటెక్టివ్ నవల" పేరు "రక్షాబంధనం". అయితే అందులో ఆయనకున్న సామాజిక చైతన్యం, విప్లవభావాలూ వెల్లడవుతాయి. ఆ కథలో, ఆఖరున హత్యా నేరం మీద పట్టుబడిన దొంగ, ఇంగ్లీషుఅధికారితో అంటాడు: "పోలీసులకు అసాధారణాధికారాలుండాలి. ఒప్పుకుంటాను. కాని ఈ దేశంలో అమాయకులైన ప్రజలను పోలీసులు పెట్టే హింసలు మీరు గమనించాలి. ముఖ్యంగా నన్నవమానించిన పోలీసినస్పెక్టరును దారుణంగా శిక్షించకపోతే మీరు మీ విధి తప్పిన వారవుతారు. ఆ మనిషి అప్పుడలా చెయ్యడం వల్లనే ఇలామారి నేనిది చేశాను. కనుక, వీటికన్నిటికీ... కారణం ఆ ఇనస్పెక్టరు". ఆ నేరస్తుడు చెప్పిన మాటలు ఈనాటికీ వర్తిస్తాయి కదా!

## రాచమర్యాదలూ, రాణులభాషా :

సామాన్య బ్రాహ్మణ కుటుంబాల్లోని వ్యక్తుల్నీ, గ్రామీణ వాతావరణాన్నే కాక, జమీందారుల కుటుంబాల్లోని వివిధ వ్యక్తులగురించీ, రాచరికపు మర్యాదలూ, అమర్యాదలూ, ఆచారాల గురించి కూడా కథలు రాశారు శాస్త్రిగారు. ఆ కథల పునాదులూ, రూపురేఖలూ కూడా చాలావరకు వారి అనుభవాల్లోంచి ఉద్భవించినవే.

శాస్త్రిగారి చిన్నతనంలో వారి ఇంట్లోనూ, ఇరుగుపొరుగు ఇళ్ళలోనూ కలుసుకుని కబుర్లు చెప్పుకున్న స్త్రీలలో "శ్రీ దాట్ల దివాకరరాజుగారి భార్య ముచ్చి వెంకయ్యమ్మగారు" కూడా ఉండేవారు. "క్షత్రియ సామాన్య స్త్రీగా కాదు, మహారాణీలాగ కనబడేవారామె... పెద్దాపురం రాజవంశానికి చెందిన ఆడబడుచు

ఆమె. ఆమె మాట కూడా రాణుల ధోరణిలోనే ఉండేది.... జాతీయమైన తెనుగు భాష కావాలంటే స్త్రీల దగ్గిరే నేర్చుకోవాలి. మర్యాద గల తెనుగు భాష కావాలంటే మళ్ళీ క్షత్రియ రమణుల దగ్గిరే నేర్చుకోవాలి. మరో దారి లేదు–నాకు రాచమర్యాదలేమైనా తెలుసునంటే, అవి ఆ చిన్నతనాన ఆ దివాకరరాజుగారి ఇంట్లో గ్రహించినవే. "రాజరాజు" నాటకంలో రత్నాంగి పాత్ర చిత్రించేటప్పుడు ఆ బుచ్చి వెంకయ్యమ్మగారి మూర్తిమంతమే ప్రత్యక్షాదర్శం నాకు' అని రాశారు శాస్త్రిగారు తమ "అనుభవాలూ జ్ఞాపకాలూను"లో

"రాజరాజు" నాటకంలోనే కాదు, "క్షీర సాగరమథనం" నవలలో నిమ్మలూరు దివాణం గురించీ, "గులాబీ అత్తరు" అనే కథలో పెద్దాపురం దివాణం గురించీ, "వడ్లగింజలు" కథలో పిఠాపురం దివాణం గురించీ చేసిన వర్ణనలూ, వ్యాఖ్యలూ శాస్త్రిగారి అనుభవాలమీదా, పరిచయాలమీదా ఆధారపడినవే కొంత వరకు. ఉదాహరణకి, రాజమహేంద్రవరంలో శాస్త్రిగారిని రాజా శ్రీవత్సవాయి జగపతివర్మగారు కలుసుకున్నప్పుడల్లా "తమ (పెద్దాపురం సంస్థాన) పూర్వ ప్రభువుల సాహసౌదార్యాలు అంతూ పంతూ లేకుండా చెబుతూ ఉండేవారు"ట. అదికాక అంతకుముందే, శ్రీరాజా, వాడ్రేవు రంగనాయకమ్మ జమిందారుగారి గురించి కూడా బాగా తెలుసు శాస్త్రిగారికి. "దొడ్డంపేట వాడ్రేవు ప్రభువుల నిరతాన్నదానం" లోకప్రశస్తి పొందిందిట. సకల విద్యల్లోనూ ఆమెకి శ్రుత పాండిత్యం ఉండేదిట. విద్వాంసుల్ని ఆమె స్వయంగా గుర్తించి సత్కరించే వారుట. శాస్త్రిగారి తండ్రి అంటే ఆమెకు ఎంతో శ్రద్ధ, గౌరవం. బహుశా ఈవిడేనేమో "మార్గదర్శి" కథలో కథానాయకుడికి వ్యాపారంలో పెట్టుబడి నిమిత్తం అప్పిచ్చిన శ్రీమంతురాలి పాత్రకి ఆధారం.

"వడ్లగింజలు", "గులాబీ అత్తరు"-ఈ రెండు కథల్లోనూ–దివాణంలో ప్రవేశించి రాజుగారి దర్శనం చేసుకోవడం ఎంత కష్టమో, దివాను దగ్గిరనుంచి ద్వారపాలకుడి దాకా ఎలా అడ్డు నిలుస్తారో వివరించిన విశేషాలకు ఆధారం ఆయనకి మరోరకంగా జరిగిన అనుభవాలే. ఆయనకి అన్నీ వివరంగా జ్ఞాపకం.

## సన్నిధానవర్తులు :

శాస్త్రిగారు రాసిన "వీరపూజ" నవలని ప్రచురించడానికి కొందరు సంపన్నుల్ని ధన సహాయం అర్థించాలనుకున్నారు. వారిలో అనపర్తి కాపురస్థులు ద్వారంపూడి రామారెడ్డిగారు ముఖ్యులుట. "నేనొక్క వందరూపాయలిస్తాను....

వొక్క వారం దినాల్లో రండి" అన్నారుటాయన. కానీ శాస్త్రిగారు ఎప్పుడు వెళ్ళినా, "మళ్ళీ వారం"అని చెప్పి పంపించేసేవారుట. ఇది గమనించి రామారెడ్డి గారి తమ్ముడు ఈయనతో రహస్యంగా...."ఫలానా పెద్దమనిషి"రామారెడ్డిగారి సన్నిధానంలో లేనప్పుడు, ఆ క్షణంలోవంద రూపాయలూ చేతిలో పడతాయని సలహా ఇచ్చారుట. "కల్పవృక్షం" అని పేరుట రామారెడ్డిగారికి. "దాని చుట్టూ ముళ్ళకంచె ఉన్నదని నేనదే వినడం మొదటిమాటు" అంటారు శాస్త్రిగారు. మొత్తంమీద ఓనాడు ఆ "సన్నిధానవర్తి"ని తప్పించుకుని రామారెడ్డిగారిని కలుసుకోగా, వందరూపాయలూ చేతిలోపడ్డాయిట. వారం వారమూ పట్టుదలగా మూడేళ్ళపాటు తిరిగితే చివరికి ఫలితందక్కిందిట."ఆ తృప్తి హార్దికం" అంటారు శాస్త్రిగారు.

ఇటువంటిదే మరొక అనుభవం-"పిఠాపురం మహారాజులుంగారిని" ఆశ్రయించడానికి వెళ్ళినప్పుడు జరిగిందిట. దివాను మొక్కపాటి సుబ్బారాయుడుగారు సహృదయులేనట. కానీ "వీరపూజ" గ్రంథం (రాతప్రతి) ఆయనకి చదివి వినిపిస్తున్న సమయంలో మరొక పంతులుగారు కూర్చుని ఉన్నారుట అక్కడే. రామకృష్ణ కవులంటే ఇష్టం లేదుట ఆ పంతులుగారికి. ఆయన తిరుపతి వేంకట కవుల పక్షం. శాస్త్రిగారు రామకృష్ణ కవుల దగ్గిర కవితా సాధన చేస్తున్నారని వినడంతో బాటు, "వీరపూజ" నవలలోని కొన్ని అంశాలు పంతులుగారికి నచ్చ లేదుట. తత్ఫలితంగా, మర్నాడు దివాను సుబ్బారాయుడుగారు శాస్త్రిగారితో, ఆయన్ని కలుసుకోవడానికి "ప్రభువు" సుముఖంగా లేరన్న విషయాన్ని సూచిస్తారు.

''ఎక్కడా కూడా 'సన్నిధానవర్తుల' ధోరణి వొక్కలాగే వుంటుంది"అని రాసుకున్నారు శాస్త్రిగారు తమ అనుభవాన్ని.

ఇటువంటి అనుభవాల ఆధారంగానే ''సన్నిధాన వర్తుల'' గురించి చమత్కారంగా, హృద్యంగా కల్పించి రాశారు తమ కథల్లో.

## విషయ పరిజ్ఞానం - పరిశోధనాత్మకత :

వారి అనుభవాల ఆధారంగా రాసిన మరోరకం విశేషాలున్నాయి "వడ్లగింజలు," "మార్గదర్శి'' మొదలైన కథల్లో. ''వడ్లగింజలు" కథలో చదరంగం

ఆటగురించి, "మార్గదర్శి" కథలో పావలా పెట్టుబడితో వ్యాపారంచేసి లాభాలు గడించడంలో గల నేర్పు గురించీ పూసగుచ్చినట్లు విపులంగా, సవివరంగా రాశారు. రెండు పరస్పర విరుద్ధమైన అంశాలగురించి "పరిశోధనాత్మకంగా" రాయడానికి అంతసామర్థ్యం ఎలా వచ్చింది శాస్త్రిగారికి ? ఏవో గ్రంథాలు చదివితేనూ, వాటిని అనుకరించితేనూ వచ్చిన సామర్థ్యం కాదది. ఏదైనా నేర్చుకోవాలన్న అభిలాష కలిగితే, దాన్ని పట్టుదలతో, శ్రద్ధాసక్తులతో, క్షుణ్ణంగా నేర్చుకోవడం, అన్నిరకాల వ్యక్తుల్ని అనేక సందర్భాల్లో నిశితంగా పరిశీలించడం శాస్త్రిగారి స్వభావం. చిన్నతనం నుంచీ ఆయనకి అలవాటు.

చిన్నతనంలో వారి గ్రామంలో నాటకాల కంపెనీల వాళ్ళొచ్చి నాటకాలాడటం, అందులోనేపథ్యంలో వయొలిన్ వాద్యం వినిపించడం, పద్యాలు పాడటం చూశాక, వాళ్ళు మహారాష్ట్రుల ప్రభావంతో హిందుస్థానీ బాణీలో వాయించడం, పాడటం సహించలేక, వయొలిన్ మీద కర్ణాటక సంగీతం నేర్చుకోవాలనే అభిలాష కలిగిందాయనకి. అప్పటి కాయనకి పదహారు పదిహేడేళ్ళ వయస్సుంటుందేమో. "అసలు, ఆ వయస్సున కొత్త విద్యకు ఓనమాలు ప్రారంభించడమే యెలాగో వుంటుంది. పైగా, సరళీ స్వరాలు ప్రారంభించడం. ఆ స్వరాలు జంత్రాన పలికించడం వొక యమచెర. అయినా, నా కిష్టమయిన విద్యలన్నిటా నాకీ దుర్గతి తప్పనిదే అయింది... నా ప్రయత్నం గాలిపాట కోసమూ, అషామోషీ వాద్యం కోసమూ కూడా కాదాయె. ఏమైనా ఇది సాధించాలి. సాధించి కమ్మగా ఫిడేలు వాయించాలి. వాయించి నాదానందం అనుభవించాలి. నా కిది దీక్ష" అనుకున్నారు శాస్త్రిగారు. ఆయన ఏ విద్యనేర్చుకున్నా అదే దీక్షతో నేర్చుకున్నారు. ఒకరు ఆదేశించడం వల్ల కాకుండా, తనంతట తాను అభిలాషతో, ఆసక్తితో నేర్చుకోవడం కాబట్టి. ఎంతో చురుకుగా, ప్రగాఢంగా అధ్యయనం, తీవ్రంగా సాధనా చేసేవారు దేన్నైనా.

పద్యరచన సాధన చేస్తున్నరోజుల్లో, ఒక స్నేహితుడు అవధానం చెయ్యమని ప్రోత్సహిస్తూ ఆశువుగా పద్యాలు చెప్పలేకపోతే ఇక గొప్పేముంది అని కవ్విస్తాడు. ఇక "అదే దృష్టి అయిపోయింది" శాస్త్రిగారికి. పోలవరంలో ప్రప్రథమంగా ఆయన చేసిన అష్టావధానం గుర్తుకు వస్తే శాస్త్రిగారికి ఆజన్మాంతం "పులకలు" రేగుతూండేవిట. ఆ అష్టావధానం అనుభవాన్ని ఇలా వివరించా

రాయన- "పృచ్ఛకులు చుట్టూ కూచున్నారు కుర్చీలమీద నా కటూయిటూ. సబ్ కోర్టు శిరస్తాదారు సమస్య యిచ్చారు శార్దూల విక్రీడితంలో. గాదె దానన్న పంతులు గారు (స్కూళ్ల యినస్పెక్టరు) లోకాభిరామాయణాని కూర్చుంటున్నారు. "శాస్త్రి గారూ ప్రారంభిస్తామా" అనడుగుతూ, భావనారాయణస్వామిగారు దశావతారాల పేర్లు చెప్పమన్నారు కందంలో వరుస తప్పకుండా. ఎస్టేటు గుమాస్తా వొకాయన (పాపయ్యగారి నామినీ) గంటలకు బదులు కూతల కుర్చుంటున్నారు- సైకిలుబూరా చేతబుచ్చుకుని. నాయుడుగారు పురాణం చెప్పమంటూ కూచున్నారు భాగవతం తెరుచుకుని. మేఘసందేశం పాఠాని కూర్చున్నాడొక వకీలు విద్యార్థి. అచంట వెంకట రావుగారు(మా సోమప్ప ప్లీడరు) చదరంగం బల్ల సద్దుకూర్చుంటున్నారు ఎత్తు వెయ్యడానికి సిద్ధంగా. "నే నివ్వవచ్చా?" అనడుగుతూ అధ్యక్షులు సిద్ధపడ్డారు వ్యస్తాక్షరికి "

అంతటి విద్వత్తూ. విషయ పరిజ్ఞానం ఉండేవి శాస్త్రిగారి కథల వెనుక. "వడ్లగింజలు" కథలో అంత సూక్ష్మంగా, అంతవిపులంగా చదరంగం ఆట గురించి రాయగలగటానికి కారణం అదే. "మార్గదర్శి" కథలో వ్యాపారనైపుణ్యాన్ని ప్రదర్శించడానికి శాస్త్రిగారికి వ్యాపారంలో ప్రత్యక్షంగా అనుభవం ఉండటంకాదు- వ్యాపారం చేసేవాళ్ళని నిశితంగా పరిశీలించి సేకరించిన జ్ఞానం అది. అల్లసాని పెద్దన్న కవిత్వం చెయ్యడానికి "నిరుపహతస్థలం" కావాలన్నాడట. కానీ, శాస్త్రిగారికి లోకవృత్త పరిశీలన కావాలి. "మనసుతో ఆలోచన, కళ్లతో చూపూ, చెవులతో వినికి. బుద్ధితో సమన్వయం-కూచున్నా నడుస్తున్నా నిత్యకృత్యాలు ఆయనకి. "నిత్యకృత్యాలే కాదు, అనుక్షణ కృత్యాలు". "లోకవృత్తం చూస్తూవుంటే, తక్కినవన్నీ మరుపు వచ్చి, భావాలు పుడతాయి. కల్పనలూ తోస్తాయి నాకు. అందుకనుగుణంగా లోకుల మాటలు వింటూ వుంటే, భాషలో జాతీయత కూడా గుర్తుకి వస్తుంది ఏకకాలంలో.... బజారులో అయితే, అన్ని అంతస్థుల మనుష్యలదీ జీవన భారం కూడా కళ్లబడుతుంది జీవన నిర్వ్యాతితోపాటు ...."అని శాస్త్రిగారి నమ్మకం, శాస్త్రిగారి జీవన విధానం, శాస్త్రిగారి కథల ఆంతర్యం. "మార్గదర్శి" కథలో ప్రదర్శించిన వ్యాపార ధోరణి, బేరసారాల చతురతా-అన్నీ శాస్త్రిగారు బజారుల్లో వస్తూపోతూ స్వయంగా పరిశీలించి, సూక్ష్మంగా గ్రహించిన విషయాలే.

## ఇంగ్లీషు చదువు లోటు :

శాస్త్రిగారికి తెలుగు భాష మీద ఎంత అభిమానం ఉన్నప్పటికీ, తెలుగు భాష మీద ఎంత స్వాధీనత అలవరచుకున్నప్పటికీ, ఇంగ్లీషు భాష అభ్యసించ లేకపోయినందుకు అంత తీవ్రంగానూ లోలోపల బాధపడేవారు. ఆ బాధ చిన్నప్పుడే మొదలైంది. స్వగ్రామమైన పొలమూరులో శాస్త్రిగారు చిన్నతనంలో ఇంట్లోనే ఉండి, వైదిక విద్యలు నేర్చుకుంటూండగా, ఆయనతోటి కుర్రవాళ్ళిద్దరు– తటవర్తి భీమరాజుగారి చిన్న కొడుకులు – దొడ్డంపేట వెళ్ళి ఇంగ్లీషు చదువులు ప్రారంభించి, సెలవులకి ఇంటికొచ్చినప్పుడల్లా ''పాస్‌పీస్'' మంటూ "తమలో తాము స్వదేశీ ఇంగ్లీషు మాట్లాడుతూ, పూర్వాన్నే ఉండిపోయిన మా స్నేహితులనందర్నీ డెకారించేవారు.... ఇంగ్లీషు చదవనందుకప్పుడే కాదిప్పుడూ చాలా కించగానే వుంది నాకు. ఎంతో లోటుగానూ వుంది.... నిజానికి ప్రపంచం అంతటా బహుళ ప్రచారంగల యింగ్లీషు రాకపోవడం నాకే కాదెవరికయినా దౌర్భాగ్యమే" అని చింతించేవారు శాస్త్రిగారు. సాహిత్యపరంగానూ, సామాజికంగానూ మాత్రమే కాదీ బాధ ఆయనకి. కుటుంబ విషయాల్లోకూడా కొన్ని సందర్భాల్లో ఎంతో అవమానకరంగా పరిణమించిందాయనికి ఇంగ్లీషు చదువు లేకపోవడం.

## అవమానం - నిరసన

పెళ్ళినాటికి శాస్త్రిగారు "మూడోతరగతిలో పద్దెనిమిదోపాఠం చదువుతున్నారట అంతే! మరి బడికి వెళ్ళలేదుట. ఆయన జ్ఞాపకం అమోఘం. తరవాత ఇంట్లోనూ, గురుకులంలోనూ చదువుకున్నారు. ఆయనకి పెళ్ళి సంబంధం చిన్నప్పటి నుంచీ అనుకున్నదే.

మేనరికం. కాని, ఆ మేనత్తగారికి వీరి సంబంధం చేసుకోవడం ఇష్టం లేదుట. ఆవిడ తమ్ముళ్ళలాగే ఆవిడ కొడుకు కూడా ఇంగ్లీషు చదువుతున్నాడు. కనక, తప్పకుండా ఉద్యోగస్థుడయిపోతాడనే ఆశ ఆమెకి. ''వైదిక విద్యలంటే వైదిక కుటుంబాల్లోనే వెగటు పుట్టుకు వస్తున్న దినాలవి.'' ''వరకట్నాల పద్ధతి మెల్లిమెల్లిగా తలయెత్తుతోంది''ట అప్పుడప్పుడే. మేనత్తగారికి ఇష్టం లేక పోయినా, ఆవిడ భర్త అవిడకి ఎదురుచెప్పలేని స్థితిలో ఉన్నా, మొత్తం మీద

శాస్త్రిగారి తల్లి పట్టుదలమీద శాస్త్రిగారికి, మొదటి నుంచీ అనుకుంటున్న "సీత" తోనే వివాహం జరిగింది.

అయితే, ఇంగ్లీషు చదువుకున్నామని విర్రవీగే కుర్రవాళ్లంటే శాస్త్రిగారికి నిరసనభావం ఏర్పడిపోయింది. తను ఇంగ్లీషు చదువుకోలేకపోవడంవల్ల తన బంధువర్గంలోనే అనుమానం పాలయినందువల్ల, వారి మేనత్త గారికే కాకుండా, శాస్త్రిగారి పెద్దక్కగారికి కూడా చిన్నచూపే శాస్త్రిగారంటే. ఆయన చొక్కాతొడుక్కొని కనిపించినప్పుడు "నీకిదేంపని!" అంటూ ఆవిడ మందలించబోతే, "మరి, నీ కొడుకు తొడగడం లేదు?" అని ముదలకించారట శాస్త్రిగారు. దానికి ఆవిడ "నాకొడుకింగ్లీషు చదివాడు, నీకేంవుంది?" అన్నారుట "మహాగర్వంగా"– ఆ కొడుకు థర్డుఫారం చదివి, ఫెయిలయి, నిర్వ్యాపారంగా కూచుని ఉన్నప్పటికీ. ఇటువంటి కుర్రవాళ్ళ గురించీ, వాళ్ల తల్లిదండ్రుల పెంపకం గురించీ తమ నిరసన భావాన్ని శాస్త్రిగారు "తాపీమేస్త్రి రామదీక్షితులు బి.ఏ", "కొత్తచూపు", మొదలైన కథల్లోనూ, "క్షీరసాగరమథనం" నవలలోనూ స్పష్టంగా వ్యక్తం చేశారు. ఇంగ్లీషు చదువుకుని భేషజాలుపోయే కుర్రవాళ్ల మీదా, పరజాతి జీవన విధానాల్ని అనుకరిస్తూ తెలుగుసంస్కృతిని హీనంగా చూసేవారి మీదా సందర్భం వచ్చినప్పుడల్లా చురకలు వేయడం మానలేదు శాస్త్రిగారు.

అయితే ఒక విచిత్రం–ఆయన, తరవాత ఆంగ్లభాష ఎప్పుడు ఎలా అభ్యసించారోగాని, వారి పెద్దన్నగారి కుమారుడి ఉపనయన సందర్భంలో అవధానం చెయ్యవలసివచ్చినప్పుడు, వారి పింతల్లి కొడుకు "యాభై మాటల ఇంగ్లీషు వాక్యం మాటామాటా విడగొట్టి యిచ్చాడు"ట వ్యస్తాక్షరి. తప్పుతారేమోనని భయపడ్డారుటగాని, శాస్త్రిగారు బాగానే చేశారుట. అడిగినతను బి.ఏ ఆనర్సులో పరీక్ష ఇచ్చినతను. అయితే శాస్త్రిగారి నిరసన భావం ఇంగ్లీషు కాస్త చదువుకుని విర్రవీగే కుర్రవాళ్ళ ప్రవర్తన గురించే గాని, ఇంగ్లీషుభాషా, ఆంగ్లసంస్కారం పట్లాకాదు. "ఇంగ్లీషు చదువుతున్న కుర్రవాళ్ళు అసందర్భంగా ప్రవర్తిస్తున్నారంటే ందుకా్కరణం ఇంగ్లీషుకాదు. తల్లిదండ్రులకు శ్రద్ధలేకపోవడమూ, గురువులు ాగే తయారయివుండడమూనూ" అంటారాయన. పిల్లలకి సభ్యత, సంస్కారం ువడేలా చేయడం గురించి తమతండ్రిగారు "చాలా నిక్కచ్చిగా వుండేవారని ుబుతూ, "తల్లిదండ్రులు మొదణ్ణుంచీ సరి అయిన శిక్షణ అలవరిస్తే పిల్లల

కనుక ప్రవర్తన యెందుకలవడుతుంది?....జాతిని పెంచేది "పశుప్రవృత్తి",జాతిని సరిదిద్దేదిమాత్రం "మానవప్రవృత్తి"అని తమ నిశ్చితాభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. పైగా "ఇప్పుడు తగ్గిపోయింది కాని, నా చిన్ననాడు పిల్లనివ్వడం లోనూ, పుచ్చుకోవడంలోనూ సంప్రదాయానికి ప్రాధాన్యం. మరి సంప్రదాయం అంటే క్రమ ప్రవర్తనమే-చదువూ కాదు, ప్రయోజకత్వమూ కాదు" అంటారాయన.

అయినా, తమకు ఆ ఇంగ్లీషు చదువూ, ప్రయోజకత్వమూ కొరవడినందుకూ, తమకు అత్యంత ప్రేమపాత్రురాలైన భార్య "సీత"ని సుఖపెట్టలేక పోతున్నందుకూ, పెళ్లయాక కూడా తల్లిదండ్రుల మీద భారంగా ఉన్నందుకూ అప్పుడప్పుడు బాధపడేవారు.

డబ్బు సంపాదన మీద ధ్యాస ఉండేది కాదాయనకి. తెలుగు "భాష పరసీమలు చూడాలి. గజంయెత్తు పుస్తకాలు రచించాలి" – ఇదే శాస్త్రిగారి ఆశయం. "కొత్త సంగతులు తెలిపి, కొత్త రుచులు మప్పి, కొత్త చూపు అలవర్చి కొత్త దారులు కనపరిచి, కొత్తశక్తి సంఘటించి, కొత్త ఆవేశం పురికొలిపి, కొత్త ప్రపంచంలో వురికించే కొత్త వాఙ్మయం" సృష్టించాలని ఆయన తపన. "అయ్యో దినాలు గడిచి పోతున్నాయి. గ్రంథాలు రచించి గుట్టలు పెట్టడం యెప్పుడూ?" అంటూ తహతహలాడిపోతూ, ఆ స్థితిలో రాత్రి పదిగంటలయాక ఇంట్లో పెద్దవాళ్లంతా నిద్రపోయాక, అప్పుడు స్వేచ్ఛగా పడకగదిలో ప్రవేశించి అప్పటికే గాఢనిద్రలో ఉన్న భార్య సీతని చూసి "పొంగిపోయి" వెంటనే బుడ్డి దీపం పెట్టుకొని సందుకాపెట్టిదగ్గిర కూచునే వారుట గ్రంథరచనకి. మరొక్కప్పుడు, "పర్సులో (బహూమితంగానే) డబ్బుండినా దృష్టి రచనా వ్యగ్రమై కదల లేక కలమూ కాగితాలూ కిందబెట్టలేక, కూరల కోసం బజారుకి వెళ్ళాలన్న స్ఫురణ కలక్క, "కూరగాయలేవీ లేవుమరి" అంటూ వంటింట్లో నుంచి కేక వినవచ్చినా ప్రకృతిలోపడలేక, వేళకి మాత్రం పీట మీదికి వెళ్ళి – ఆపూటకు వూరగాయలతోనూ చారు మజ్జిగలతోనూ భోజనం అయిందనిపించుకుని చెయ్యి ఆరడం తడువుగా మళ్ళీ కలంపట్టి, దాంతో ప్రపంచం మరిచిపోయిన సందర్భాలెన్నో వున్నాయి" అని జ్ఞాపకం తెచ్చుకుంటారు శాస్త్రిగారు తమ ప్రవృత్తినీ ప్రవర్తననీ.

## భార్యతో అనుబంధం.

ఇటువంటి సన్నివేశాలు మరిన్ని కల్పిత సంఘటనలతో, మరిన్ని వ్యంగ్య శృంగార భరిత సంభాషణలతో "యావజ్జీవం హోష్యామి", "షట్కర్మయుక్తా" వంటి కథల్లో దర్శనమిస్తాయి. భార్య సీత మీద శాస్త్రిగారికి ఎంత ప్రేమఉండే దంటే శాస్త్రిగారు పక్షవాతంతో మంచానపడ్డాక తమ అవసానదశలో మరణం సమీపిస్తున్నదని తెలుసుకుని. పురిపండ అప్పలాస్వామిగారికి రాసిన ఉత్తరంలో "నా భార్య నన్నేకవిధాల కాపాడింది. చిన్నప్పణ్ణుంచీ దాన్ని కష్టపెట్టాను గాని సుఖపెట్టలేకపోయాను" అని పశ్చాత్తాపంతో బాధపడుతూ "నా కుటుంబం చెట్టు కింద వుంది. మీరు సాయం చెయ్యండి... మీలాగ మనసిచ్చిన వారు నాకు మరొకరు లేరు'' అంటూ అర్థించారు.

## తెలుగు భాషమీద అభిమానం :

శాస్త్రిగారు తెలుగులో రచనలు చేయడానికి తమ జీవిత కాలాన్నంతా వినియోగించారు. కులవిద్యలన్నీ నిరసన భావంతో విడిచిపెట్టేసి కొత్తదారి తొక్కారు.

## కవిత్వ సాధన :

ఆదిలోనే ఆయన దృష్టి తెలుగు వచన రచన మీదే పడినప్పటికీ, తరవాత కవిత్వం సాధించాలనే పట్టుదల పెరిగింది. ''వైదిక సంప్రదాయం విడిచిపెట్టినందుకు, కుటుంబంలో కవిత్వ సంప్రదాయం ప్రారంభించా"లన్న కొత్త దృక్పథం ఏర్పడటమే ఆయన పట్టుదలకి కారణమైంది. అప్పటికింకా శాస్త్రిగారికి ''భాషలో ప్రావీణ్యం లేదు సాహిత్యంలో పటిమలేదు, భావనలో నైశిత్యంలేదు. రచనలోనున్నూ అనుభవంలేదు, వెనకా ముందూ చూసుకోకుండా ''నాటకాద్యం కవిత్వం'' అని సూత్రీకరించా''రాయన–అలంకారికులు ''నాటకాంతం కవిత్వం" అన్నదానికి విరుద్ధంగా. అప్పటికి ''ఛందస్సు లేశమున్నూ తెలియదు ''ఆయనకి. ''సాహిత్య ప్రయోజనం జ్ఞానమూ, కవిత్వ ప్రయోజనం ఆనందమూ... యీ దృష్టిలో చూస్తే వాఙ్మయ నిర్మాతకు అంత ఛందః పరిజ్ఞానం అగత్యమా? అనీ, ఛందస్సు మిక్కిలి అగత్యం కాదు'' అనీ ఆయన అభిప్రాయపడినప్పటికీ,

ఛందస్సు క్షుణ్ణంగా తెలుసుకోవడానికి తరవాత తీవ్రంగా కృషిచేసి, కవితా సాధన చేశారు. తెలుగు కావ్యాల్ని గురించి ప్రస్తావిస్తూ, "ఆముక్తమాల్యదా, వసు చరిత్రా, శృంగార నైషధమూ, పాండురంగ మాహాత్మ్యమూ చదివి, అవగతం చేసుకుని తన్మూలంగా ఆనందించగలగడం తెనుగువాడికి చెప్పుకోతగ్గ అదృష్టం" అన్నది తన "నమ్మకం" అంటారు శాస్త్రిగారు.

"కవిత్వం అందరికీ తెలిసేటట్టుండాలి" అనే "క్రొత్త నినాదం" గురించి ప్రస్తావిస్తూ, "కవిత్వం మనిషికి తనంతట తానే తెలిసిపోవాలా, ప్రయత్నించి మనిషే కవిత్వం తెలుసుకోవాలా ? ప్రతీమనిషి హృదయమూ స్పందిస్తుందా కవిత్వానికి, పోనీ?....కవిత్వం మాటల్లోలేదు, మాటల కూర్పుల్లో ఉంది. ఆ కూర్పు అవగాహన చేసుకోగల వారికే అనుభూతం అవుతుంది కవిత్వం. శబ్దార్థ పరిజ్ఞానం వేరూ, శబ్ద రచనా వైచిత్రి అవగాహన చేసుకునే యోగ్యత వేరూను. కవి ప్రవృత్తిని బట్టి కూర్పు, విశదమూ కావచ్చు, క్లిష్టమూ కావచ్చు. ఎంత సరళమైన భావం అయినా క్లిష్టపదబంధంలో ఇమడ్చడం వొక గుణం కాని, దోషం కాదు. రచనకు క్లిష్టత మాత్రమే దోషం. గర్హ్యమున్నూ" అంటారు శాస్త్రిగారు.

అయితే వచన రచనలో గ్రాంథికంలో అయినా వ్యావహారికంలో అయినా అనుభూతం అయ్యే ఆనందం పద్యరచనలో తమకెప్పుడూ కలగలేదంటారు ఆయన.

## చారిత్రక ఇతివృత్తాలు :

శ్రీపాద వారి రచనల్లో చారిత్రక ఇతివృత్తాలతో రాసిన నవలలూ, నాటకాలూ ముఖ్యంగా చెప్పుకోవాలి. అందులోనూ "వీరపూజ" అంటే వారికి అత్యంత ప్రీతికరం. ఆయన రచించిన "శ్మశాన వాటిక"(విషభుజంగం) నవలకు "పులిబూరు" గ్రామ వినాశం కథా వస్తువు. కాని, అది వారి కల్పనే. ఆయన స్వగ్రామం పొలమూరు, ఆదిలో "పులిబూరు" అన్న పేరుతో గోదావరి ఉత్తర వాహిని తూర్పుగట్టున ఉండేదిట. ఎలా తటస్థించిందో గాని, అంతకు ముందు "పులిబూరు" ఉన్నచోట శ్మశానం ఏర్పడిందిట తరవాత. ఆ కారణం వల్ల శివాలయం అనుకుని అరమైలు దూరంలో తూర్పున మళ్ళీ రూపొందిందిట.

అపూరు. దాన్నే తరువాత పొలమూరు అని వ్యవహరిస్తూ వచ్చారుట. పద్నాలుగో శతాబ్దంలో పులిబూరు విద్యాపీఠంగా ఉన్నట్లు రెండు శాసనాలు కూడా ఉన్నాయట.

బంకించంద్రుడి నవలలు చదివాక శాస్త్రి గారికి ఒక నిర్దిష్టమైన దృక్పథం ఏర్పడిపోయిందిట. "నా రచన చదివిన అంధుడు పదహారణాల ఆంధ్రుడయి నిలవగలగా లెక్కడికి వెళ్ళినా. ఇరుగు పొరుగు జాతుల వారితో కలిసి మెలిసి ఉంటూ, పనిపట్టినప్పుడు పదహారు వన్నెల భారతీయుడుగా రూపొందగలగాలి, "విశాల విశ్వంలో" అనే ధోరణిలో ఉండి. చారిత్రక ఇతివృత్తం రాయాలంటే అది తెలుగు కథే అయి ఉండాలనుకున్నారు మొదట్లో, కానీ, యాదృచ్ఛికంగా, ఆ రోజుల్లో పులుగుర్త నరసమాంబగారు నిర్వహిస్తున్న 'సావిత్రి' పత్రికలో "పుల్ జానీ బేగం" అన్న కథ-శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారి రచన చూడటం తటస్థించింది. దాన్ని ఆధారంగా చేసుకుని నవల రాయమని శాస్త్రిగారి ఆప్తమిత్రుడు మల్లిడి సత్తిరెడ్డిగారు ప్రోద్బలం కలిగించగా, శాస్త్రిగారు మీమాంసలో పడ్డారు. అది గొప్ప కథే అయినా, తెలుగు కథ కాకపోయిందన్న మీమాంస అయితే, "పుల్ జానీ బేగమ్" అన్నది ఔరంగజేబు పెట్టిన పేరుట. అసలు పేరు "కమలాబాయి"-ఏసాజీ భార్య-నారాయణరావు శిరకే కొడుకూ కోడలూ-వారిది దివ్యప్రేమట. మహారాష్ట్ర జాతి అంటే శాస్త్రిగారికి ఒక విధమైన ప్రత్యేకాభిమానం ఏర్పడిందిట. ప్రాజ్ఞత వచ్చినప్పటి నుంచీ. ఆకారణం వల్లనే ఆ కథని నవలగా రాయడానికి నిశ్చయించుకున్నారు చివరికి. అదే వారి "మిధునానురాగం."

ఈ అనుభవంలోనే, తరవాత వారు రాసిన "వీరపూజ" నవలకు బీజం పడి ఉంటుంది. "వీరపూజ" నవల వారి దృష్టిలో "తెనుగులో అపూర్వ రచన... అంతకు ముందే కాదు. తరువాత కూడా అలాంటి రచన పుట్టలేదు. వచన వాఙ్మయంలో" ఆ నవలలో "గోరీ విషయమై పృథ్వీరాజూ, అల్లాయుద్దీను విషయమై భీమసింహాదులూ చూపించిన ఔదార్యం" గురించి శాస్త్రిగారు చేసిన వివరణా, చాణుక్యుడి గురించి ప్రస్తావిస్తూ రాజనీతి గురించి చేసిన వ్యాఖ్యలూ ఎందరో పండిత విమర్శకులకు చర్చనీయాంశాలై, తెలుగు సాహితీ లోకంలో సంచలనాన్ని సృష్టించాయా రోజుల్లో.

"విమానం యెక్కబోతూనూ" అన్నది చారిత్రక ఇతివృత్తంతో రాసిన మరో కథ. తాంధ్ర పాపారాయుడు ఓడిపోయి శత్రువుల చేత చిక్కాడన్న వార్త విని అతడి భార్య ఆత్మాభిమానాన్ని నిలబెట్టుకోవడానికి ఆత్మహత్య చేసుకోవడం గురించి రాశారు శాస్త్రిగారు.

శ్రీపాద వారి రచనా వ్యాసంగం ఒక ఎత్తూ, గ్రంథ ప్రచురణా, పత్రికా నిర్వహణా ఒక ఎత్తూనూ మొట్టమొదట తండ్రిగారి ఆదేశాను సారం పంచాంగం ప్రచురణ కోసం రాయవరం వెళ్ళడం. మల్లిడి సత్తిరెడ్డిగారితో పరిచయం ఏర్పడటంతో మొదలైంది శాస్త్రిగారికి గ్రంథ ప్రచురణలో అభిరుచీ, ఆసక్తి సామర్థ్యమూనూ. చివరికి కవిగానూ వచన రచయితగానే కాక, ప్రచురణకర్తగా, పత్రికా సంపాదకుడిగా "ప్రబుద్ధాంధ్రుల"నిపించుకున్నారు.

## జాతీయతా, మానవతా :

శ్రీపాదవారు చారిత్రక నవలలూ, నాటకాలూ, సాంఘిక, మనో విశ్లేషణాత్మక నవలలూ, కథలూ, వ్యాసాలూ, వ్యంగ్య రచనలూ, రూపికలూ-ఏవి రాసినా ఆంధ్ర జాతి పట్లా, తెలుగు వచనం పట్లా, అనుబంధం, ఆప్యాయతా, భారతదేశం పట్ల అభిమానంతో బాటు, తత్త్వజిజ్ఞాస. తాత్త్విక దృష్టితో కూడా రాశారు. జాతీయత, మానవత రెండూ అన్యోన్యమైనవనే ఆయన సిద్ధాంతం.

"మనిషయిన వాడు నివృత్తి మార్గంలో "నేను" "నాది" అన్న చిత్తవృత్తి చంపుకుంటేగాని ముందుకి వెళ్ళలేడు. అలాగే మనిషయిన వాడు, ప్రవృత్తి మార్గంలో "నేను" "నాది" అన్న చిత్తవృత్తి దృఢపరచుకుంటేగాని ముందుకి వెళ్ళలేడు ...అర్థం చేసుకోగలిగితే, ఈశ్వర నిర్ణయమే ఇది కనక, తెనుగు వాళ్ళం మనం తెనుగు వాళ్ళమే. బంగాళీలు బంగాళీలే. తమిళులు తమిళులే.... వీరి కందరికి ప్రత్యేక దేశాలున్నాయి. ప్రత్యేక భాషలున్నాయి. ప్రత్యేక చరిత్రలున్నాయి. ప్రత్యేక సంప్రదాయాలున్నాయి.... అయితే మరి, భారతీయుల మాట?.... మన పూర్వులు-మన ధార్మిక వ్యవస్థ యేర్పాటు చేసిన మహర్షులు "ఛప్పన్న దేశాలు" అన్నారు. "భరతఖండమూ" అన్నారొక నోటితోనే. అంటే, ఇటు పృథక్త్వమూ నిర్ధారణ చేశారు కావాలని.

అటు యేకత్వమూ ప్రతిపాదించారు తెలివిగా''- అని తమ సిద్ధాంతాన్ని విపులీకరించారు శాస్త్రిగారు తమ జ్ఞాపకాల గ్రంథంలో.

## హేతువాదం :

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సనాతన వైదిక కుటుంబంలో ఉద్భవించిన విలక్షణమైన హేతువాది. ఆయన ఉద్దేశంలో-''ఐహిక జీవితంలో వడిదుడుకులెక్కువ. అయితే మనిషి బుద్ధి వాటిని అధిగమించగలదే.

"ఇక్కడి నియమ నిబంధనలన్నీ మనిషి బుద్ధి విభవాలే. దేవుడు సాయించినవి కావు''. ''వాటి పరమ ప్రయోజనం ఇది స్వర్గం కావడమే. ఇది స్వర్గం చేసుకోలేని వాడు. అక్కడ స్వర్గం అంటూ ఉంటే అది మాత్రం యెలా సాధించుకో గలుగుతాడూ?'' అన్నది ''మార్గదర్శి" కథలో ఆయన తెలుగువారికిచ్చిన సందేశం. గురుకులంలో నేర్చుకున్న విద్యల్ని ఉదర పోషణార్థం వినియోగించడం కాకుండా, తమ అభిరుచుల ప్రకారం, ఆశయాల ప్రకారం ఆత్మ విశ్వాసంతో, గతుకుల బాటపై జీవన యాత్ర సాగించి కృతార్థులైన ధీశాలి, మేధావీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

(శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి శత జయంతి సందర్భంగా)
(ఆంధ్రప్రభ, సాహిత్య ప్రభ, 21-4-91, 21-7-91, 28-7-91)

---

# శ్రీ శ్రీ కథనం

'కథానికలు ఇలా ఉండాలి' అని ఎవరు ఏ రకమైన నమూనాలు చూపించినా, వాటితో శ్రీ శ్రీ కథల్ని సరితూచడం సాధ్యంకాదు. శ్రీ శ్రీ కథా శిల్పం విలక్షణమైనది. శైలి విశిష్టమైనది. వస్తువు విశ్వజనీనమైనది.

తనకు తెలిసిన, తన చుట్టూ ఉన్న సమాజంలోని వ్యక్తుల్నే భిన్న భిన్న రూపాల్లో ప్రదర్శించారు శ్రీ శ్రీ. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య, వ్యక్తి పై మనస్సుకీ లోపలి మనస్సుకీ మధ్య గీతలు పూచికపుల్లల్లా చైతన్య స్రవంతిలో కొట్టుకు పోతాయి. బీటలు తీసిన అద్దాల్లో భగ్న ప్రతిబింబాలు దర్శనమిస్తాయి. కలలూ, నిజాలూ కలగాపులగం అవుతాయి.

హాస్యం, గాంభీర్యం, ఆనందం, ఆవేదన, రాత్రీ, పగలూ; జీవితం, మరణం సమానాంతరంగా పోతూ, మధ్య మధ్య కలిసిపోతూ, మళ్ళీ వేరవుతూ- చకచకా ముందుకు సాగిపోతాయి. ముందుకి చూస్తూ వెనక్కి పోతాయి మాటల గారడిలో. మంచీ, చెడూ, వెలుగూ, చీకటీ, ఔను, కాదుల ఆల్జీబ్రా ఫార్ములాలో జీవిత తత్త్వ దర్శనం చేయిస్తారు శ్రీ శ్రీ. శ్రీ శ్రీ కథ ఒక విలక్షణ కళారూపం.

డికెన్స్, సారోయాన్, జాయిస్, కాఫ్కా, ఇంకా ఎందరో ప్రముఖ పాశ్చాత్య రచయితల విశిష్టతలను ఆకళింపు చేసుకుని, తన రచనల్లో సహజసిద్ధమైన ప్రతిభని ప్రదర్శించిన కథకుడు శ్రీ శ్రీ.

ప్రప్రథమంగా కవి, తరువాత కథకుడు అనిపిస్తుంది స్థూలంగా చూస్తే. కానీ సూక్ష్మగ్రాహికి శ్రీ శ్రీ ప్రతి కవితలోనూ ఒక కథ కనిపిస్తుంది. శ్రీ శ్రీ కథనం అటువంటిది- కథనంలో కవితా హృదయం- బంగారానికి పరిమళం అబ్బినట్లు.

శ్రీ శ్రీ కలం పట్టినప్పటినుంచీ కవిత్వం రాయడానికి పూనుకున్నప్పటికీ, కథలు రాసినది చాలావరకు ప్రథమ దశలోనే, అంటే, 1928 నుంచి 1949 వరకూ అనుకోవచ్చు.

గ్రాంథిక శైలిలో అపరాధ పరిశోధకకథతో ఆరంభించి, "చైతన్య స్రవంతి శైలి"లో అధివాస్తవిక రచనలదాకా శ్రీ శ్రీ కథన విన్యాసాల్ని గమనించవచ్చు.

"చిత్రరహస్యం" అనే అపరాధ పరిశోధక కథ (షెర్లాక్‌హోమ్స్ అపరాధ పరిశోధనకి అనుసరణ) 'భారతి'లో 1928 జూలైలో ప్రచురితమైంది. దీన్ని గ్రాంథిక భాషలో రాశారు. అది ఆ రోజుల్లో సంప్రదాయమే.

కానీ, ఆ మరుసటి సంవత్సరంలోనే, వ్యావహారికశైలిలో రాసిన "సశేషం" అనే చిన్న కథ 'ఆనందభారతి'లో అచ్చయింది. ఇది "కథ రాయడం" గురించి ఒక చమత్కార రచన.

అటువంటివి తరవాత రోజుల్లో వ్యాసరూపంలో "వారం వారం" శీర్షికను కొన్ని రాశారు.

1929లోనే, చార్లెస్ డికెన్స్ రాసిన "పిక్ విక్ పేపర్స్" ఆధారంగా శ్రీ శ్రీ రాసిన "సోములు చెప్పినకథ" 'భారతి'లో వచ్చింది. ఈ అనుసరణ కథలోనే కాక, తరవాత శ్రీ శ్రీ సొంత కథల్లో కూడా హాస్యం, అపహాస్యం ప్రధాన లక్షణాలుగా కనిపిస్తాయి.

ఆశ్చర్యకరమైన విషయం– 1931లో 'గృహలక్ష్మి'లో అచ్చయిన "చిన్నబాబు" అనే కథని మళ్ళీ గ్రాంథికంలో రాశారు శ్రీ శ్రీ. ఈ కథ ఒక కుక్కపిల్ల గురించి. అది ఒకరకంగా హిలెయిర్ బెల్లాక్ పిల్లి మీద రాసిన కథని గుర్తుకి తెస్తుందన్నారు ఆ కథని ప్రచురించిన 'గృహలక్ష్మి' సంపాదకుడు.

తనకు బాగా నచ్చిన పాశ్చాత్య రచయితల కథల్ని శ్రీ శ్రీ, కొన్ని అనువాదం చేశారు. కొన్నిటిని అనుసరించి రాశారు. విలియమ్ సారోయాన్ గురించి శ్రీ శ్రీ– "అమెరికాలో.... ఈనాటి కథకులందరిలో ఒక ప్రత్యేకమైన బాణీ ఉన్న సారోయాన్ టెక్నిక్‌కి అతని అన్ని కథలూ ఉదాహరణలే. అతనిది వినూత్నమైన శైలి. విలక్షణమైన దృక్పథం. విచిత్రమైన కంఠధ్వని" అన్నారు.

"కథారచనలో నవీన సంవిధానానికి ముందుగా పేర్కొనవలసినవాడు సారోయాన్" అని చెబుతూ, అతని ఉత్కృష్ట కథలలో ఒకటిగా "1,2,3,4,5, 6,7,8" అనే కథకి అనువాదంచేసి తెలుగు పాఠకులకు అందించారు శ్రీ శ్రీ.

"ప్రథమ పురుషలో చెబుతూ హఠాత్తుగా ఉత్తమ పురుషలోనికి కథను మార్చడంలో రచయిత వైదగ్ధ్యం గోచరిస్తుంది" అంటూ ప్రశంసించారు సారోయాన్ కథాశిల్పాన్ని.

ఆందోళనతో, ఒంటరితనంతో క్రుంగిపోయే ఆధునిక మానవుడి ప్రపంచాన్ని వాస్తవికంగానూ, స్వాప్నికంగానూ చిత్రించే కాఫ్కా అన్నా శ్రీ శ్రీకి ఇష్టం.

శ్రీ శ్రీ కథల్లో కూడా చాలావరకు ఈ వాస్తవికత, స్వాప్నికత సమ్మిళితం కావడం చూస్తాం. ఇందుకు ప్రతీకగా "ఒక్క కల" అనే చిన్న కథని తీసుకోవచ్చు. జీవితంలో కలలకి ఎంత ప్రాధాన్యం ఉందో, కథకీ, కలకీ, కళకీ ఉన్న సంబంధం ఏమిటో, కలల అంతరార్థం ఏమిటో వివరిస్తారు శ్రీ శ్రీ "ఒక్క కల"లో-

"నేను కథ రాయడంలేదు. కల రాస్తున్నాను....కల సంగతి మాటల్లో చెప్పడం కష్టం. గొప్ప కళ గొప్ప కల: అది ఏక కాలంలో మనకు నవ్వూ, ఏడుపూ, భయం, కోపమూ, అసహ్యమూ, ఆవేశమూ-ఇంకా ఎన్ని ఉంటే అన్నీ కలిగిస్తుంది .. మనం ఎక్కడున్నామో, ఎప్పుడున్నామో, ఎక్కనున్నామో, దిగనున్నామో, ఎందుకున్నామో, ఏంకన్నామో అప్పుడప్పుడు కలల్లో. అదీ అస్పష్టంగా తెలుస్తుంది. దాన్ని సాధ్యమైనంత స్పష్టంగా (నీకేగాక అందరికీ) మాటల్లోనో, రంగుల్లోనో, సంజ్ఞల్లోనో, ధ్వనుల్లోనో, లేదా సినిమాలలోలాగా ఈ అన్నింట్లోనో తెలియజెయ్యగలగడం కళ!

జేమ్స్ జాయిస్ వంటి ఆనాటి సుప్రసిద్ధ పాశ్చాత్య రచయితల ప్రభావం ఉన్నప్పటికీ, శ్రీశ్రీ కథనంలో తెలుగుతనం, సున్నిత హాస్యం, జీవిత విశ్లేషణలో ప్రత్యేకత, సహజత్వం ఉన్నాయి. శ్రీ శ్రీ తన ప్రత్యేక శైలిలో "సర్రియలిజమ్"నీ, "చైతన్య స్రవంతి"నీ తన రచనల్లో ప్రదర్శించడంలో సిద్ధహస్తుడనిపించుకున్నారు.

"ఇండియాలో నువ్వొక్కడివే సర్రియలిస్టువనడానికి నాకు సందేహం లేదు" అంటూ రాశాడు హెన్రీమిల్లర్, 1948 ఫిబ్రవరిలో శ్రీ శ్రీకి రాసిన ప్రత్యుత్తరంలో.

ప్రభుత్వ నియంతృత్వంవల్ల జైలుపాలైన ఒక యువకునికి వచ్చిన ఘోర స్వప్నం "పంచపాండవులు" కథ.

మేలుకొన్న తరవాతకూడా ఆ కల కవి "విశ్వాన్ని, విశ్వాసాన్ని" కుదిపి వేస్తుంది. భయంతో కళ్ళు తెరిచి, జైల్లో చీకట్లో ఉన్నట్లు పోల్చుకుంటాడు. "భగవంతుడనీ, అభ్యుదయమనీ, సత్యమనీ, ధర్మమనీ, సుఖదుఃఖాలనీ. జనన మరణాలనీ మనం అనేస్తున్నప్పుడు మనకి తెలియకుండా ఎంతెంత ప్రచండ శక్తుల్ని మేలుకొల్పుతున్నామో ఆలోచిస్తూ ఉంటే ఆశ్చర్యం కలుగదూ?" అని విస్తుబోయి "రెక్కలు ధరిస్తే మాత్రం ఎక్కడికి వెళ్లగలవోయ్ మానవుడా ?" అనుకుంటాడు వెంటనే. మానవుని ఆలోచనలు ఎంత మహోన్నతమైనవనిపించినా, అవన్నీ ఊహ లేనన్న నగ్నసత్యాన్ని గ్రహిస్తాడు ఆ కవి.

ఇది అందరికీ సులభగ్రాహ్యం కాని కథ. "ఒక్కల" సరదాగా ఉందనిపించే కథ. కానీ, "పంచపాండవులు" కథ చదివినవారి మనస్సుల్ని కలచి వేస్తుంది. ఏదో తెలియని బాధ ఆవహిస్తుంది.

శ్రీశ్రీది అసాధారణమైన శైలి. అది మామూలుగా, తిన్నగా సాగదు. కొంత హాస్యం, కొంత గాంభీర్యం కలిసినట్లూ, మాటలతో ఆటలాడుతున్నట్లూ, మాటల అంతరార్థాల బరువుకి ఊగిసలాడుతున్నట్లూ ఉంటుంది.

శ్రీశ్రీ అపురూప సృష్టి "కోనేటిరావు". మధ్యతరగతి సగటు మనిషిని "బీటలు తీసిన అద్దంలో" చూపిస్తాడు రచయిత. ఈ అద్దంలో–కోనేటిరావు దిన చర్యలో అతని మనస్తత్వం దోబూచులాడుతూ పాఠకులకు ఆహ్లాదం కలిగించడంతోబాటు ఆలోచనలు రేకెత్తిస్తుంది. కోనేటిరావు మరో అవతారం "అశ్వమేధ యాగం"లో సాక్షాత్కరిస్తుంది. అక్కడేకాదు, దాదాపు అన్ని కథల్లోనూ అనేక రూపాల్లో దర్శనమిస్తూనే ఉంటాడు.

శ్రీశ్రీ కథల్లో ముఖ్యంగా చెప్పుకోదగినది "ఒసే, తువ్వాలు అందుకో". కథావస్తువునిబట్టీ సున్నితమైన హాస్యాన్ని బట్టీ, ఇది అసలు సిసలైన తెలుగు కథ. శ్రీశ్రీ రాసిన మంచి కథల్లో ఒకటి అని చెప్పవచ్చు.

ఈ కథలో భర్త స్నానాల గదిలో స్నానంచేస్తూ ఉంటాడు. భార్య వంటింట్లో వంటచేస్తూ ఉంటుంది. ఎవరి ఆలోచనల్లో వారుంటారు. మధ్య మధ్య ఇద్దరిమధ్యా సంభాషణ ముక్తసరిగా, వ్యంగ్యంగా సాగుతూ ఉంటుంది–మధ్యతర

గతి కుటుంబ వాతావరణాన్ని, విలువల్నీ, భార్యాభర్తల మధ్య లోపించిన అను బంధాన్నీ వెల్లడిస్తుంది ఈ కథానిక. చైతన్య స్రవంతిని చక్కగా వినియోగించిన కథానిక ఇది. భర్త ఆలోచనలూ, భార్య ఆలోచనలూ, వారి సంభాషణలూ, రచయిత కథనం కలిసి ముచ్చటైన శిల్పంగా రూపొందడం పాఠకుల్ని మురిపిస్తుంది ''కనువిప్పు'' కలిగిస్తుంది.

1938లో 'భారతిలో' అచ్చయిన "సీతయ్య" కథ సాంప్రదాయకంగా చూస్తే కథలా కనిపించదు. అది ఒక "ఆలాపన" అని కథకి పెట్టిన ఉపశీర్షిక తెలియజేస్తుంది. సీతయ్య అనే కథానాయకుడు ఎటువంటివాడో, ఎలా ఉంటాడో చెబుతానంటూనే, చెప్పీ చెప్పకుండా చెబుతాడు రచయిత. కానీ, ఏ ప్రత్యేక సంఘటనగానీ, కథగానీ ఏదీ ఉండదు అందులో. అసలు సీతయ్యే లేడు. అదొక ప్రయోగం.

అందులో రచయిత ఉదహరించిన పాశ్చాత్య రచయితల రచనల్లోని ముఖ్య పాత్రలవల్ల కలిగిన స్ఫూర్తితో రాసిన ''కథ'' ఇది కొంతవరకు.

''సీతయ్య" లాంటిదికాదు ''నేటి హిరణ్యాక్షుడు'' కథ. కథానాయకుడు నమశ్శివాయే నేటి హిరణ్యాక్షుడు. సీతయ్యలాగ కాకుండా నమశ్శివాయ స్పష్టంగా దర్శనమిస్తాడు మనకి. సజీవ మూర్తిలా నిలుస్తాడు మన ఎదుట. అతణ్ణి మనం పోల్చుకోగలం. కథ ముగింపు ఒక చమత్కారం.

''బొమ్మ" కథ చాలా చిన్నదైనా, జీవితమంత పెద్ద సత్యాన్ని ఇముడ్చుకున్నది. కథానాయకుడు ఒక బొమ్మకొన్నాడు. కొన్నప్పటినుంచీ దానితోనే లోకం, దానితోనే సంభాషణలు. దానికి బానిస అయిపోతాడు. "చేసుకున్న పాపం లాంటిది కొనుక్కున్న బొమ్మ" అంటాడు.

బొమ్మ కొనాలనుకోవడం అయినా, ఏ కోరిక అయినా అంతేకదా- తన కోరికకి తానే దాసుడవుతాడు మనిషి. ఆ కోరిక ఎదుటివారికి సహేతుకం, సక్రమం అనిపించకపోవచ్చు- ''బొమ్మ'' కథలో కథానాయకుడి ''శిల్పి మిత్రుడు'' బొమ్మని విమర్శించినట్లు. కథానాయకుడు ఆ విమర్శని పట్టించుకోడు. బొమ్మకి కీలుబొమ్మ అవుతాడు, అవుతున్నట్లు తెలిసికూడా !

"శూర్పణఖా మాన సంరక్షణం" అనే చిన్నకథలో రామాయణం మొదలు

కాని [illegible] ఎన్నో సత్యాలు– ప్రగాఢమైనవి– హాస్యస్ఫోరకంగా దర్శనమిస్తాయి.

[illegible] రాయడానికి ఎన్ని తిప్పలు పడాలో, రాయడంలో ఎన్ని [illegible]లుంటాయో చెబుతారు శ్రీశ్రీ "అనామిక" కథలో. ఇతివృత్తాన్ని తీసుకోవడం, కథానాయకుణ్ణి ఎంచుకోవడం, కథాకాలాన్ని నిర్ణయించుకోవడం, కథావస్తువుని అన్వేషించడం– ఈ కష్టాల్ని ఒక ఆధునిక కథా రచయిత ఎదుర్కొన్నవైనమే "అనామిక" కథ.

శ్రీశ్రీ "అనామిక"లో ఇలా చెప్పారు– "వస్తువు గుణం వాస్తవికత్వం. ఇది అంటిపెట్టుకున్నదే.... కొంతమంది ఒక చిటికెడు కథావస్తువు తీసుకుని గంగాళం కొద్దీ కషాయాన్ని కలుపుతారు. మరి కొంతమంది చవగ్గా దొరికింది కదా అని గంగాళమంత కథావస్తువుని తీసుకుని చెమ్చాలో ఇమిడిపోయేటంత చిన్నకథ రాస్తారు. తేనె కలుపుకుని ఔషధప్రాయంగా దాన్ని దిగమింగాలి. కథ అయిపోతుంది. కథావస్తువు మిగిలిపోతుంది.

సమాహారంగా కథావస్తువు వుండాలంటే కథ తాలూకు కొలతలు తీసుకుని దానికి సరిపోయినంత వస్తువు కూరడం ఒక పద్ధతి. దొరికిన కథావస్తువుకే కొలతలు కట్టి కథ కట్టడం ఇంకో పద్ధతి అయితే, తయారయిన కథలో ఇంత వస్తువుందని ఎవరూ తూనిక వేసి చెప్పలేరు".

కథానిక వచనంలోనే ఉండాలన్న పట్టింపూ, సంప్రదాయమూ లేకపోతే, "భిక్షు వర్షీయసి" అత్యుత్తమ కథానిక అని చెప్పవచ్చు! ఆ కవితలోని ముసలి అవ్వ మళ్ళీ "హేమంతం" కథలో సాక్షాత్కరించి, "మీ జీవితాలను, వార్ధక్యాలను, మా నైచ్యాలను, కూడా మా దారిద్ర్యాన్ని నేటి సంఘ పరిస్థితులమీద సవాల్‌గా వదులుతున్నాం" అని హెచ్చరించి అంతర్ధానమవుతుంది. ఆమె గొంతు ఈనాటికీ హెచ్చరిస్తూనే ఉంది– సంఘాన్ని తెలివి తెచ్చుకోమని.

మరొక సందర్భంలో ("ద్వితీయ ప్రారంభం" అనే వ్యాసంలో) రచనా నిబంధనల విషయమై శ్రీశ్రీ ఇలా రాశారు: "జీవించడానికిముందు జీవితపు నిబంధనలను చదువుకుంటాడా ఎవడైనా?.... రచనకి ముందు రచనా నిబంధనలతో

గింజుకోవడం మంచిదికాదు ఈత నేర్చుకోవడానికి మార్గం సాహసించి నీళ్ళలోకి దూకడమే''.

అయితే, మంచి రచయితకుండవలసిన లక్షణాల గురించి చెప్పడానికి, మంచి రచయితని ఈ విధంగా వర్ణించారు శ్రీశ్రీ- ఈ "రకం రచయిత ప్రజల మధ్య ప్రజలతో కలిసి జీవిస్తాడు. అనగా గ్రంథావలోకనం చెయ్యడని కాదు. వెనుకటి రచయితలవీ, సమకాలికులవీ గ్రంథజాలాన్ని క్షుణ్ణంగా మథిస్తాడు. ఇదంతా తన రచనా నైపుణ్యాన్ని, టెక్నిక్‌ని పెంపొందించుకోవడానికి మాత్రమే. అది ఇతరులను అనుకరించడంవల్ల లభ్యమయేదికాదు. అన్ని విధాలనూ ఆకళించు కోవడంవల్ల తనదైన ఒకానొక పద్ధతి అలవడుతుంది. అదొక ఆయుధం. దానితో ప్రజాయత్తమైన ప్రయోజనాన్ని సాధిస్తాడు".

శ్రీ శ్రీ తన "తొలి రచన" గురించి 1944లో ప్రస్తావిస్తూ ''ఇప్పుడిప్పుడు నా వ్యక్తి చైతన్యం సంఘ చైతన్యంగా మారుతోంది" అన్నారు. అంటే శ్రీ శ్రీ భావాల ప్రభావం సంఘంమీద పడటం ప్రారంభించిందని అనుకోవాలి. "ప్రజా యత్తమైన ప్రయోజనాన్ని" సాధించడం అంటే ఇదే.

శ్రీ శ్రీ కథలు ఎందుకు రాశారు, ఎలా రాశారు అనే ప్రశ్నలకి చక్కని సమాధానాలు ఆయన రాసిన "లోక కథలో కథ" అనే వ్యాసంలో లభిస్తాయి-

"కథారచనకు ఉపక్రమించేముందు పాఠకులకు ఏవేవో మహోజ్వలానుభ వాలు'' కలిగించాలనుకుంటారుట. రాసిన కథ నచ్చనప్పుడు "సంకల్పాన్ని సంతృప్తికరంగా సాధించలేకపోవడమే నా కథలో లోపం'' అని విశ్లేషించు కుంటారుట.

నలుగురూ చదివి బాగానే ఉందని అనందించినా, "ఒక గొప్ప కథను చదివినట్లు భావించరు. ఒక నూతన సత్యాన్ని తెలుసుకున్నట్లు సంతసించరు. వాళ్ళని ఉలికి పడేటట్లు చెయ్యదు'' అన్నారు శ్రీ శ్రీ. అందరు రచయితలూ అలా అనుకోకపోవచ్చునని కూడా అన్నారు శ్రీ శ్రీ.

"ప్రజాయత్తమైన ప్రయోజనాన్ని" సాధించడానికి రచించినా, ''అందరి కోసం వ్రాయమని అడగడం అసందర్భం. అందరి కోసం వ్రాస్తున్నాననుకోవడం ఆత్మవంచన'' అన్నారు శ్రీ శ్రీ- ''సద్యఃస్ఫూర్తి'' అనే వ్యాసంలో.

''సౌలభ్యం'' అనే మరో వ్యాసంలో- "కష్టంగా రాయడమంత సులభ మైన పనిలేనట్టే. సులభంగా రాయడమంత కష్టమైన పనికూడా లేదు. ఆడంబరంగా జీవించడం సులభం. నిరాడంబరంగా బతకడం కష్టం. జీవితంలోనూ, సాహిత్యంలోనూ సౌలభ్యమే సాధించతగ్గ ఆశయం'' అన్నారు శ్రీ శ్రీ.

అవును. అందులో సందేహంలేదు.

(స్వాతి, జూలై 91)

* * *

# 'కొత్తచూపు'

కథలూ, వ్యాసాలూ సామాజిక వ్యవస్థని మారుస్తాయా, దుష్టసంప్రదాయాలను రూపుమాపుతాయా ?! ఎందుకొచ్చిన రాతలు ?! అని నిస్పృహ కలుగుతుంది అప్పుడప్పుడు కొందరికి. కానీ, పదునైన కలంతో సామాజిక రూపురేఖల్ని సరిదిద్దవచ్చుననీ, కలం అనే హలంతో మనుషుల మెదళ్ళను దున్ని, కలుపు మొక్కల్లాంటి భావాలను ఏరిపారేసి, మంచిపంటలు పండేలా సారవంతంగా చేయవచ్చుననీ నిరూపించారు సంఘసంస్కరణాభిలాషులైన ఎందరో రచయితలు. గురజాడ, కందుకూరి వంటి మహామహుల అడుగుజాడల్లో నడిచినవారే శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సుప్రసిద్ధ రచయిత. అనేక ప్రక్రియలలో అసంఖ్యాకమైన రచనలు చేశారు. 'భారతి'వంటి ప్రముఖ సాహితీ పత్రికల్లో వారి కథలు తరచుగా ప్రచురింపబడుతూ ఉండేవి యాభై ఏళ్ళ క్రితం. గోదావరీ తీరపు వ్యావహారిక శైలిలో మధ్యతరగతి కుటుంబాల్లో ముఖ్యంగా, వైదిక బ్రాహ్మణ కుటుంబాల్లో స్త్రీలు పడే అవస్థల్ని చిత్రిస్తూ, అప్పట్లో విప్లవాత్మకమైన ధోరణిలో కథారచన సాగించారు శ్రీపాదవారు. వారి కథలన్నీ వాస్తవికంగా, సంభాషణా భరితంగా ఉండేవి. రచయిత వ్యాఖ్యానాలు లేకుండానే పాత్రల మనస్తత్వాలన్నీ వారి సంభాషణల్లోనే వ్యక్తమయ్యేవి. చాలావరకు సంభాషణలతోనే కథ నడిపించేవారు శ్రీపాదవారు. అదే ఆయన ప్రత్యేక శైలి.

శ్రీపాదవారి 'కొత్తచూపు' అనే కథ రచయిత సంస్కరణాభిలాషకూ, విప్లవాత్మకమైన ఆలోచనా ధోరణికీ మచ్చుతునక.

'కొత్తచూపు' అనే కథలో కథానాయిక 'అన్నపూర్ణ' తండ్రి 'శాస్త్రి'లో శ్రీపాదవారి మనసును చూడవచ్చు. "అగ్రహారం అంతటిలోనూ ఆడపిల్లని ఇంగ్లీషు చదువులో ప్రవేశపెట్టిన మొదటివాణ్ణి నేను. రజస్వల అయితేగాని పెళ్ళిచెయ్యనని అట్టే పెట్టేసిన మొదటివాణ్ణి కూడా నేనే" అని సగర్వంగా చెబుతాడు శాస్త్రి. అన్నపూర్ణ పెళ్ళిచూపుల్లో పెళ్ళికొడుకు కోరిన గొంతెమ్మ కోరికలన్నీ

విన్నమీదట ఒళ్లమండి, పెళ్ళికొడుకును నిలదీసి "ఉత్తర భారత భూముల్లో భారతీయ స్త్రీలెందరో మానభంగాలకు పాల్పడ్డారు. ఉత్తరాంధ్ర భూముల్లో మనవాళ్ళకెందరికో అలాంటిది తటస్థపడుతోంది. తెలుగు స్త్రీలకిది చావుబతుకుల సమస్య.. మీ కళ్ళయెదుట మీ ఆత్మీయులకున్నూ అలాంటిది తటస్థపడితే, తరువాత మాటయేమయినా, ముందు కళ్ళుమూసుకుని మీరు శత్రువులమీద పడగలరా ?" అని అడుగుతుంది. పెళ్ళివారంతా నిర్ఘాంతపోతారు. తండ్రి మాత్రం కూతురి దగ్గరికి వెళ్ళి "నువ్వు చదివిన చదువు సార్థకం చేసుకున్నావమ్మా" అంటూ ప్రశంసిస్తాడు.

తరవాత అన్నపూర్ణ "సాముగారడీలు" నేర్చుకుంటానంటే తండ్రి ప్రోత్సహిస్తాడు. "నన్ను పెళ్ళాడినందులకు, ఒక మొగాడికి, వరకట్నం పేరుగా నేనవరాధం ఎందుకు చెల్లించుకోవాలి నాన్నారూ ?" అని అడిగిన కూతుర్నిచూసి గర్వపడుతూ, "నా దృష్టిలో దాని దృక్పథం చాలా గొప్పగా ఉంది. ఏమయినా దాని అభీష్టం కాదనను. అసలు, మా అమ్మాయి వెళ్ళిన ఎత్తుకి నేను వెళ్ళగలనా అని అనుమానమే" అంటాడు శాస్త్రి కొందరు యువకులతో. అంతేకాదు, "ఇంకొక రహస్యంకూడా ఉంది. ఇప్పుడు బాధ్యత అంతా కన్యలమీద ఉంది. మగవాళ్ళమీదకాదు. బ్రహ్మచర్యం మీద ఉంది. గృహస్థులమీదకాదు. మరేమీ పనిలేనట్టు మన యువ, యువతుల దృష్టి మొదట్లోనే పెళ్ళిమీదికి పోతుంది. మనమది సరిదిద్దాలి ... మీరే కొత్తధర్మానికి అవలంబం. కొత్త జాతీయతకు అంకురార్పణ చెయ్యవలసింది మీరే" అంటాడు.

"పురుషులే కాదు, స్త్రీలున్నూ బలపరాక్రమాలు సంపాదించుకుంటేనే మనకి విజయం" అని చెబుతూ,... "స్త్రీ పురుషులు కలిసి విద్యనేరిస్తే వచ్చే కొత్త అపాయమేమీ లేదు. పురుషులంటే స్త్రీలకు బెరుకుభావం పోవాలంటే ఈ పద్ధతి అవలంబించకతప్పదు. స్త్రీలిక అన్నం వండిపెట్టడం వొక్కటేకాదు, జాతిలో కొత్త చిత్తవృత్తి ప్రవేశపెట్టాలి" అని ఉద్బోధిస్తాడు.

ఆడపిల్లకి సాముగారడీలు నేర్పిస్తే అగ్రహారీకులంతా ఏమంటారోనని సంశయిస్తున్న భట్టాచార్యునితో "ఎక్కడో బలాత్కృతలయిపోతున్న మన ఆంధ్ర స్త్రీలకు ఇక్కడి అన్నపూర్ణ రక్షణ అందకపోవచ్చు. కాని మన స్త్రీలకందరికీ ఈ విద్య పురుషులకంటే యెక్కువ అగత్యం, వివాహంకంటేను అగత్యం" అని అన్నపూర్ణ తండ్రి ముందుచూపుతో ధైర్యం చెబుతాడు.

'కొత్తచూపు' కథలోనేకాదు, శ్రీపాదవారి కొత్తచూపు వారి కథలన్నిటి లోనూ, రచనలన్నింటిలోనూ ప్రస్ఫుటమవుతూనే ఉంటుంది. భార్యాభర్తల మధ్య సమానత్వం ఉండాలని సూచిస్తూ, స్త్రీలపట్ల సానుభూతితో, పురుషాధిక్యతపట్ల నిరసనభావంతో ఎన్నో కథలు రాశారు.

"యావజ్జీవం హోష్యామి" అనే కథలో భార్యకి ఉల్లిపాయలంటే ఇష్టం. భర్త ఛాందసుడు. ఉల్లిపాయ ముట్టుకోడు. ఏకూర వండాలన్నా ఏదో వంక పెడతాడు పోనీ, తనకు నచ్చిన కూరలు తెచ్చిపడేస్తాడా అంటే అందుకు ఒళ్ళొంగదు. అతనికో కూర, తనకోకూర రెండుకూరలు వండే ఓపికలేదని భార్యగోల. అదికాక, భర్త ముక్కుపొడుం పీలుస్తాడు. భార్య వద్దంటుంది. అతడు మానడు. పైగా పరమ బద్ధకస్తుడు. చదువులేదు, సంపాదన అంతంతమాత్రం. భార్యమీద పెత్తనం చెలాయించడానికి మాత్రం లోటులేదు. భర్తకి భార్య విధేయత ఎలా చూపించాలో అతను ధర్మపన్నాలు చెబుతూంటే ఒళ్ళుమండి, ఆమె "మనమేమో తోచినట్లల్లా చేసేస్తూ ఉండాలి. ఎదటివాళ్ళు మాత్రం చచ్చినట్టు సర్దుకుపోతూ ఉండాలి. ఇదీ ధర్మం. త్రికాలజ్ఞాన సంపన్నులైన మహర్షులు పద్మాసనాసీనులై వరదహస్తం ఎత్తి ఆడవాళ్ళ నెత్తిన రుద్దమని పురుషులకుపదేశించిన వేదసారం ఇదే కదూ?" అంటుంది వెటకారంగా. భార్యాభర్తల వాదోపవాదాలతో నిండిన 53 పేజీల కథ ఇది! భార్యాభర్తల సంవాదంతో కూడిన మరో తమాషా కథ "షట్కర్మయుక్తా" అనేది.

ఒకవైపు పురుషాధిక్య వ్యవస్థలో భార్యాభర్తలు చిన్న చిన్న విషయాల్లో కూడా సర్దుకుపోకుండా సతమతమవుతూంటే, మరోవైపు వితంతువులై పుట్టింట చేరిన ఆడబడుచులు కొందరు ఇంట్లో దంపతుల్ని సవ్యంగా కాపురం చేసుకోనిచ్చేవారు కాదు ఆ రోజుల్లో. తమకి లేని సౌఖ్యం తక్కినవారికి మాత్రం దేనికని లోలోపల ఈర్ష్యతో మండిపడుతూ, వచ్చని కాపురాలను చూసి కళ్ళలో నిప్పులు పోసుకునేవారు. ఇంట్లో అందరిమీదా పెత్తనం చెలాయిస్తూ అందర్నీ రాచిరంపాన పెట్టేవారు. అయితే, పాపం వాళ్లు పుట్టింట్లో ఉన్నా, అత్తింట్లో ఉన్నా "వంటలక్క" బతుకే. అటువంటి ఒక వితంతువుకథే "ఇల్లుపట్టిన వెధవాడబడుచు"కథ.

కానీ, ఇలాంటి వారికన్నా నోరులేని అమాయకపు బాలవితంతువులే ఎక్కువగా ఉండేవారు. ఇంటిల్లిపాదికీ రోజంతా అడ్డమైన చాకరీ చేస్తూ విశ్రాంతి అనేది

లేకుండా నికృష్టంగా బ్రతుకుతుండేవారు. అటువంటి అమాయకపు బాలవితంతువులతో కన్నతల్లీ, తోబుట్టువులూ కూడా ఎలా నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించేవారో శ్రీపాదవారి "అరికాల్ళకింద మంటలు'' కథ చదివితే తెలుస్తుంది.

స్వయాన అమ్మమ్మే (ఆవిడావితంతువే) వితంతువైన మనవరాల్ని సాధిస్తుంది- "దిమ్మచెక్కలాగా అలా కూచోకపోతే కాస్త గంధం తియ్యరాదుటే? రోజూ పురమాయించాలా?.. ఈ జన్మలో నీకెలాగూ ఆ యోగం లేదు. ముందు జన్మలోనయినా సుఖపడాలంటే ఇప్పుడిలాగ ముత్తయిదువులికి గంధంతీసి యివ్వడమూ, మల్లెమొగ్గలు దండలుగుచ్చి వెయ్యడమూ, అందులోనూ కన్నె వాళ్ళకి, ఇంతకంటె పుణ్యం యేమిటి?" అంటూ.

ఈ కష్టాలు భరించలేక, ఒక రాత్రి తెగించి ఇంట్లోంచి బయటపడుతుంది కందుకూరి వీరేశలింగం గారి అండను చేరడానికి. చేతిలో చిల్లిగవ్వ లేదు. జట్కావాడు జాలిపడి, "పంతులుగారి తోట" కయితే ఊరికే తీసికెడతా నంటాడు. ఇలా బయలుదేరిన పిల్లల్ని కనిపెట్టి, తండ్రులూ అన్నదమ్ములూ బలవంతాన మళ్ళీ వెనక్కి ఎలా తీసుకుపోతుంటారో చెబుతాడు జట్కావాడు.

ఇటువంటి సంఘటనలను కథల రూపంలోనూ, వ్యాసాలూ, నాటకాల ద్వారానూ నలుగురికీ తెలియజేయకుండా ఉంటే సంఘంలో ఏనాటికైనా మార్పులొస్తాయా? ఈనాడు స్త్రీల పరిస్థితి కొంత మెరుగ్గా ఉందంటే, సంఘ సంస్కరణ దృష్టితో చేసిన రచనలు మార్గదర్శకమయివుంటాయని విశ్వసించ వచ్చు.

సామాజిక వ్యవస్థలో సవ్యమైన మార్పులు తేవడంలో, స్త్రీపురుషుల్లో చైతన్యం కలిగించడంలో రచయితల కృషికి ఎంత ప్రాముఖ్యం ఉంటుందో శ్రీపాద వారి రచనలు చదివితే తెలుస్తుంది.

(ఉదయం నవతరం వారపత్రిక 6-7-90)

# విశ్వనాథ చెప్పిన విలక్షణ కథ...

## "ముగ్గురు బిచ్చగాళ్ళు"

"విశ్వనాథ సత్యనారాయణ" అనగానే ఛాందస సంస్కారం, అపార పాండిత్యం" అసమాన కావ్యరచనా ప్రతిభా, విలక్షణ వచనశైలీ సమ్మిళితమైన "మూర్తి" మన దృక్పథంతో సాక్షాత్కరిస్తుంది. కానీ, ఆ ఛాందసం, పాండిత్యం, ప్రతిభా వెనుక ఎంతటి నిరాడంబరతా, వివేకం, లోకజ్ఞతా ఇమిడి ఉన్నాయో తెలుసుకోవాలంటే సత్యనారాయణగారు రాసిన "ముగ్గురు బిచ్చగాళ్ళు" అనే కథ ఒక్కటీ చదివితే చాలనిపిస్తుంది.

ఈ కథ జనవరి 1951లో ప్రచురింపబడినప్పటికీ, దీని కథాకాలం అప్పటికి ఇరవైఏళ్ల క్రిందటిది. ఈ కథ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురించిన "ఒక దశాబ్ది తెలుగు కథలు, 1946–1955" సంకలనంలో చేర్చబడింది. విశ్వనాథ ఈ కథని చక్కని వ్యావహారిక శైలిలో రాశారు- చిన్న చిన్న వాక్యాలతో రాసే తమ సహజపద్ధతిలోనే. కథని "నేను" అంటూ ఉత్తమ పురుషలో రాశారు. ఆ "నేను" ఎవరో కాదు. విశ్వనాథ వారేనని కథలో చెప్పిన విశేషాల్ని బట్టి గ్రహించవచ్చు. అందువల్లనే ఆయన వ్యక్తిత్వాన్ని అవగాహన చేసుకునే అవకాశం కలుగుతుంది ఈ కథ చదివినప్పుడు.

"ఇరవైయేళ్ళ క్రితం ఏదో ఊరు వెళుతూ రైల్లో కూర్చున్నాను" అంటూ మొదలవుతుంది కథ. ప్లాట్‌ఫామ్ మీద తిరుగుతూ ప్రయాణీకుల్ని 'ధర్మం' చెయ్యమని అడిగే ముగ్గురు బిచ్చగాళ్లని చూస్తాడు కథకుడు. ముగ్గురూ కలిసి కట్టుగా తిరుగుతూ అడుక్కుంటూ ఉంటారు. ముగ్గురూ ఆజానుబాహులు. కానీ, ఒక చెయ్యిలేని 'కుంటివాళ్ళే' ఇద్దరికి కుడిచేయి లేదు, ఒకడికి ఎడమచేయిలేదు. కుడిచేయి లేనివాళ్ళే ఎప్పుడూ యాచిస్తూ ఉంటారు. ఎడమచేయి లేనివాడు మాట్లాడకుండా వెంట ఉంటాడు. ఒకచోట నిలబడి ఒకేసారి అడుగుతారు ధర్మం చెయ్యమని. పెట్టెలో ప్రయాణీకుల్లో ఎవరూ మాట్లాడకపోతే ముందుకి వెళ్ళిపోతారు మళ్ళీ అడక్కుండా.

బిచ్చగాళ్లందరూ దొంగలన్న అభిప్రాయంతో ఉంటాడు ఇంగ్లిషు చదువుకున్న కథకుడు. దానికితోడు వయసులో ఉన్నవాడు. "పిడి రాళ్లల్లే ఉన్నారు. రోగమా, పని చేసుకోలేరా?" అంటాడు వాళ్లతో. వాళ్లలో ఎడమచేయి లేనివాడు క్రోధంగా చూసి, "పని చూపించు చేస్తాను. దొరవు, వచ్చావు" అంటాడు.

దాంతో కథకుడు తగ్గిపోయి మారు మాట్లాడకుండా ఊరుకుంటాడు. వాళ్లు ముగ్గురూ మహారాజుల్లా ముందుకి నడుస్తారు. కుడిచేతి కుంటి వాళ్ళిద్దరూ మందహాసం చేయగా, ఎడమచేతి కుంటివాడు "ధీరోదాత్తుడైన నాయకుడి"లా, "శత్రు సైన్యాన్ని విదళించి సర్వనాశనం చేసిన మహాసేనాని"లా ముందుకు నడుస్తాడు.

అసలే ఆ ఊరు రౌడీ ఊరని ప్రశస్తి. స్టేషనులో చాలాచోట్ల "దొంగలున్నారు జాగ్రత్త" అని ప్రకటనలుంటాయి. కథకుడికి అనుమానం వేస్తుంది ఎప్పుడూ ఇంతమంది పోలీసులుండగా ఇంతమంది దొంగలెలా ఉన్నారని!

తరవాత చాలాసార్లు చూశాడు కథకుడు ఆ ముగ్గుర్నీ. మళ్ళీ ఎప్పుడైనా బిచ్చం అడిగితే ఇవ్వాలనుకున్నాడు. కానీ వాళ్లడగలేదు ఇతణ్ణి.

పదేళ్ళు గడిచాయి. కథకుడు మారినా వాళ్ళు మారలేదు. వాళ్ళు అతని వంక కూడా చూసేవారుకాదు. "వాళ్ల ప్రభుత్వం మాత్రం అవ్యవహితంగా సాగుతూనే ఉన్నది. దూరాన్నుంచి చాలాసార్లు వాళ్ళ రాచరికం చూచాను. వాళ్ళు ఓడిపోవడం నేను చూడలేదు. భగవంతుడు వాళ్ళయందున్నాడనిపించింది" అనుకుంటాడు.

వీళ్లెవరు? వీళ్ల చరిత్రయేమిటి? కనుక్కుందామని బుద్ధిపుడుతుంది కథకుడికి. ఒకరోజున తనంతట తను వెళ్ళి వాళ్ళకి ఒక అణా ఇస్తాడు. "ఇచ్చాడన్న కృతజ్ఞత కనపరచలేదు వాళ్ళు. ఇవ్వకేం చేస్తాడన్నట్టుగా ఊరుకున్నారు."

ఆ ఊరికి తరుచు వెళ్తూఉంటాడు కథకుడు ఏదో పనిమీద. ఒకటి రెండు పూటలకు మించి ఉండడు సాధారణంగా, ఓ సాయంత్రం మరే పనిలేక, వాళ్లని గురించి వాకబు చేద్దామనిపించి "అబ్బాయి మీరెక్కడ ఉంటారు?" అని అడుగుతాడు. అతనివైపు విచిత్రంగా చూసి, వాళ్లదారిని వాళ్ళు వెళ్ళిపోతారు.

రాత్రి సినిమాకి వెళ్ళి తిరిగి వస్తూంటే రోడ్డు బాగు చేస్తూండటం వల్ల పక్కసందులోనుంచి రావలసివస్తుంది కథకుడికి. సందు నిర్జనంగా ఉంది. సందు

మొదట్లో ఒక పోలీసతను ఉన్నాడు. కొంతదూరంలో నలుగురైదుగురు దెబ్బ లాడుకుంటున్నారు. ధైర్యం తెచ్చుకుని ముందుకుసాగి, వాళ్ళున్న చోటికి చేరుకునే సరికి ఇద్దరు ముగ్గురు ఇంట్లోకి వెళ్ళిపోతారు. ఒకడు వాకిట్లో నిలబడి ఉంటాడు. దగ్గరనుంచి చూస్తే ఆ మనిషి కుడిచేయి లేనివాళ్లలో ఒకడని తెలుస్తుంది.

"నీ విక్కడుంటావా?" అని అడగితే, ముక్తసరిగా "ఊఁ" అంటాడు బిచ్చ గాడు.

మర్నాడు రాత్రి అతన్ని ప్రత్యేకంగా కలుసుకోవడానికి వెళతాడు కథ కుడు. తనతో పనేమిటంటాడు బిచ్చగాడు.

"అబ్బాయీ! నేను కవిని. నాటకాలు, నవలలు, కథలు వ్రాస్తూ ఉంటాను– మీ వంటివాళ్ళ కథలు మేము వ్రాస్తే మేము చాలా గొప్పవాళ్ళమని దేశం అను కొంటారు. నీ సంగతి కనుక్కుందామని వచ్చాను" అంటాడు. బిచ్చగాడు తీక్ష ణంగా చూసి, ఒక నిముషం ఆగి, "రేపు రాత్రికి రా" అంటాడు.

బిచ్చగాడు ఏకవచన ప్రయోగం చేసినందుకు కథకుడు ముందు బాధ పడతాడు. కానీ తక్షణం అర్థం చేసుకొని "నేను అతణ్ణి 'నువ్వు' అంటే అతడు నన్ను 'ఏమండీ' అని ఎందుకనాలి? మనుష్యులలో ఎక్కువ తక్కువ లేమున్నవి" అని తనను తాను సమాధాన పరచుకుంటాడు.

తరవాత తన అచూకీ తెలుసుకోవడానికి ఒక బిచ్చగాడు వెంటాడినట్లు అనుమానిస్తాడు. కొంచెం భయం వేసినా, ఎలాగో ధైర్యం తెచ్చుకుని వెళతాడు బిచ్చగాడి ఇంటికి. ఈసారి "రండి" అంటాడు బిచ్చగాడు. కూర్చున్నాక, బిచ్చ గాడి పేరడిగి తెలుసుకుంటాడు. రోజూ సంపాదన ఏమాత్రం ఉంటుందని అడుగుతాడు.

"మీవంటి దొరలు పని చేసుకోరాదా అంటారు. కాని తోచినప్పుడణా లిస్తారు గదా?" అంటాడు బిచ్చగాడు. అతని చమత్కారానికి కథకుడు సంతో షించి, నిజం చెబుతాడు తన గురించి–

"పూర్వం నాకు బిచ్చగాళ్లంటే చాలా అసహ్యంగా ఉండేది. ఏ కలెక్టర్నో అవుతానని అనుకునే వాణ్ణి— ఇప్పుడదేమీ కానని తెలిసింది. బిచ్చగాళ్ళంటే

నాకేమీ ద్వేషం లేదు. పైగా మిమ్మల్ని గురించి కథలు అవీ రాసి తృణమో పణమో సంపాదించుకుంటూ ఉన్నాను" అంటాడు.

బిచ్చగాడు నవ్వి "మా పేరు చెప్పి సంపాదించుకుంటారు గాని మాకేమి ఇవ్వ" రంటాడు. "ఈసారి వచ్చే డబ్బులో కొంత నీ కిస్తాను" అని కథకుడు అనగానే అతడు ఉదారంగా "అక్కర లేదు లెండి. మీరు పేదవాళ్ళే అయి ఉంటారు నాది ఒక పొట్ట. తేలిగ్గా నాలుగైదు రూపాయలు, అన్ని మినహాయింపులూ పోనూ నా వాటా వస్తుంది" అంటాడు.

"మినహాయింపు లేమిట"ని అడుగుతాడు కథకుడు. చెప్పాలంటే చాలా ఉంది. తమ నాయకుణ్ణి అడిగితే గాని చెప్పడానికి వీల్లేదంటాడు బిచ్చగాడు. పది రోజులు పోయాక రమ్మంటాడు. ఎడమచేయి లేనివాడే తమ నాయకుడని చెబుతాడు. మళ్ళీ అనుమానం వచ్చి "మీరు నిజంగా వట్టి కవేనా?" అంటాడు. "ఒట్టు కావలిస్తే చేతిలో చేయివేస్తాను" అని కథకుడంటే, "ఎడమ చేయి పనికివస్తుందా?" అని నవ్వుతాడు. "అతని చమత్కారం, అతని హాస్యం, అతని నాగరికత, అతడు బిచ్చగాడేమిటి?" అని సంభ్రమం కలుగుతుంది కథకుడికి.

మొత్తంమీద మళ్ళీ రెండుసార్లు వెళ్ళగా ఆ బిచ్చగాడు తన కథే కాకుండా నాయకుడి కథా, మొత్తం బిచ్చగాళ్ళందరి కథా, ఆ వ్యవస్థ గురించీ-ఆ బిచ్చగాళ్ల రాజ్యం కథంతా చెబుతాడు.

చివరికి "—అసలు రహస్యం చెబుతాను. మీ మంత్రులు, రక్షక భటులు, ఉద్యోగస్థులు రాజ్యం చేస్తున్నారని మీరనుకుంటారు. నిజంగా రాజ్యంచేసేది మేము. పెద్ద ఉద్యమాలు లేవదీసేది మేము. దొంగతనాలు, శిక్షలూ అన్నీ చేయునదిమేము. మీ రక్షక భటులందరూ మాచేతుల్లో ఉన్నారు. మీ ఉద్యోగస్థులందరూ మాచేతుల్లో ఉన్నారు. మేము వాళ్లకు మామూళ్ళు ఇస్తాము. మే మెట్లా చెబితే వాళ్లట్లా నడవాల్సిందే. మాకు సంబంధం లేని దొంగతనాలైతే మీ న్యాయస్థానంలో విచారణలూ, శిక్షలూ జరుగుతవి. మా సంబంధం ఉంటే జరగవు. ఆ మమ్మల్నిమించిన అధికారం లేదు" అంటాడు- శిక్షలు మేమే వెయ్యాలి.

అదంతా వింటూంటే కథకుడికి తల తిరిగిపోతున్నట్లనిపిస్తుంది.

అంతేకాదు. కొన్ని ఉద్యమాలు వాళ్లే ఎలా లేవదీస్తారో చెబుతాడు బిచ్చగాడు. ఎలాగంటే,

"....ఒక సభ జరుగుతూ ఉన్న సమయంలో రక్షకభటులు పోయి సభను చెల్లాచెదరు చేయాలి. అక్కడ నుంచి ఆ ఉద్యమం పెరుగుతుంది. బాగా పెరిగిన తర్వాత ఆ ఉద్యమానికి మా సంఘం దోహదం ఇస్తుంది. డబ్బు మేమిస్తాం. దానితో అటు రాచరికం అనుకునే వాళ్ళకి, ఇటు ప్రజల్లో ఒక భాగానికి తగాదా పెరుగుతుంది.... అధికారులు మా చెప్పుచేతల్లో ఉంటారు. లేకపోతే రాజ్యం మీద మా అధికారం పోతుంది" అని చెప్పి అసలు మర్మం ఇంకా ఇలా తెలియ బరుస్తాడు.

".... ఈ ప్రపంచంలో ఇన్ని మతాలున్నవి. ఈ మతాలను గురించి పోట్లాటలున్నవి. ఈ మతాలు నిర్మించింది ఎవరు? సన్యాసులు. సన్యాసులంటే బిచ్చగాళ్ళు.... ఏసుక్రీస్తు, మహమ్మదు, శంకరులు....బుద్ధుడు-మతవిషయికంగా ఈ లోకాన్ని పాలించేది సన్యాసులు—ఈ సన్యాసులు ఎట్లా చెప్పితే అట్లా సాగి నవి పూర్వపు రాజ్యాలు. ఒక్క మత విషయికంగానే కాదు. ఏ విధంగా చూచినా దేశాలను పాలించే వాళ్ళు బిచ్చగాళ్ళు. బిచ్చగాళ్ళలో భేదాలుంటవి. పొరపాటు పడవద్దు. బిచ్చగాళ్లు మీలోనూ ఉంటారు. వాళ్ళు మా వాళ్ళే. మీకు తెలియక అధి కార్లను కొంటారు. వాళ్ళందరూ మామూళ్లు తినేవాళ్ళే. ఒకడు ప్రత్యక్షంగా తింటాడు. ఒకడు పరోక్షంగా తింటాడు. ఒకడు చేయి చాపుతాడు. ఒకడు దూరంగా నిలుచుండి భాగం తీసికొంటాడు. అసలు రహస్యం చెబుతా వినండి. లోకంలో మానవజాతి రెండే రకాలు...సంసారులు బిచ్చగాళ్లు...సంసారికి ఎవడి జోలి అక్కరలేదు. తానేదో న్యాయంగా సంపాదించుకొంటాడు. తింటాడు సంసారి కావటానికి చాలామంది పనికి రాకపోతారు. వాళ్ళని బిచ్చగాళ్ళని మేము చేస్తాము. వాళ్ళచేత ఉద్యమాలు లేవదీయిస్తాము. 'నీవు బిచ్చగాడివి కారా' అంటే కాదు. వాడికి అధికారము, లోకోద్ధరణము అనే ఆశలు చూపిస్తాం. గతి లేనివాడు లోకోద్ధరణ చేయక యేం చేస్తాడు? మా బిచ్చగాళ్ళల్లో చేరుతారు. ఈ లోకమంతా బిచ్చగాళ్ళే ఏలుతున్నారు. మాది గొప్పసంస్థ. మాది గొప్ప సంఘం" అని విశదీకరించి, చివరి కిలా సిద్ధాంతీకరిస్తాడు.

సంసారులు, బిచ్చగాళ్ళు-రెండే రకాల మానవులు. మతాలు, అధికారాలు, రాజ్యాలు సంసారులకు పట్టవు. వాళ్లు మేకలవంటివాళ్ళు. అవన్నీ బిచ్చగాళ్ళకి, మాకుపట్టుతవి. మేము తోడేళ్ళ వంటి వాళ్ళం. ఈ రెండు రకాల మనుష్యులు పుట్టడం తోటే అట్లా పుట్టుతారు".

"... అతను చెప్పిన మాటలు నమ్మలేదనటానికి వీల్లేదు" అంటూ ముగిస్తాడు కథకుడు.

బిచ్చగాళ్ళకి కూడా ఆత్మాభిమానం ఉంటుందనీ, వాళ్ల తమ జీవన విధానంతో ఆనందంగా, తృప్తిగా ఉంటారనీ చెప్పడం కాదు. ఈ కథ ఉద్దేశం బిచ్చగాళ్ళ నికృష్ట జీవితాన్ని చిత్రించి వారిపై కనికరం కలిగేటట్లు చేయడమూ కాదు. వారి నికృష్ట జీవితానికి కారకులైన వారిని ఎత్తి చూపించడమూ కాదు.

మన సమాజము ఎటువంటి హీన స్థితికి దిగజారిపోతున్నదో సూచించి, దానిలో భాగస్థులైన మేకలూ, తోడేళ్ళ వంటి వారందరికీ కనువిప్పు కలుగచేయడమే ఈ కథ లక్ష్యం అని గ్రహించవచ్చు. కనువిప్పు కలిగినప్పుడే మార్పు కూడా సంభవమవుతుందని కథకుడు ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అందుకే కథలో అటువంటి ప్రస్తావన లేదు.

బిచ్చగాని పాత్ర ద్వారా విశ్వనాథ సత్యనారాయణగారు ప్రతిపాదించిన 'సిద్ధాంతం' యాభై ఏళ్ళ క్రిందటి లోకవృత్తాన్ని చాటేదైనప్పటికీ, అందులో ఈనాటి మన అవినీతికర సమాజం, గూండారాజ్యం, సామాన్య ప్రజల అసహాయతా ప్రతిబింబించడం చూడవచ్చు. మానవమనస్తత్వాల్లోనూ ప్రవర్తనల్లోనూ ప్రదర్శితమయ్యే మంచి చెడులకు దర్పణం పట్టే కథ ఇది-మన సమాజం కథ ఇది.

విశ్వనాథ విశిష్ట మేధస్సుకీ, వివేకవంతమైన విశ్లేషణ శక్తికీ, వ్యంగ్య చిత్రణ ప్రతిభకీ, అద్భుతమైన కథన కౌశలానికీ ప్రతీక ఈ కథ.

(ఆంధ్రప్రభ, సోమవారం 15, జూన్ 92.)

——

# కథలు ఎలా రాయాలి?

ఎలా రాయాలో ఆలోచించేందుకు ముందు ఏం రాయాలన్నదీ, ఎందుకు రాయాలన్నదీ నిర్ణయించుకోవడం ముఖ్యం. కానీ, కథావస్తువు ఎటువంటిదైనా కథనం ఆసక్తికరంగా ఉండాలి. అలా ఉన్నప్పుడే కథ పాఠకుల్ని ఆకట్టుకుంటుంది.

ఒక సంఘటన గాని, ఒక వ్యక్తి ప్రవర్తన గాని, ఏదైనా మనస్సు లోలోతుల్ని స్పృశించినప్పుడు దాని ప్రభావం కొందరిలో సృజనోత్సాహాన్ని కలిగించి కథారచనకు ప్రేరేపిస్తుంది. హృదయం స్పందించే అనుభవం కలిగినప్పుడు ఆ స్పందనని కథగా మలిచి రాయాలనిపిస్తుంది. తనలో కలిగిన అనుభూతిని నలుగురితో పంచుకోవాలనే కాంక్ష, తపన కలిగినప్పుడు కథ రాయాలనిపిస్తుంది. తన సుఖ దుఃఖాల్ని ఇతరులతో పంచుకోవాలన్న ఆరాటం, ఎవరి లోపాన్నో బయట పెట్టాలన్న ఆవేశం, సమాజంలో మార్పుతేవాలన్న ఆదర్శం-ఇలా ఎన్నో కారణాలు పైకి కనిపించో, కనిపించకుండానో రచయితని ప్రేరేపిస్తాయి

ప్రతి కథలోనూ కథావస్తువు సరికొత్తగా ఉండాలంటే సాధ్యం కాదు. తల్లిప్రేమ, ప్రేమవివాహం, ప్రేమవైఫల్యం, అన్నదమ్ముల అనుబంధం, ఆస్తి కోసం తగువులూ, రాజకీయాలూ, సంఘంలో అవినీతి, హింస-ఇలా ఏ విషయాన్ని కథావస్తువుగా తీసుకున్నా అందులో నూతనత్వం లేకపోవచ్చు. ప్రేమ, ద్వేషం, దుఃఖం, సుఖం, పగ, విరక్తి-మొదలైన భావాలుకూడా పాఠకులకి కొత్తకాదు. అయినా రసానుభూతిలో, దాన్ని వ్యక్తం చేసే తీరులో భేదం ఉంటుంది రచయితకీ రచయితకీ మధ్య.

అందుకే, "కవి ప్రతిభలోన నుండును గావ్యగత శతాంశముల యందు తొంబదియైన పాళ్ళు . . . రసము వేయిరెట్లు గొప్పది నవకథా ధృతిని మించి"

అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు. వీరి అభిప్రాయం కథకులకు కూడా వర్తిస్తుంది. అయితే, "తొంబైశాతం" కచ్చితంగా ఉంటుందో లేదో చెప్పలేము గాని, ప్రధానంగా ఉంటుందని అంగీకరించాలి.

కథకుని పేరు చెప్పకపోయినా కథనాన్ని బట్టి కథకుని గుర్తుపట్టగలం– కొందరు ప్రముఖ రచయితల విషయంలో. కథా వస్తువుని ఎంచుకోవడంలో, కథని చెప్పే (రాసే) పద్ధతిలో ఎందరో రచయితలు ఆ ప్రత్యేకతని సాధించారు. వారే కథకుల్లో అగ్రగణ్యులయారు.

ప్రతి రచయితా ఆ ప్రత్యేకతనీ, ఉన్నత స్థానాన్నీ సాధించలేకపోవచ్చు. కానీ, ప్రతి రచయితా కథా రచనలో తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలి. ప్రముఖ రచయితల పట్ల ఆరాధన ఉన్నప్పటికీ తనదంటూ ఒక ప్రత్యేక శైలిని అనుసరించాలి.

ఇక్కడ, కథనంతో బాటు కథావస్తువు గురించి మళ్ళీ ప్రస్తావించవలసి ఉంది. "కథ" కల్పితమైనదేగాని, కథావస్తువు వాస్తవికంగా ఉండాలి. వాస్తవ జీవితానికి మరీ అద్దం పట్టకపోయినా, దగ్గరగా ఉండాలి.

వైజ్ఞానిక కథలూ, అపరాధ పరిశోధక కథలూ చాలావరకు కల్పిత వాతావరణంతో కూడుకుని ఉంటాయి. వ్యంగ్య కథలూ, హాస్యకథలూ అతిశయోక్తితో కూడుకుని ఉంటాయి. కానీ, సామాన్యంగా సాంఘిక కథలు కాలానుగుణంగా వాస్తవికతకు దగ్గరగా ఉండాలి కథలు వాస్తవికం అనిపించాలి. అప్పుడే ఆ కథలు పాఠకులలో ఆసక్తినీ, తాదాత్మ్యతనీ కలిగించడంతో బాటు, వ్యక్తిగత చైతన్యానికి దోహదం చేస్తాయి. అప్పుడు సాంఘిక ప్రయోజనాన్ని కూడా కొంతవరకు సాధించినట్లే.

సాంఘిక కథలు వాస్తవికంగా ఉండాలంటే, రచయితవాడే భాష కూడా కథావస్తువుకీ, కథలోని వాతావరణానికీ అనుగుణంగా ఉండాలి. సంభాషణలు సహజంగా ఉండాలి–మాట్లాడే వ్యక్తులకు తగినట్లు–నిత్యజీవితంలో మాట్లాడుకున్నట్లు. అందుకే కథారచయితకి విశేషానుభవం, ప్రగాఢంగా ఆలోచించి విశ్లేషించగల ప్రతిభా ఉండాలి. అలా ఉన్నప్పుడే కథ ఆసక్తికరంగా ఉంటుంది.

కథ "చెప్పడమే" మన తొలి సంప్రదాయం. కథారచన ఆరంభమయాక "రచించే శైలి" రూపుదిద్దుకుంది. రచించే శైలిలో రాసినా, ప్రాథమికంగా ఎవరో కనిపించని శ్రోతకి చెబుతున్నట్లుగానే ఉంటుంది కథాకథనం. కథ "చెప్పే" పద్ధతిలో కన్న కథ "రాసే" పద్ధతిలో విలక్షణతకీ, ప్రయోగాలకీ ఎక్కువ అవకాశం ఉంటుంది. అందులోనే రచయిత విశిష్ట ప్రతిభ వ్యక్తమవుతుంది. కానీ శ్రోతలకి చెబుతున్నట్లు రాస్తే కథాగమనం సరళంగా, సూటిగా సాగుతుంది.

కథకులు చాలావరకు ప్రథమ పురుషలో రాస్తారు. కొంతమంది ఉత్తమ పురుషలో రాస్తారు ఎక్కువగా. ఉత్తమ పురుషలో చెప్పినవన్నీ రచయిత స్వానుభవాలనీ, ప్రథమ పురుషలోవి ఇతరుల అనుభవాలనీ అనుకోవడానికి ఆస్కారం లేదు. నా మట్టుకు నేను ఉత్తమ పురుషలో రాయడానికే ఇష్టపడతాను.

ప్రతి మనిషికీ ఎదుటివారి అనుభవాలగురించీ, ఆలోచనల గురించీ తెలుసుకోవాలని ఉంటుంది. అది సహజమైన కుతూహలం (అది బయట పడినా పడక పోయినా). అందువల్ల రచయిత ఒక కథని ఉత్తమ పురుషలో రాసినప్పుడు పాఠకుడు సులభంగా ప్రతిస్పందించడానికి అవకాశం ఉంటుంది. కథ వాస్తవికంగా, ఆసక్తికరంగా ఉంటే పాఠకుల హృదయాలకు సూటిగా హత్తుకుంటుంది

ప్రథమ పురుషలో రాయడంలో ఒక వైరుధ్యం కనిపిస్తుంది సామాన్య రచనల్లో. కథలోని ఒక పాత్ర మనోగతిని చిత్రిస్తున్నప్పుడు, అంటే, మనస్సులోని ఆలోచనల్ని వ్యక్తీకరిస్తున్నప్పుడు "నేను", "తను" అనే పదాల్ని పర్యాయ పదాలుగా వాడుతూ శైలిలో గందరగోళాన్ని సృష్టిస్తూ ఉంటారు. ప్రథమ పురుషలో రాస్తున్న కథలో ఒక పాత్ర "నేను" అని ఆలోచిస్తున్నప్పుడు 'నా కిష్టం', 'నాది' అనుకోవడం సహజం-'తనకిష్టం', 'తనది' అనుకోవడంలో సందర్భశుద్ధి వుండదు. ఒక పాత్రని చిత్రిస్తున్నప్పుడు అనాలోచితంగా ఆ పాత్రతో రచయిత తాదాత్మ్యం పొందడం వల్ల ఈ గందరగోళం ఏర్పడుతుందనుకుంటాను. కానీ, ప్రథమ పురుషలో చెబుతూ హఠాత్తుగా కథని ఉత్తమ

పురుషలోకి మార్చడం విలియమ్ సారోయాన్ "రచనా వైదగ్ధ్యం" అని శ్రీశ్రీ అభిప్రాయపడ్డారు! అందరు చిత్రకారులూ "పికాసో"లు కాలేరుకదా.

కాలానుగుణంగా కథచెప్పడంలో కూడా గతం, వర్తమానం కలగలపు చేస్తే, చేయి తిరిగిన రచయిత అయితే విశిష్ట శిల్పంగానూ, చాతకాని రచయిత అయితే గందరగోళంగానూ అనిపిస్తుంది.

వాడుక భాషలో ఎటువంటి వైరుధ్యాలూ లేకుండా రాయగలిగినప్పుడే కథనం పదునుగానూ, సూటిగానూ, సరళంగానూ ఉంటుంది.

కథకి 'మూలం' కథావస్తువూ, ''జీవం'' కథనమూ అనుకుంటే, ముగింపు కథకి 'కొసమెరుపు'. కథకి ఆద్యంతాలు రచయిత తీసుకున్న కథావస్తువునిబట్టే కాకుండా, రచయిత అవలంబించే రచనా విధానాన్ని బట్టి కూడా నిర్ణీత మవుతాయి.

ఆధునిక కథ ఏదో ఒక సంఘటనతోనో, పరిస్థితితోనో ప్రారంభమయి, అక్కడి నుంచి చకచకా ముందుకు సాగుతుంది. మధ్యమధ్య అవసరమైనప్పుడు ఆ సంఘటనకో పరిస్థితికో సంబంధించిన పూర్వవిశేషాల్ని చెప్పవలసి ఉంటుంది. రచయిత చెప్పదలచుకున్న అంశం ఆవిష్కారమవుతూ ఉంటుంది.

కథ ఎత్తుగడ పాఠకులలో ఆసక్తిని రగిలించి, కథనం ఆకట్టుకున్నట్లయితే, కథ చదువుతున్నంతసేపూ పాఠకులు ముగింపుని రకరకాలుగా ఊహించుకుంటారు-వారి వారి అభిరుచినీ, మనస్తత్వాన్నీ బట్టి. రచయిత ఇచ్చిన ముగింపు అందుకు భిన్నంగా ఉంటే, కొందరికి అసంతృప్తీ, కొందరికి ఆశ్చర్యంతోబాటు సంభ్రమమూ కలుగుతుంది.

కథకి ముగింపు ఒక సంక్షిప్త వ్యాఖ్యానం కావచ్చు, ఒక సందిగ్ధస్థితి కావచ్చు. కథలో వివరించిన సమస్యకి ముగింపులో ఒక పరిష్కారాన్ని సూచించ నవసరం లేదు. రచయిత సూచించిన పరిష్కారం పాఠకులకు ఆమోదయోగ్యం కాకపోవచ్చు. ఆ సమస్యకి తక్షణ పరిష్కారం లేకనూపోవచ్చు.

ఏ సమస్యనైనా సరిగ్గా అవగాహన చేసుకునేలా రచయిత తన కథా వస్తువుని ప్రదర్శించడం ముఖ్యం. ముగింపులో ఒక నిర్దిష్టమైన పర్యవసానాన్ని

గాని, అభిప్రాయాన్ని గాని సూచించకపోవడం ఒక లోపం కానక్కర్లేదు. ఒక్కొక్క కథలో ఆ సందిగ్ధతే పాఠకుల్ని ఆలోచింపచేస్తుంది-కథలోని సమస్యని పునరావలోకనం చేసేలా పురికొల్పుతుంది.

కథలు పాఠకుల్ని రంజింపచేయడమే కాకుండా, వ్యక్తిగత, సామాజిక సమస్యల గురించి ఆలోచింపచేస్తే, అవి తమ ముఖ్యప్రయోజనాల్ని సాధించినట్లే.

('కథలెలా రాస్తారు ?' సం : శార్వరి. 1992.)

---

# నవల-సామాజిక సంస్కరణ

సామాజిక జీవితం జలప్రవాహంవంటిది. ప్రవాహంలో అనేకం కొట్టుకొస్తూ వుంటాయి. చెత్తా చెదారం జలాన్ని కలుషితంచేయకుండా నివారించవలసిన బాధ్యత కొందరైనా తీసుకోనట్లయితే, ఆ కలుషిత జలంవల్ల జనానికి అనేక నష్టాలు సంభవిస్తాయి.

సమాజంలో మూఢాచారాల్ని, దుర్మార్గాల్ని నిర్మూలించవలసిన అవసరం ఒక్కతరంతోనో, ఒక్కసారితోనో అంతమైపోదు. ఎప్పటికప్పుడు సమకాలీన పరిస్థితులను సమీక్షించి, తోటి ప్రజలను హెచ్చరించవలసిన అగత్యంవుంది. సాహిత్యానికివుండవలసిన సామాజిక ప్రయోజనం అదే. పాఠకులకు మనోరంజనం కలిగించడంతోబాటు సమకాలీన సామాజిక పరిస్థితులగురించి సంస్కరణాభిముఖంగా ఆలోచింపజేయవలసిన బాధ్యతవుండాలి రచయితలకు-ముఖ్యంగా సామాజికజీవితాన్ని, సమాజంతో వ్యక్తులకున్న సంబంధాల్ని చిత్రించే నవలా రచయితలకు ఈ బాధ్యతవుండాలి.

కానీ, మంత్రాలకు చింతకాయలురాల్తాయా అన్నట్లు, సాహిత్య ప్రక్రియలు సమాజంలో మార్పులుతెస్తాయా-అని నిరుత్సాహం కలుగుతుంది అప్పుడప్పుడు. నిజమే కొంతవరకు. ఫలానా నవలవల్లనో, నాటకంవల్లనో, కథవల్లనో ఫలానా సామాజిక సమస్య తీరిందనిగానీ, ఫలానా సంస్కరణకి దారితీసిందనిగానీ నిదర్శనపూర్వకంగా చూపించలేము.

వీరేశలింగంగారి "రాజశేఖర చరిత్రము" మొట్టమొదటి సంస్కరణవాద నవల అని చెప్పుకోవచ్చును. కానీ, ఇప్పటికి మధ్యతరగతి కుటుంబీకుల్లో ఆ భేషజాలూ, అనవసరపుఖర్చులూ పోయాయా? అప్పుచేసి అయినా నగలుఅమ్మి అయినా, ఇల్లూ పొలమూ తాకట్టుపెట్టి అయినాసరే, వియ్యాలవారికి మర్యాదలు చెయ్యడం, సంప్రదాయాలూ ఆచారాల పేరున బంధుమిత్రులకి మర్యాదలుచెయ్యడం మానడంలేదు. మధ్యతరగతివాళ్ళుపడే బాధలగురించి వేలకివేలు కథలూ నవలలూ నాటకాలూ రానందువల్లనా? ఎన్నోరచనలు విశిష్టమైనవి వెలువడ్డాయి ఈ శతాబ్దం

పొడుగునా. అనుభవాలవల్లకూడా పాఠాలు నేర్చుకోనంత మౌఢ్యం నరనరాల్లోనూ ఎక్కిస్తాయి తరతరాలనుంచి వస్తున్న సంప్రదాయాలు. విద్యావంతులుకూడా పూర్వ సంప్రదాయాలను అతిక్రమించలేకపోతున్నారు. పైగా కొత్త మూఢాచారాలను ప్రారంభిస్తున్నారు- బర్త్‌డేపార్టీలుచేసి పిల్లలచేత "కేకు"లు కోయించడం, కంప్యూటర్లమీద జాతకాల "మేచ్" చేయించడం వంటివి.

చదువుకున్నవారు కుల మత విచక్షణలు చూపించకపోవడం కాలేజీల్లోనూ, ఆఫీసుల్లోనూ కొంతవరకు మాత్రమే జరుగుతోంది. వివాహాల దగ్గరకు వచ్చేసరికి 'ప్రేమ' అనే పదాన్ని దరిదాపులికిరానివ్వరు. జాతకాలూ, కులాలూ, మతాలూ, శాఖలూ, హోదాలూ, అంతస్తులూ, అలవాట్లూ- ఇవన్నీ ప్రాముఖ్యాన్ని వహిస్తాయి. అన్నీకుదిరినా, కట్నాలూ లాంఛనాలూ వివాహబంధాన్ని చెదపురుగుల్లాగ పట్టుకొని జీవితాంతం పీడిస్తూనేవుంటాయి.

నవలా రచయితలూ, నాటక రచయితలూ వరకట్నం, అత్యాచారం, దోపిడీ మొదలైన సమస్యల్ని తీసుకుని జీవిత చిత్రణచేస్తున్నారు. వ్యంగ్యరచనలు చేస్తున్నారు. కానీ, సమస్యలు పరిష్కృతమవుతున్నాయా? "వరవిక్రయం"నాటకం రాసి దాదాపు ఏడు దశాబ్దాలవుతోంది. అది సినిమాకూడావచ్చి అర్ధశతాబ్దం దాటింది. కానీ, ఫలితం ఏమైనా కనిపిస్తోందా? వరకట్నపు దురాచారాలూ. అత్యాచారాలూ అంతకంతకు వెర్రితలలువేస్తున్నాయి. అమెరికాలో ఉద్యోగాలుచేస్తున్న యువకులూ, వారితల్లిదండ్రులుకూడా మరింత అత్యాశాపరులవుతున్నారు.

వరకట్న సమస్యగురించి ఎన్నో కథానికలు వచ్చాయిగాని, చెప్పదగిన నవల లేదనుకోవచ్చు. 1940కి పూర్వం చిలకమర్తి, శ్రీపాద వంటి ప్రసిద్ధ రచయితలు స్త్రీ విద్య అవసరంగురించీ, బాల్యవివాహాల దుష్ఫలితాల గురించీ, వితంతువుల దుస్థితిగురించీ కథలూ, నవలలూ, నాటకాలూ రాశారు. వరకట్న సమస్యగురించి ప్రత్యేకనవల రాశేదనుకుంటాను. దేశ స్వాతంత్ర్యానంతరం అసంఖ్యాకమైన నవలలువచ్చాయి. కుటుంబ జీవితాల్లోని సమస్యలగురించీ, స్త్రీపురుష సంబంధాల్లో వైకల్యాలగురించీ, వ్యక్తుల మనోవ్యథలగురించీ, స్త్రీలపై జరిగే లైంగిక అత్యాచారాలగురించీ, ధనికులు పేదలపై జరిపే ఘోరకృత్యాలగురించీ, అమానుష చర్యలగురించీ రచయితలూ, రచయిత్రులూ నవలలువ్రాశారు. కానీ, వరకట్న సమస్యనుమాత్రమే తీసుకొని, దాని దుష్టపరిణామాలను చిత్రిస్తూ

నవలలురాలేదు. వచ్చినా ప్రసిద్ధిచెంది, ప్రజల్ని ప్రభావితంచేసినది ఒక్కటికూడా లేదనిచెప్పవచ్చు. దీనికి కారణాలను పరిశోధించవలసిన అగత్యంవుంది. 'ధనమూల మిదం జగత్'అన్న నానుడి నిజం కనుకనేమో! ధన వ్యామోహానికి స్త్రీపురుషు లిద్దరూ అతీతులుకారు. అందువల్లనే ధనికులు పేదల్ని పీడించడం, మనిషిని మనిషి దోచుకోవడం, అక్రమమార్గంలోనైనాసరే ఏదోవిధంగా ధనసంపాదన త్వర త్వరగా చేసెయ్యాలనుకోవడం అంతకంతకు అధికమవుతున్నాయి.

మంచి నవలలు రానందువల్లకాదు సమాజంలో సంస్కరణలూ, మార్పులూ రాకపోవడం.

మద్యపానంచేయడం, రేసులకీ, క్లబ్బులకీపోతూ ఇంటినీ, భార్యనీ నిర్లక్ష్యం చేయడం, భార్యని హింసించడం, ప్రేమపేరుతో స్త్రీల జీవితాలతో చెలగాట మాడటం, వంటి అవాంఛిత చర్యలగురించీ, అవి సృష్టించే సమస్యలగురించీ రంగనాయకమ్మ, కోడూరి కౌసల్యాదేవి, మాలతీ చందూర్, కె రామలక్ష్మి మొద లైన రచయిత్రులు మంచి నవలలురాశారు. అయినా ఆ సమస్యలు పెరుగుతూనే వున్నాయి.

మన సామాజికవ్యవస్థలో కుటుంబం, వివాహం అత్యంత ప్రధానమైనవిగా వున్నాయి అనాదినుంచీ. అవే సమాజానికి పునాదులుగా ఏర్పడ్డాయి. కానీ, ఎంత లోపభూయిష్టమైపోయింది ఈ వ్యవస్థ! ఇందులోని లోపాలను బయటపెడుతూ రకరకాల నవలలువచ్చాయి. వస్తున్నాయి. చలం దగ్గరనుంచి ఓల్గావరకూ ఎందరో రచయితలూ, రచయిత్రులూ వివాహవ్యవస్థ సృష్టిస్తున్న వివిధ సమస్యల్ని ప్రతిభావంతంగా చర్చించారు—"మైదానం"నుంచి "మానవి" వరకూ— ఈ నవలల్లో ఎన్నో సమస్యలూ, మరెన్నో ముగింపులూ, పరిష్కారాలూ. ప్రతి రచయితదీ ఒక ప్రత్యేక దృక్పథం. వారు తీసుకున్న పాత్రల జీవితాలకు వేరువేరు ముగింపులు. సమస్యఒకటే అయినా, వ్యక్తుల స్పందనలూ, జీవన విధానాలూ వేరుగా వుంటాయి. ఈ పరిస్థితిలో మొత్తం సమాజాన్ని సంస్కరించడం సాధ్యమా అనే ప్రశ్న ఉదయిస్తుంది.

ఈ మధ్య వైద్యకళాశాలలు ప్రైవేటు చేయడంగురించి ఆందోళన జరుగు తోంది. అసలు వైద్యంచదవాలని కొందరు యువతీ యువకులూ, చదివించాలని వారి తల్లిదండ్రులూ ఎందుకంతగా ఎగబడుతున్నారు? వీరందరికీ వైద్యం మీద

అంత అభిరుచివున్నదనా? వైద్యంద్వారా రోగులకు అపారమైన సేవ చెయ్యా లనే కరుణా హృదయం వుండటంవల్లనా? కాదు! అసలుకారణం వైద్యరంగం అయితే ఎక్కువ వృద్ధిలోకిరావచ్చు వాళ్ళు—అంటే, ఎక్కువధనం సంపాదించ వచ్చు. కట్నాల రూపంలోనూ, ఫీజుల రూపంలోనూ, జీతాల రూపంలోనూ. అమెరికా వెళ్ళడానికీ, కెనడా వెళ్ళడానికీ, అరబ్ దేశాలు వెళ్ళడానికి అవకాశాలు లభిస్తాయి. అంటే, ఇంకా ఎక్కువధనం సంపాదించవచ్చు. అందుకు అప్పోసప్పో చేసి అయినా యాభైవేలూ, లక్షా 'కేపిటేషన్‌ఫీజు' రూపంలో పెట్టుబడి పెట్టడానికి సిద్ధపడుతున్నారు. అవినీతిమార్గాన్నీ, దోపిడీ పద్ధతినీ అవలంబిస్తే కోటీశ్వరులు కావచ్చు.

రెండేళ్ళ క్రితం రావులపల్లి సునీతగారు వైద్యరంగంలో అవినీతిగురించీ, మానవత్వం కొందరిలో మృగ్యం కావడంగురించీ "వృత్తి" అనే నవల రాశారు. నవల బావుందని మేధావులుకొందరు మెచ్చుకున్నారు. పాఠకులలో కొంత సంచ లనం కలిగింది. కానీ, వైద్యరంగంలో ఏదైనా కించిత్తు మార్పు సంభవించిందా? పరిశోధించాలి.

ప్రస్తుతం ఒక వారపత్రికలో, వైద్యరంగంగురించే మరో సంచలనాత్మక మైన నవల వస్తోంది. నగరంలో ప్రఖ్యాతిచెందిన ఒక పెద్ద ఆసుపత్రిలో కార్డియా లజీ విభాగంలో జరిగే దుర్మార్గాలగురించి హృదయాలను విచలితం చేసేటట్లు ఒక డాక్టరు రాస్తున్న నవల వస్తోంది ధారావాహికంగా. కల్పితమైనదే అయినా, అందులో కొంత నిజం వుండకపోదన్న భయం కలగకపోదు కాని సామాజిక ప్రయోజనం ఎంతవరకో వేచిచూడవలసిందే.

మరొక వారపత్రికలో, ఒక బాధ్యతాయుతమైన 'సంస్కరణ వాది' అను కునే ఒక డాక్టరు వైద్యం, మానసిక విజ్ఞానం పేరున స్త్రీ పురుష సంబంధాలలోని వికృతాల్నీ, వైపరీత్యాల్నీ వెయ్యివిధాలుగా నవలా రూపంలో చిత్రిస్తున్నారు. ఈ నవల పూర్తయ్యేసరికి (ఇప్పుడిప్పుడే అయ్యేటట్లు లేదు). స్త్రీపురుషుల్లో ముఖ్యంగా యువతీ యువకుల్లో అజ్ఞానపు పొరలు తొలిగిపోయి, స్త్రీ పురుష సంబంధాలు మెరుగుపడతాయేమో మరి! వేచి చూడాలి.

మరొక వారపత్రికలో, బాధ్యతాయుతమైన పోలీసు ఉద్యోగి ఒకరు లక్షల్లో బ్యాంకు దోపిడీలు జరగడాన్నీ, దానికి సంబంధించిన వ్యక్తుల విచిత్ర జీవితాల్ని గురించీ తమ నవలలో చిత్రిస్తున్నారు. అటువంటి వాటివల్ల దోపిడీలూ, అత్యాచారాలూ

పెరుగుతాయో, తరుగుతాయో, సమాజం మీద వాటి ప్రభావం ఏ విధంగా వుంటుందో ఆలోచించాలి.

ప్రతి రచయితకీ నిబద్ధతా, ఏదో ఒక సామాజిక, తాత్త్విక దృక్పథం ఉండాలంటూ వుంటారు. మంచి రచనలు చేయడానికి "మంచితనం" అనే పని వట్ల 'నిబద్ధత' వుండాలా, లేక మంచితనం అనేది ఆ మనిషి స్వభావమై ఉండాలా? మంచిగా ఆలోచించి, మంచిగా వుంటూ, మంచిని పెంచే మనిషికి ప్రత్యేకంగా 'మంచి'కి 'కట్టుబడి' వుండడం అన్న ప్రసక్తే రాదు. తల్లి తన పిల్లల్ని ప్రేమించడం ఆమె స్వభావం. అంతేగాని, పిల్లలపై ప్రేమకి 'కట్టుబడి' వుండాలి అనుకోనక్కరలేదు.

అయితే, ఏది మంచో, ఏది చెడో ఎలా తెలుస్తుంది? ఎవరు చెప్పగలరు? అనుకోవచ్చు. బుద్ధుడు చెప్పినది మంచా? మార్క్స్ చెప్పినది మంచిదనుకోవాలా? ఒక మనిషికి మంచి అనిపించినది మరో మనిషికి అనిపించకపోవడం, మనిషి పైమనసు మంచి అని గమనించిన దాన్ని లోలోపలి మనసు కాదనడం-ఈ వైరుధ్యం నిజానికి 'మంచి' అనే దాన్ని తప్పించుకోవడానికి ప్రయత్నించడంలో ఏర్పడు తుంది. మంచితనం అంటే మానవత్వానికి సంబంధించినది. మానవత్వపు విలువలు సార్వజనీనమూ, సార్వకాలికమూ అయినవి. అటువంటి విలువల్ని ప్రస్ఫుటం చేసే విశిష్ట రచనలే అందరి మన్ననకూ పాత్రమౌతాయి. అటువంటి నవలలే ఎప్పటికైనా మానవత్వాన్ని మేల్కొల్పడానికి దోహదం చేస్తాయి. ఏ కత్తీ, ఏ కలమూ మొత్తం సమాజాన్ని ఒక్కసారిగాకాని శాశ్వతంగా కాని మార్చ లేవు.

ఆరు కోట్లకు పైగా ఆంధ్రులున్నారని చెప్పుకుంటున్నాం. ఒక నవలగాని కథల పుస్తకంగాని వెయ్యి కాపీలు అమ్ముడుపోవడం గగనమైపోతోంది. ఎంత మంది మంచి నవలలన్నిటినీ చదువుతున్నారు? ఎంతమందిని కొన్ని నవలలైనా ఆలోచింపచేస్తున్నాయి? చదివి ఎంత మంది ప్రభావితులవుతున్నారు? సముద్రంలో నీటిబొట్టులా వుంది పరిస్థితి.

ఎన్ని సంస్కరణలు చేసినా, వాటి ఫలితంగా కొన్ని సమస్యలు పుట్టు కొస్తూనే వుంటాయి. వాటిని మళ్ళీ సరిదిద్దవలసిన అవసరం ఏర్పడుతోంది. ఉదాహరణకి నా చిన్నతనంలో "స్త్రీవిద్య అవసరమా, కాదా?" అనే విషయం

మీద చర్చలు జరుగుతూండేవి స్కూళ్ళలో. క్రమంగా స్త్రీలను చదివించడం కొంతకాలం పెరిగింది. "ఆడవాళ్ళు చదువుకుని ఉద్యోగాలు చెయ్యాలా? ఊళ్ళు ఏలాలా" అనీ, "ఉద్యోగం పురుష లక్షణం" అనీ సామెతలుండేవి. కొంతవరకు ఇప్పుడు చదువుకున్న స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటం పరిపాటి అవుతోంది కానీ, అందువల్ల చదువుకున్న స్త్రీల పరిస్థితి ఆనందమయంగా మారిందా? స్త్రీలకి ఆర్థికంగానూ, సామాజికంగానూ స్వేచ్ఛ లభించింది. స్త్రీలకి చాకిరీ ఎక్కువైంది. పిల్లల్ని సరిగా పెంచటంలేదనీ, వంట శ్రద్ధగా చెయ్యడంలేదనీ, అత్తమామల్ని సరిగ్గా చూసుకోవడంలేదనీ, బంధువులను పూర్వంలా ఆదరించడంలేదనీ నిందలు వేస్తున్నారు. ఒకరు వేయడమేకాక తరతరాలనుంచీ నరనరాల్లోనూ ఇంకిపోయిన సంప్రదాయాల మూలంగా స్త్రీలే అపరాధం చేస్తున్నట్లు లోలోపల బాధపడుతూ ఉంటారు–'సహజంగా' తమ గృహబాధ్యతల్ని సరిగ్గా నిర్వహించలేకపోతున్నందుకు వీటికి తోడు బయటి ప్రపంచంలో పురుషుల చేతుల్లో మరిన్ని అవమానాలు ఎదుర్కొంటున్నారు. చదువుకున్న యువతులకు పెళ్ళిళ్ళు కావడం కష్టమైపోతోంది.

పూర్వం ఆడపిల్లలు చదువుకుంటేనో, ఉద్యోగం చేస్తుంటేనో కట్నంబాధ తప్పుతుందనుకునేవారు. ఇప్పుడు యువకుల ఆశ మరింత పెచ్చుపెరిగింది.

'చదువు' మనిషిని సంస్కరిస్తుందా అని నిస్పృహ చెందేటంత మూర్ఖంగా కొరకరాని కొయ్యల్లా తయారవుతున్నారు కొందరు–పురుషులే కాదు, స్త్రీలుకూడా. తమ అత్యాశల్నీ, అహంకారాల్నీ విడనాడటంలేదు.

మనిషిలో మార్పు రానంతవరకూ, మనిషిలో మానవత్వం మేల్కొనంతవరకూ, మనిషిలోనూ, మనిషికీ మనిషికీ మధ్యా సంఘర్షణతప్పదు. ఒకమనిషి మరో మనిషితో పోటీపడటం, ఒక మనిషి మరో మనిషిని దోచుకోవడం మానదు. అందుకే మానవత్వపు విలువల్ని నాటే కథలు కావాలి మనకు. నవలలు అటువంటి విలువల్ని పెంపొందించేటట్లుగా ఉండాలి అంటే, నీతికథలూ, ఉపదేశాలు చేసే కథలూ రాయమని కాదు ఆలోచింపజేసే నవలలు కావాలి. కథలూ, నవలలూ చదివి ఎవరూ తమ జీవితాల్ని తక్షణం సరిదిద్దుకోలేరు. కనీసం మనసుల్లో సంచలనం కలిగించగలగాలి.

బుద్ధుడి ప్రవచనాలకు మారే మనుషులు కొద్దిమంది ఉండొచ్చు. జిడ్డు

కృష్ణమూర్తి వంటి వారి ప్రవచనాలు కొంతమందికి ప్రేరణకలిగించవచ్చు. అలాగే, మంచి నవలలు చదివి మారే మనుషులు కొద్దిమందిఅయినా ఉండకపోరు. మొత్తం సమాజాన్ని ఎవ్వరూ మార్చలేరు. ఒకరిద్దరు మారినా చాలు, వారిచుట్టూ వున్న వారిపై కొద్దోగొప్పో ప్రభావం ఉండకపోదు.

ఒక్కొక్క దశాబ్దాన్ని సమీక్షించి చూస్తే, ఎటువంటి మార్పులొచ్చాయో, సామాజిక పరిస్థితులూ, మనుషులూ మార్పు చెందడం ఎలా జరిగిందో అని ఆశ్చర్యం కలుగుతుంది. ఈ మార్పుల్లో మంచీ, చెడూ రెండూ వుంటాయి. కట్టూ బొట్టూ, చదువులూ, ఉద్యోగాలూ, యంత్రాలూ, పరికరాలూ, వినోదప్రక్రియలూ ఇటువంటివాటిలో ఎన్ని మార్పులొచ్చినా, ఎంత ప్రగతి సాధించామనుకున్నా, సమాజంలో దుర్మార్గం, సంఘర్షణా కొనసాగుతూనే ఉన్నాయి.

ఈ రోజుల్లో పత్రికలలో వచ్చే 'అశ్లీల' సాహిత్యమూ, క్షుద్ర సాహిత్యమూ చదివీ, సినిమాలు చూసీ జనం చెడిపోతున్నారని చాలామంది అంటూఉంటారు. జనం కోరుతున్నారు కాబట్టీ, నేటి సమాజంలో అటువంటి లక్షణాలు హెచ్చుగా ఉన్నాయి కాబట్టే నేటిసాహిత్యమూ సినిమాలూ అందుకు తగినట్టుగానే ఉంటూ న్నాయనీ సమాధానం ఇస్తూ ఉంటారు కొందరు. రెండుపక్షాల వాదనల్లోనూ కొంత నిజం లేకపోలేదు. విత్తుముందా, చెట్టుముందా అనే మీమాంసలాంటిది. ఏది ఏమైనా, 'చెడ్డవి' ప్రభావితం చేసినంత సులభంగా 'మంచివి' చెయ్యలేవని తెలుసు కున్నట్లుగానే, మంచివాటి ప్రభావంకూడా కొంత ఉండకపోదని గ్రహించవచ్చు.

అందుకే సంఘ సంస్కరణోద్యమం ఒక నిత్యావసరం. సంస్కరణ ఒక నిత్యయజ్ఞం అందుకు నవల కూడా ఒక సాధనంగా ఉపయోగపడుతుంది. అటు వంటి ఆశాభావమే మంచి నవలలు రావడానికి దోహదం చేస్తుంది.

('స్త్రీలు, సాహిత్యం, సంస్కరణ, విప్లవం'
సం: మల్లాది సుబ్బమ్మ, 1993.)



# సీతాదేవి నవలల్లో స్త్రీ వాదం

ఒకటిన్నర దశాబ్దాలుగా స్త్రీవాదం తెలుగు సాహిత్యంలో కవిత్వం ద్వారా, కథల ద్వారా ప్రాచుర్యం పొందుతున్నది. అయితే స్త్రీవాద ఉద్యమానికి బలమైన స్ఫూర్తిని ఇచ్చింది నవలలే. అటువంటి నవలల్ని రాసిన వారిలో రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, ఓల్గా ప్రముఖ స్థానం వహిస్తారు.

రంగనాయకమ్మ సైద్ధాంతిక చర్చలతోనూ, ఓల్గా రాజకీయ దృక్పథంతోనూ రాయడంలో ప్రసిద్ధి చెందారు. సీతాదేవి స్త్రీలను కించపరిచే ప్రాచీన సాహిత్యాన్ని నిరసిస్తూ, స్త్రీలకు అన్యాయం చేస్తున్న సామాజిక నీతిసూత్రాల్నీ సంప్రదాయాల్నీ తీవ్రంగా ఖండిస్తూ కొన్ని స్త్రీవాద నవలలు రాశారు. వీరు పురుషాధిక్య సమాజంలోని స్త్రీ పురుష సంబంధాల గురించీ, వివాహ, కుటుంబ వ్యవస్థల గురించీ సంప్రదాయ విరుద్ధమైన భావాలను తమ పాత్రల ద్వారా ప్రకటించి, స్త్రీల వ్యక్తిగత విముక్తికి మార్గాన్ని చూపారు.

సీతాదేవి గారి స్త్రీవాద నవలల్లో 'క్లాసిక్' అనదగినది 'రాబందులూ-రామ చిలుకలూ'. మిగిలిన వాటిలో మూడింటిని– 'ఉరిత్రాడు' 'అర్చన' 'వైతరణి'– ఆమె స్త్రీవాద భావాలకు ప్రతీకలుగా తీసుకోవచ్చు. ఈ మూడు చిన్న నవలల పరిశీలనే ఈ వ్యాసం.

సీతాదేవి సృష్టించిన అభ్యుదయ భావాలు గల పాత్రలు (వారి బలహీనతలతో సహా) 'అర్చన' నవలలో తరుణ్, అర్చన, 'ఉరిత్రాడు' నవలలో కరుణ, 'వైతరణి' నవలలో పార్వతి. ఈ పాత్రల ద్వారా రచయిత్రి తమ భావాల్ని, ప్రగాఢ విశ్వాసాల్ని స్పష్టంగా ప్రకటించారు.

'అర్చన' నవలలో, పరిస్థితులను భరించలేక ఇద్దరు స్త్రీలు విభిన్న కారణాలవల్ల ఆత్మహత్య చేసుకోగా, 'వైతరణి' నవలలో కూతురుచేసిన పనికి తలెత్తుకోలేక, తానున్న సంకటపరిస్థితిని ఎదుర్కోలేక తల్లి ఆత్మహత్య చేసుకుంటుంది. ఆత్మహత్యని అనివార్యం చేసిన సామాజిక పరిస్థితులను ఎత్తి చూపిస్తారు రచ

యిత్రి. 'ఉరిత్రాడు' నవలలో కథానాయిక వివాహబంధాన్ని తెంచుకుని స్వతంత్రంగా బ్రతకడానికి ఎటో వెళ్ళిపోతుంది.

'అర్చన' నవలలో అర్చన, పక్కింటి తరుణ్ అక్కా తమ్ముళ్లలాగా ఆప్యాయంగా ఉంటారు. తాము చదివిన సాహిత్యాన్ని అభ్యుదయ భావాలతో చర్చించుకుంటారు. ఒకసారి ఆమె పుస్తకంలోని ఒక ప్రేమ లేఖచూసి ఆమె శీలాన్ని శంకిస్తాడు తమ్ముడు వంటి తరుణ్. ఆమెని అసహ్యించుకుంటాడు. అర్చన పెళ్లయి అత్తవారింటికి వెళ్ళిన తర్వాత భర్తకూడా ఆమెను అనుమానిస్తాడు. వేధించుకుతింటాడు. ఆ బాధలు భరించలేక ఆమె ఆత్మహత్య చేసుకుంటుంది. అంతకు ముందు అర్చన తమ్ముడికి ఒక ఉత్తరం రాస్తుంది- స్త్రీని గౌరవించడం నేర్చుకోమని కోరుతూ. మళ్ళీ అక్క మీద గౌరవం కలిగి ఒక మోసపోయిన స్త్రీని ఆదర్శవివాహం చేసుకోవాలనుకుంటాడు. తను చిన్నప్పుడు ప్రేమించిన లలిత అనే అమ్మాయి మోసపోయి వేశ్యాగృహంపాలైతే ఆమెను విడిపిస్తాడు. కాని వివాహం చేసుకునే ధైర్యం లేక ఆమె తల్లిదండ్రుల దగ్గరికి పంపించేస్తాడు. అక్కడ తిరస్కారం ఎదురై ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంటుంది.

ఈ నవలలో ముఖ్యపాత్రల ద్వారా సీతాదేవి గారు వ్యక్తం చేసిన కొన్ని అభిప్రాయాలు—

గోడమీద రాసే అసభ్యకరమైన రాతలగురించి- "ఆ రాతలే ఒక మగవాడి గురించి రాస్తే ఆత్మహత్య చేసుకుంటాడా? చేసుకోడు. అవమానంగా భావించడు. పైగా అదో క్రెడిట్ అనుకొని కాలర్ ఎత్తుకొని తిరుగుతాడు. ఎందుకని? ఇది మగవాడి ప్రపంచం. నియమాలన్నీ ఆడదానికే పెట్టారు. ఆడదాని శీలం గురించే అనేక గ్రంథాలు రాశారు. నీతులన్నీ ఆడదానికే చెప్పారు. మగవాడికి శీలం అక్కర్లేదా?"

భర్తల గురించి- తన ప్రవర్తన మంచిది కాకపోయినా, "అటువంటి మగవాడు కూడా తన పెళ్లాం పతివ్రతగా ఉండాలనే కోరుకుంటాడు. పెళ్ళికాక ముందు, తెలిసీ తెలియని వయసులో ఎవరైనా ప్రేమలేఖ రాసినట్టు తెలిస్తేకూడా భరించలేడు".

"ఈ దేశంలో సీతల్నీ, సుమతుల్నీ ఆదర్శంగా చూపిస్తూ ఆడదాని జీవితాన్ని నరకప్రాయంగా చేస్తున్నారు. ఇది మగవాడి ప్రపంచంరా తమ్ముడూ!"

"పురాణాల్లో, కావ్యాల్లో, కథల్లో, సూక్తుల్లో, జానపదాల్లో, స్త్రీల పాటల్లో, అప్పగింతల పాటల్లో, పురుషులు స్త్రీ పాతివ్రత్యాన్ని గురించి నూరిపోశారు. ఆ మందు ఈ జాతి నరనరానికీ పాకింది. ఈ విషం పురుషుల కంటే స్త్రీల రక్తంలోనే ఎక్కువగా ఎక్కించడం జరిగింది".

పతివ్రతల గురించి–"అన్నింటి కంటె అన్యాయం. ఈ అబద్ధాలను పురుషుడి కంటే స్త్రీయే ఎక్కువగా నమ్మడం".

"ఆ నమ్మకంతోనే భర్త చితిమీద తనను తాను నిలువునా కాల్చుకుంది".

"ఆ నమ్మకంతోనే తలగొరిగించినా, ఒక్కపూట తిండి పెట్టినా కిక్కురుమనలేదు".

"—సీత అంటే మనువటి గౌరవం లేదు. సానుభూతిలేదు".

"ఆమె అగ్నిప్రవేశం ఎందుకు చేసింది"?

"నేను తప్పు చెయ్యలేదు. నమ్మితే నమ్ము. నమ్మకపోతే ఉరేసుకుచావు" అని ఆత్మాభిమానంతో ఎందుకు ఎదురు తిరగలేదు?"

"సుమతిని తల్చుకుంటే మరీ చిరాకు. భర్తను వేశ్య ఇంటికి తీసుకు వెళ్ళిందట. భర్త ప్రాణంకోసం తన పాతివ్రత్యమహాత్మ్యంతో భర్త 'కుష్ఠువాడిని–నడవలేని వాడిని, 'నీకు ప్రియురాలు కావాలా? సిగ్గు లేదూ'? అని నాలుగు దులిః వెయ్యలేకపోవడానికి కారణం ఏమిటి?"

"—బి.ఎ. పాసయిన అర్చన అక్క మాత్రం ఏం చేసింది? ఎదురు తిరి మొగుణ్ణి శీలంలేని నీతో నేను కాపురంచెయ్యను అని ఎందుకు చెప్పలేకపోయిం( అతన్ని వదిలి ఎందుకు వచ్చెయ్యలేకపోయింది? చెయ్యని తప్పుకు ఆత్మప ఎందుకు చేసుకుంది?"

"నీలాంటి కుసంస్కారితో కాపురం చెయ్యను గాక చెయ్యను, నేను వెః పోతున్నాను. ఇక నీ ముఖం చూడను అని ఎందుకు చెప్పలేకపోయింది?"

"అలావచ్చేస్తే సమాజం తనను చిన్నచూపు చూస్తుందని భయం. మొగుణ్ణి వదిలేసిన ఆడది అంటారనే జంకు. తండ్రికి సంప్రదాయం మీద నమ్మకం ఉంది. తండ్రి ఏమంటాడోనని భయం?"

"ఈ సంప్రదాయాలూ, ఈ నమ్మకాలూ, ఆడదాని పాతివ్రత్యాన్ని గురించి నూరిపోసిన ఈ కవులందరూ కలిసి, మళ్ళీ అర్చన అక్కయ్యను బ్రతికించగలరా"

ప్రాచీన సాహిత్యాన్ని గురించి—"స్త్రీల ప్రాతివ్రత్యాన్ని నూరిపోసే సాహిత్యాన్ని తగలపెట్టాలి. స్త్రీలను 'గృహలక్ష్మి' 'మాతృమూర్తి' అంటూ దొంగ పొగడ్తలతో ఆమె ఆలోచనల్లోకి విషం ఎక్కించే కావ్యాలను నిషేధించాలి.

కనీసం ఆ కావ్యాలున్న భాగాలను భావి సంతానం చదివే అవకాశం లేకుండా చెయ్యాలి".

"జారిణి, చపల, కాముకి అంటూ స్త్రీలను కించపరిచే కావ్యాలను పూడ్చిపెట్టాలి".

"కొత్త విలువలతో సాహిత్య సృష్టి జరగాలి. స్త్రీ పురుషుల్ని ఇద్దర్నీ సమానంగా చిత్రించే మానవతావాదం సాహిత్యం ద్వారా ముందుతరాల వారికి అందించాలి".

"అప్పటికి గాని నిజంగా స్త్రీకి పూర్తిగా విముక్తి కలగదు". ఇవన్నీ అర్చన నవలలోని పాత్రల భావాలు, స్వభావాలు.

'ఉరితాడు' నవలలో, తండ్రిలేని ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యలేని దుస్థితిలో కన్నకూతుళ్ళనే హింసిస్తుంది తల్లి. పెద్ద కూతురు కరుణని ఒక దుష్టుడికిచ్చి పెళ్ళి చేస్తుంది. కట్నం ఇచ్చుకోలేక, ఆ అమ్మాయి భర్త పెట్టే బాధలు భరించలేకపోతుంది. బంగారం కోసం పుస్తెల తాడు తెంపి భార్యను ఇంట్లోంచి గెంటేస్తాడు. పుట్టింట్లో తల్లీ, చెల్లెలూ నిరసనగా చూస్తారు తమ్ముడూ, వదినా, మాత్రం సానుభూతి చూపిస్తారు. చివరికి బలవంతం చేసి మళ్ళీ కాపురానికి పంపిస్తారు. ఈసారి తనే స్వయంగా పసుపు కొమ్ము కట్టిన తాడుని తెంపేసి భర్త ముఖాన పారేసి పుట్టింటికి వచ్చి తను ఇంక స్వతంత్రంగా బతకదలచుకున్నానని చెప్పి ఎటో వెళ్ళిపోతుంది.

ఆ కరుణ ఇలా అంటుంది– "వదినా! నీ పిచ్చిగాని, కలవని మనుషుల్ని

యీ తాళ్ళు కలుపుతాయా? మంగళ వాద్యాలూ మోగుతుండగా మంత్రాలు వల్లి స్తుండగా అగ్నిసాక్షిగా పదిమంది ముందు ఆయన నా మెళ్ళో మాంగల్యం కట్టాడు. ఆ మంత్రాలలో బలం లేదు. ఆ అగ్ని సాక్ష్యం ఇవ్వలేదు. ఆ తాడులో గట్టితనం లేదు. తాళికట్టిన వాడికే దానిమీద నమ్మకం లేదు. బంగారంకోసం తెంపుకున్నాడు. అతనికి లేని నమ్మకం దానిమీద నాకెందుకు వదినా? వద్దు! నాకా తాడు వద్దు!"

"నిజంగానే ఆ మంత్రాలతో కట్టిన ఆ తాళిబొట్టుకు ఆ ప్రభావం వుంటే మమ్మల్ని కలిపే వుంచేది. పుటుక్కున తెంచేది కాదు..."

"...స్త్రీ భార్యగా, గృహలక్ష్మిగా, తన పిల్లలకు తల్లిగా. పురుషుడికి కామ దాహాన్ని పూర్తిగా తీర్చలేకపోయింది. అందుకే కొంతమంది స్త్రీలను ఈ పదవుల నుంచి దూరంగా ఉంచాడు పురుషుడు. 'ఈ స్త్రీలే స్వర్గంలో అప్సరసలుగా, ఈ లోకంలో వారకాంతలుగా పిలువబడుతున్నారు".

"భర్త ఎటువంటివాడైనా అతనితో బతుకు యెంతనరకప్రాయమైనా చెప్పు కింద తేలులా పడిఉండాల్సిందేనా"?

"పెళ్లాన్ని వదిలేసిన మగవాణ్ణి ఎవరూ చిన్నచూపు చూడరేం? మొగుడు వదిలేసిన ఆడదాన్ని మాత్రం ఎందుకు హీనంగా చూస్తారు"?

"—బంగారం లేదుగా? పసుపుకొమ్ముతో కట్టుకున్న మాంగల్యం తెంపు కుంటే అతనికేం వస్తుంది? ...అందుకని నేనే తెంచి అతని ముఖంమీద కొట్టి వచ్చాను".

"నిరపరాధి కంఠానికి ఉరితాడు తగిలించారు! ఆ తాడు అతని కంఠానికి ప్రతి నిముషం బిగిసిపోతూ ఉంది. ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. అతని చేతులు బంధించి లేవు. ఆ తాడును అతను తెంపుకోగలడు. అటువంటప్పుడు ఆ వ్యక్తి ఏం చేస్తాడు. చెప్పు వదినా— ఆ వ్యక్తి ఆ తాడును తెంపి తనను రక్షించుకుం టాడు దారుణ యాతన నుంచి. నేను అదే చేశాను—" అంటుంది కరుణ.

'ఉరిత్రాడు'లో కరుణ పాత్రలో తన సమస్యను తానే పరిష్కరించుకునే చైతన్యం కనిపిస్తుంది. అన్యాయం జరిగిన స్త్రీ తిరగబడాలని బోధిస్తుంది.

ఇక 'వైతరణి' నవలలో ప్రధానపాత్రలు ఒక తల్లి, కూతురు. ఆర్థికస్తోమత లేక వారు ఎన్నో కష్టాలనుభవించారు. కూతురిని ముసలివాడికిచ్చి పెళ్ళి చేయ వలసివచ్చింది. ఇష్టంలేని ముసలిభర్తని వదిలి అతని మేనల్లుడితో లేచిపోయింది. ఆ కూతురు. ముసలి అల్లుడి బాధ భరించలేక, తల్లి ఆత్మహత్య చేసుకుంటుంది

లేచిపోయేటప్పుడు కూతురు తన తల్లికి రాసిన ఉత్తరంలో ఇలా అంటుంది–

"సంఘం కొన్ని కట్టుబాట్లను ఏర్పరచింది. అవి దాటడమే తప్పంటావు కదూ! ఆ సంఘం నీకూ, నాకూ ఇచ్చింది ఏమిటి? జన్మదుఃఖం. నీలా నాకు జన్మఃదుఃఖాన్ని భరించే ఓపిక లేదమ్మా. నా జీవితాన్ని నా ఇష్టం వచ్చినట్లు మలచుకోవటానికి కూడా హక్కులేదా అమ్మా! ఈ కట్టుబాట్లు కేవలం ఆడదాని కోసమే ఏర్పరచారు మన పూర్వులు. ఎందువల్లనంటావు?

సంఘాన్ని శాసించేవాడూ, శాస్త్రాలు సృష్టించిన వాడూ మగవాడే కాబట్టే.

"తాతయ్యా, అమ్మమ్మా ఆడపిల్లకోసం పూజలు చేశారు. నిన్నుకూడా గుళ్లో దేవతలా చూశారు. గౌరవించారు. అంతేకాని మగపిల్లవాడిలా నిన్ను పెంచలేకపోయారు".

"నీకు స్వతంత్రంగా బతకటానికి అవసరమైన విద్యనుకానీ, అవకాశాలను కాని కల్పించలేదు. వాటి అవసరం ఉంటుందని కూడా ఆలోచించలేదు– కట్నం అనే దురాచారం ఎందుకు ప్రబలింది? ఆడపిల్లకు తల్లిదండ్రుల ఆస్తిమీద అధి కారం లేకపోవటం వల్లనే. నీకూ అన్నయ్యలతోపాటు సమభాగం ఆస్తి లభించిం దంటే, నీకు నీదంటూ ఓ ఇల్లూ, పొట్టకింత తిండీ ఉండేది కదూ"?

"మహాతల్లి! పుణ్యాత్మురాలు! పతివ్రత! అంటూ లోకం నేను చచ్చిపోయాక పొగుడుతుంది. ఆ పొగడ్తలకోసమే గదూ ఆడది నికృష్టంగా బతుకుతోంది?"

"ఎన్ని అవమానాలకు గురై, ఎంత నికృష్టపు బతుకు బతికి రాలిపోతే ఈ లోకం, సంఘం అంత హర్షిస్తుంది"

"కాని నాకు అవేవీ అక్కర్లేదమ్మా! నాకు జీవితం కావాలి. జీవితాన్ని అనుభవించాలి. సూర్యం నన్ను వివాహం చేసుకుంటానన్నాడు. చేసుకోకపోయినా నేను పెద్దగా విచారించను".

"ఈ వైతరణి లాంటి జీవితం నుంచి విముక్తికావాలి. నా కోసం మరొకరు ఏర్పరచిన రక్షణ కవచంలో భద్రంగా నేను వుండలేనమ్మా'- అంటూ ముగిస్తుంది ఉత్తరం.

వాసిరెడ్డి సీతాదేవి గారి ఈ మూడు నవలలూ కాలక్షేపం కోసం రాసినవి కావు. సంప్రదాయాలతో నిండిన కారడవిల్లో చిక్కుకున్న స్త్రీలకు వెలుగుబాట చూపించడానికీ, సామాజిక నీతి నియమాల 'వల' నుంచి తప్పించడానికీ రాసినవి. స్త్రీలకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలిపి పురుషాధిక్య సమాజాన్ని కూలగొట్టి స్త్రీలే సమసమాజాన్ని స్థాపించాలనే సందేశం ఇస్తూ రాసిన సజీవ నవలలు ఇవి.

(ఆంధ్రప్రభ, జూన్ 26, 1995)



# 'వరవిక్రయం'

కాళ్ళకూరి నారాయణరావుగారు రాసిన "వరవిక్రయం" అనే సాంఘిక నాటకాన్ని ప్రచురించి 66 సంవత్సరాలైంది. ఆదే పేరుతో ఆ నాటకం సినిమాగా వచ్చి 50 సంవత్సరాలైంది. అప్పట్లో ఆ నాటకమూ, సినిమాకూడా విపరీతమైన సంచలనాన్ని రేకెత్తించాయి. అయితే ఏం లాభం ? వరకట్న దురాచారం దినదిన ప్రవర్ధమానమవుతోంది పెరుగుతున్న అన్ని ధరలతోబాటూ వరకట్నం రేటుకూడా పెరుగుతోంది. నాగరికతతో బాటు వరుల కోరికలుకూడా వెర్రితలలు వేస్తున్నాయి. ఆడపిల్లల చదువు సంధ్యలూ, ఉద్యోగార్హతలూ, పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఏవీ వరకట్న దురాచారాన్ని రూపుమాపలేకపోతున్నాయి.

ఈ సందర్భంలో 'వరవిక్రయం' నాటకాన్ని మరోసారి పునశ్చరణ చేసుకోవడం అసందర్భంకాకపోవడమేకాదు, అత్యంత ఆవశ్యకం కూడా.

ఈ నాటకం బహుళ ప్రచారంలో ఉన్నరోజుల్లో జనసామాన్యంమీద దాని ప్రభావం ఎంతగా ఉండేదంటే ఎవరైనా పిసినిగొట్టులా ప్రవర్తిస్తే సింగరాజు లింగరాజు అని పేరుపెట్టేవారు వెటకారంగా!

ఆ లింగరాజుగారి భార్య ఎంత పతివ్రతలు గల దేశంలో పుట్టినదైనా భర్త పిసినారితనాన్ని భరించలేక "తండ్రీ నా భర్తవంటి భర్తను మాత్రం పగవారికైనా ప్రసాదింపకుము" అని భగవంతుని ప్రార్థిస్తుంది.

ఇక సింగరాజు లింగరాజుగారు తమ సుపుత్రునికి సంబంధం నిశ్చయించుకున్న సందర్భంలో కాబోయే వియ్యంకుని దగ్గర్నుంచి బజానాగా కొంత సొమ్ము తీసుకుని పెళ్ళిళ్లపేరయ్య సూచన మేరకు ఆ సొమ్ముకు ఇచ్చిన రసీదులో ఇలారాస్తాడు.

"మీ కుమార్తె చి.సౌ. కాళిందిని నా కుమారుడు చి. బసవరాజునకు చేసికొనుటకును, అందులకై మీరు మాకు కట్నంకింద యైదువేల యైదువందల రూపాయల రొఖ్ఖము, రవ్వల ఉంగరము, వెండి చెంబులు, వెండికంచము, వెండి

పావుకోళ్లు, పట్టుతాబితాలు, వియ్యపురాలు వియ్యంకుల లాంఛనములు యధా విధిగా నిచ్చుటకును, ప్రతిపూట బెండ్లివారిని బ్యాండుతో బిలుచుటకును, రాక పోకలకు బండ్లు, రాత్రులు దివిటీలు ఏర్పాటుచేయుటకును, రెండుసారులు పిండి వంటలతో భోజనములు, మూడుసారులు కాఫీ, సోడా, యుప్మా, యిడ్డెన్లు, దోసె, రవ్వలడ్డు, కాజా, మైసూరుపాకాలతో ఫలహారములు చొప్పున మా ఇష్టానుసార మైదు దినములు మమ్ము గౌరవించుటకును, అంపకాల నాడు మాకుపట్టుబట్టలు, మాతో వచ్చువారికుప్పాడ బట్టలు నిచ్చుటకును నిర్ణయించుకొని బజానా క్రింద పదిరూపాయలిచ్చినారు గనుక ముట్టినవి...."

ఇదికాక తాతగారు పిల్లపేర రాసిఇచ్చిన దస్తావేజును పట్టుకొచ్చి చూపించ మంటాడు కాబోయే వియ్యంకుడితో.

కాలం మారింది. దశాబ్దాలు గడిచాయి. కానీ మనుషులు మారలేదు. కోరి కల తీరు మారలేదు. ఎటొచ్చీ వెండి పావుకోళ్ళు బదులు టీవీ లాంటివి అడుగు తున్నారు ఈనాడు. రాకపోకలకు బండ్లు అడగడానికి బదులు కుర్రవాడికి అమె రికా వెళ్ళడానికి టిక్కెట్లు కొనివ్వమంటున్నారు. కాలం తెచ్చినమార్పులు ఈ రకమైనవి మాత్రమే.

ఆ నాటకంలో కట్నం డబ్బు పెళ్ళి ఖర్చులకయే. డబ్బూ సమకూర్చ డానికి అప్పుకూడా దొరకక్క పిల్లతండ్రి నానా అవస్థలూ పడుతూండటం చూసి పిల్లతల్లి ఇలా వాపోతుంది-

"పిండి బొమ్మయైన బిల్లనిచ్చెదమన
గానె చేయిచాచు గట్నమునకు,
ఇట్టి తరిని గట్టనమీయకుండగ బుస్తె
కట్టువరుడు జగతి గానబడునె"

వదువు కాళింది చిన్నపిల్లే అయినా ఎంతో ఆత్మాభిమానంతో ఇలా అంటుంది తల్లితో

"కట్నమే కోరివచ్చిన ఖరముతోడ
దగుదునని కాపురము సేయుదానికంటె
బెండ్లియే మానుకొని మగబిడ్డవలెనె
తల్లిదండ్రుల కడనుంట తప్పిదంబె ?"

అలా చేయడం సంఘవిరుద్ధమనీ, మర్యాద లక్షణం కాదనీ వాదిస్తున్న తల్లితో అంటుందిలా-

"త్రాగు వారుంట చేతనే తాళ్లగీత !
కొనెడు వారుంట చేతనే గోవుల వధ
పోవువారుంట చేతనే భోగవృత్తి
అట్లె ప్రోత్సాహమే హేతు వన్నిటికిని"

ఆమె అభిప్రాయాలను లక్ష్యపెట్టకుండా పెళ్ళిచెయ్యడం కోసం ఉన్న కాస్త పొలాన్నీ తండ్రి అమ్ముకొచ్చాడని విని భరించలేక నూతిలోపడి ఆత్మహత్య చేసుకుంటుంది. కాళింది చెల్లెలు కమల కట్నం కోరుతున్న పిల్లవాడి తండ్రికి బుద్ధిచెప్పడానికి నిశ్చయించుకుంటుంది. ఆ కుర్రవాణ్ణే పెళ్ళాడి మామగారికి బుద్ధి వచ్చేట్లు చేస్తుంది చివరికి.

నాటకం ఆఖరులో కమల తండ్రి కట్నంకోరే పెళ్ళికొడుకులనూ, కట్నాలకూ, లాంఛనాలకూ బేరాలాడే పెళ్ళికొడుకు తండ్రులనూ ఉద్దేశించి ఇలా అంటాడు-

"కొసరి కట్నములందుకొంటయే గౌరవ
మని తలపోసెడి యజ్ఞులార
వచ్చి ముద్దుగ బిల్లనిచ్చెదమన గట్న
ములకు బేరములాడు మూర్ఖులార
అబ్బాయి పెండ్లితో నప్పుసప్పులు తీర్చి
నిలువ సేయగ జూచు నీచులార
ముడుపులుగొని తెచ్చి ముంగల నిడుదాక
పల్లకి యెత్తని పశువులారా
ఏమి యన్యాయమిది ! పూర్వమెన్నడేని
వరుల నిటువిక్రయించిన వారుగలరె ?
పూజ్యతరమైన మన పుణ్యభూమియందు
గటకటా ! నరమాంస విక్రయము దగునె !"

బుద్ధి తెచ్చుకున్న పెళ్ళికొడుకు కట్నాన్ని ఆశించే యువకుల నుద్దేశించి ఇలా అంటాడు-

"కట్నాలకై పుస్తకములు జేగాని పాత
కాలలకేగెడు చవటలార !
పిలిచి కాళ్ళకడిగి పిల్లనిచ్చిన వారి
కొంపలమ్మించెడి కుమతులార
అల్కపాన్పుల నెక్కి యవియివి కావలె
నని శివమాడెడి యధములార
ఎంత పెట్టిన దిని యెప్పటికప్పుడు
నిష్ఠురోక్తులె పల్కు నీచులార !...."

భర్తకీ, మామగారికీ బుద్ధిచెప్పిన కమల కన్యలకు ఇలా ఉద్బోధిస్తుంది-

"వెలపుచ్చుకొని వచ్చు వెడగులచే బుస్తె
కట్టించుకొనియెడు కన్నెలార
కట్నాల మగలతో గలిసి పల్లకిలోన
గూరుచుండెడు పెండ్లి కూతులార
కోరిన వెలయిచ్చి కొని తెచ్చుకొన్న
దాసులకు దాస్యము సేయు సుదతులార
మీ వివాహములకై మీవారు ఋణములు
పాలౌట గని యోర్చు పడతులార
ఎంచి చూడగ స్త్రీజాతి కింత కన్న
గౌరవము లేమి యిల మరి కలదె ? చాలు
జాలు నికనైన బౌరుషజ్ఞానములను
గలిగి మెలగుడు సత్కీర్తి గనుడు"

66 ఏళ్ళు గడిచినా మనం ఇంకా మేలుకోలేదు !.

(ఉదయం నవతరం వారపత్రిక, 1-12-89)



# ఇల్లాలిస్థానం - 'బొమ్మరిల్లు'

గత శతాబ్దానికి చెందిన విశ్వవిఖ్యాత నార్వేజియన్ నాటక రచయిత హెన్‌రిక్ ఇబ్సెన్ రచించిన ప్రసిద్ధ నాటకాల్లో ఆనాటి పాశ్చాత్య క్రైస్తవ సమాజంలో సంచలనాన్ని రేకెత్తించిన వాటిలో "బొమ్మరిల్లు" ప్రధానమైనది.

ఇబ్సెన్ రచించిన "బొమ్మరిల్లు" నాటకం పాతివ్రత్యానికీ, మాతృత్వానికీ గొడ్డలిపెట్టు అనీ, సాంఘిక విరుద్ధమైన స్త్రీ స్వేచ్ఛను ప్రోత్సహిస్తున్నదనీ ఇబ్సెన్‌కి వ్యతిరేకంగా ఆనాటి సమాజంలో దుమారం రేగింది. ముఖ్యంగా, మధ్య తరగతి వారంతా దీన్ని తిరుగుబాటు చర్యగా పరిగణించి, ఇబ్‌సెన్ భావాల్ని బాల్యసాహిత్యంగా విమర్శించారు. ఇబ్సెన్ మర్యాదస్తుడిలా వారి విమర్శలను ఖండించకుండా ఊరుకుని, తరవాత మరికొన్ని నాటకాలను రచించి, వాటిద్వారా తన విమర్శకుల అభిప్రాయాలు ఎంత హాస్యాస్పదమైనవో, ఎంత సంకుచితమైనవో ప్రస్ఫుటం చేశాడు.

ఇబ్సెన్ ముఖ్యోద్దేశం తన నాటకాల ద్వారా విప్లవాత్మక భావాలను ప్రబోధించడం కాదు. అతడు చేసినది తన సమకాలిక సమాజంలో వున్న సమస్యల్నీ, చలామణీ అవుతున్న భావాల్నీ వెలికితెచ్చి, వాటి తీరు తెన్నుల్ని చూడమని చెప్పడమే. అంటే "ఇదిగో, ఇదీ మన సమాజ పరిస్థితి. ఇవీ మన సాంఘిక నియమాలు, ఇదుగో మన సమాజంలో ఒక స్త్రీ, ఈమె ప్రవర్తించిన తీరు ఇదీ దీనికి మీరేమంటారు ?" అని చెప్పడం మాత్రమే చేశాడు ఇబ్సెన్.

"బొమ్మరిల్లు" (ఎ డాల్స్ హౌస్) నాటకం 1879లో ప్రచురితమైంది. ఆ నాటకంలో టోర్‌వాల్డ్ హెల్‌మర్ అనే పెద్దమనిషి ఉంటాడు. మధ్యతరగతి సంసారి. బ్యాంకులో ఆఫీసరు. అతని భార్య పేరు నోరా. వారికి ముగ్గురు చిన్నపిల్లలు. ఆ చిన్న సంసారం ఎంతో సంతోషంగా ఉత్సాహంగా ఉంటూ, క్రిస్‌మస్ పండుగ సన్నాహాలు చేసుకుంటున్న సమయంలో, నిర్మలమైన వారి సంసారంలో హఠాత్తుగా కల్లోలం చెలరేగుతుంది.

అంతకు ముందొకసారి భర్తకి పెద్దజబ్బు చేసినప్పుడు పొరుగూరిలో హాస్పిటల్లో ఉంచి వైద్యం చేయించడానికి చాలా డబ్బు అవసరమవుతుంది. నోరా తండ్రిని అడుగుదామంటే, ఆయన కూడా చావుబతుకుల్లో ఉన్నాడు. ఆ వృద్ధుడికి తన భర్త జబ్బువిషయం చెప్పి మరింత బాధపెట్టడం ఇష్టంలేక, భర్తపనిచేసే బ్యాంకులోనే పని చేస్తున్న నిల్స్ క్రోగ్‌స్టాడ్ అనే చిన్న ఉద్యోగి దగ్గర భర్తకు తెలియకుండా కొంత డబ్బు అప్పు తీసుకుంటుంది. భర్త ఆరోగ్యవంతుడవుతాడు. ఇంటి ఖర్చుకోసం నెలా నెలా భర్తఇచ్చిన డబ్బులోనే ఎంతో పొదుపుచేసి క్రమ క్రమంగా అప్పుతీరుస్తూ ఉంటుంది. ఇంకా కొద్దిగా బాకీవున్న సమయంలో క్రోగ్‌స్టాడ్ అక్రమ ప్రవర్తన మూలంగా అతన్ని ఉద్యోగంనుంచి తొలగించబోతున్నట్లు చెబుతాడు కొత్తగా మేనేజర్ స్థానంలో కొచ్చిన హెల్‌మర్.

అప్పుడు క్రోగ్‌స్టాడ్ వచ్చి నోరాని అడుగుతాడు హెల్‌మర్‌తో చెప్పి తన ఉద్యోగం నిలబెట్టమని. తనభర్త చాలా "స్ట్రిక్ట్" అనీ, తన మాట వినకపోవచ్చు ననీ నోరా అంటుంది. దాంతో. క్రోగ్‌స్టాడ్ తనదగ్గర నోరా అప్పుతీసుకున్న విషయాన్నీ, అప్పు తీసుకున్నప్పుడు తనకిచ్చిన "బాండ్" మీద తనతండ్రి హామీ ఇచ్చినట్లుగా (తండ్రి అప్పటికే పోయాడని తరవాత తెలుస్తుంది) నోరాయే తండ్రి పేర సంతకం చేసిన రహస్యాన్ని హెల్‌మర్‌తో చెప్పేస్తానని బెదిరిస్తాడు.

నోరా కంగారు పడిపోయి, తన రహస్యాన్ని తన స్నేహితురాలు మిసెస్. లిండ్‌తో చెప్పుకుంటుంది. మిసెస్. లిండ్ ఒకప్పుడు క్రోగ్‌స్టాడ్‌ని ప్రేమించి పెళ్ళి చేసుకుందామనుకున్నావిడే. పరిస్థితులు కలిసిరాక, వేరొకర్ని చేసుకుని, తరవాత వైధవ్యాన్ని పొందుతుంది. ఆమెకు సహాయం చేస్తానంటాడు హెల్‌మర్. అయితే, క్రోగ్‌స్టాడ్‌ని తొలగించి, ఆ స్థానంలో మిసెస్. లిండ్‌ని నియమించాలను కుంటాడు.

నోరా బ్రతిమాలినా హెల్‌మర్ వినిపించుకోకుండా క్రోగ్‌స్టాడ్‌ని ఉద్యోగం నుంచి తొలగించినట్లు ఉత్తరువుకూడా జారీచేస్తాడు. క్రోగ్‌స్టాడ్ నోరా రహస్యాన్ని బట్టబయలు చేస్తూ ఉత్తరం రాసి హెల్‌మర్‌కి అందేలా చూస్తాడు. ఆ ఉత్తరం భర్తకి అందకుండా ఉండాలని నోరా ఎంత ప్రయత్నించినా కుదరదు. స్నేహితురాలి సహాయాన్నికూడా అర్థిస్తుంది.

రహస్యం తెలిసిపోగానే, హెల్‌మర్ కోపంతో చిందులు తొక్కుతాడు.

నోరాని నానామాటలూ అంటాడు. భర్త ఆరోగ్యం కోసం, భర్తమీది ప్రేమతో మాత్రమే అతనికి తెలియకుండా అప్పు తీసుకున్నదనీ, చావుబ్రతుకుల్లో ఉన్న తండ్రిని ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక ఆయన పెట్టవలసిన హామీ సంతకాన్ని తనే పెట్టేసిందనీ, ఇది ఏ దురుద్దేశంతోనూ చేసిన పనికాదనీ, ఎవరికీ కష్టం కలిగించకూడదని చేసిన పని మాత్రమేననీ ఎంత నచ్చజెప్పినా వినిపించుకోకుండా నోరాని నానా దుర్భాషలాడి, తనతో ఇక కాపురం చెయ్యడానికి గానీ, తన పిల్లలకి తల్లిగా వ్యవహరించడానికి గానీ తగని స్త్రీ అంటూ నిందించి, తన పరువు బయటపడకుండా ఉండటానికి మాత్రమే ఆమె తన ఇంట్లో ఉండేందుకు అనుమతినిస్తున్నట్లు "తీర్పు" చెబుతాడు.

ఈలోగా నోరా స్నేహితురాలు మిసెస్ లిండ్ నచ్చచెప్పడం మూలంగా క్రోగ్‌స్టాడ్ తనకు నోరా రాసిచ్చిన "బాండ్"ని తిరిగి పంపించేస్తాడు హెల్‌మర్‌కి. హెల్‌మర్ ఇక గండం గడిచిందనీ, తన పరువు దక్కిందనీ పరమానందపడిపోయి, నోరాని పిలిచి, జరిగినదంతా మరిచిపోయి ఇక హాయిగా ఉండొచ్చుననీ, తనన్న మాటలన్నిటినీ మరిచిపోమనీ చెబుతాడు. తనకి భార్యపై ప్రేమ లేక కాదనీ, పరువు ముఖ్యం కాబట్టి తనలా ప్రవర్తించాడనీ చెబుతాడు

నోరాకి "కనువిప్పు"కలుగుతుంది. ఇన్నాళ్ళూ ఆ ఇంట్లో తనకున్న స్థానం ఏమిటో తెలుసుకుంటుంది. కష్ట సమయంలో తనను ఆదుకుంటాడని ఆశించిన భర్త, తనను ఇన్నాళ్లూ ఎంతో ప్రేమగా చూసుకుంటున్నాడనుకున్న భర్త భార్య తప్పుని క్షమించలేనంత స్వార్థపరుడనీ, అతనికి తన పరువేతప్ప భార్యమీద కించిత్తు గౌరవం లేదనీ, ఇన్నాళ్లూ చూపినది ప్రేమ కాదనీ, కేవలం తనను ఒక ఆటబొమ్మని చేసి తన ఆనందం కోసం వాడుకున్నాడనీ, ఆ ఇల్లొక ''బొమ్మరిల్లు" అనీ అనిపించి, నోరాకి విరక్తి కలుగుతుంది. తన పిల్లలకు తల్లి అని చెప్పుకోవడానికీ, తన భర్తకి భార్య అని చెప్పుకోవడానికీ వీలులేని ఆ ఇంట్లో ఇక తనకు స్థానం లేదని నిశ్చయించుకుని వివాహ బంధాన్ని తెంచుకుని ఇంట్లోంచి వెళిపోతున్నట్లు చెబుతుంది. హెల్‌మర్ ఎంత బ్రతిమాలినా, సర్దిచెప్పినా తన నిర్ణయాన్ని మార్చుకోదు. ఇప్పటికైనా తన కాళ్ళమీద తను నిలబడటానికి, తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడానికి ప్రయత్నిస్తానంటుంది.

భర్తనీ, పిల్లల్నీ పట్టించుకోకుండా నోరా ఇల్లు విడిచి వెళ్ళిపోవడం జర్మన్

సమాజంలో, ముఖ్యంగా మధ్య తరగతి వారిలో సంచలనం కలిగించింది. అంతా "నోరా" ప్రవర్తననీ "నోరా"ని సృష్టించిన ఇబ్సెన్‌నీ తీవ్రంగా విమర్శించారు. ఒక ఇల్లాలు అలా భర్తనీ, పిల్లల్ని విడిచిపెట్టేసి వెళ్ళిపోవడం సమాజ విరుద్ధమనీ, భర్త ఎందుకైనా కోప్పడినంత మాత్రాన ఇల్లు విడిచిపెట్టడం తగదనీ, పైగా, తప్పు చేసినదానికి అంత పౌరుషం దేనికనీ, అటువంటి స్త్రీలు సభ్యసమాజానికి ప్రమాదకరమైన వారనీ, జర్మన్ దేశస్థులేకాక, ఇతర పాశ్చాత్యదేశస్థులుకూడా ఆనాడు ఎంతోమంది తీవ్రంగా విమర్శించారు.

ఇబ్సెన్ ఈ నాటకాన్ని రాసి 110 సంవత్సరాలైంది పాశ్చాత్యదేశాల్లో క్రమంగా సాంఘిక దృక్పథంలో, ప్రవర్తనలో కొంత మార్పువచ్చింది. కాని, ఈనాటికీ మన సమాజంలో ఏ స్త్రీ అయినా "నోరా"లా ప్రవర్తిస్తే, ఆ స్త్రీకూడా దాదాపు అవే విమర్శలకు గురి అవుతుంది. ఒక శతాబ్దం దాటినా, మన దేశంలో మాత్రం ఇంకా మధ్యతరగతి మనస్తత్వంలో మార్పు రానట్లే తోస్తుంది.

———

# పారిస్‌లో నా పర్యటనానుభవాలు

మళ్ళీ రామాయణం ఎందుకు రాశారంటే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు"...చేసిన సంసారమే సేయుచున్నది తనదైన యనుభూతి తనదిగాన"అని సమాధానం చెప్పినట్టుగా, అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన పారిస్‌లో నేను పొందిన అనుభవాలను, అనుభూతులను వివరిస్తున్నాను. అందరికీ తెలిసిన విశేషాలే అయినా అందులో కొన్ని వినోదాన్ని కలిగిస్తే కలిగించవచ్చు, కొన్ని కొందరికి ఉపయోగకరం కావచ్చుననే ఉద్దేశంతో.

1976 జూన్ 27వ తేదీనాడు ఇక్కడ–అంటే 'పార్హీ'లో ("ర" అనే అక్షరాన్ని ఫ్రెంచివాళ్ళు "ర్హ" అన్నట్టుగా అంగిట్లోంచి అంటారు. "పారిస్"లో సకారం నిశ్శబ్దం) మూడు గంటలకు "షార్ల్ ద్ గోల్" విమానాశ్రయంలో మధ్యాహ్నం వేళ, ప్రప్రథమంగా ఫ్రెంచి నేలమీద అడుగుపెట్టాను. విమానాశ్రయం లోపల మొట్టమొదటగా కనిపించిన "గిషే" (కౌంటరు) దగ్గరికి వెళ్ళి. న్యూఢిల్లీలోని పాలమ్ విమానాశ్రయంలో స్టేట్ బ్యాంక్ యిచ్చిన డాలర్లను ఫ్రెంచి కరెన్సీలోకి మార్చుకున్నాను. కౌంటరులోని వ్యక్తి మొదట చిరిగిపోయి, నలిగిపోయిన నోట్లను నా ముందు పడేశాడు. వేరే మంచి నోట్లను ఇమ్మన్నాను. ఫరవాలేదు తీసుకోమన్నాడు.(ఇక్కడ కొన్నాళ్లున్నాక మెల్లిగా నాకూ అలవాటైంది చిరిగిపోయిన నోట్లని ఇవ్వడమూ, పుచ్చుకోవడమూ). "సిల్‌వుప్లే" (ప్లీజ్) అన్నాను దీనంగా. మళ్ళీ నాదగ్గిర నుంచి వాటిని ఎవరూ పుచ్చుకోరేమోనన్న భయంతో కొంచెం ననిగి. "వ్వాలా" (అదుగో) అంటూ కొత్త నోట్లు ఇచ్చాడు. "మెర్హ్‌సీ" చెప్పి ముందుకి సాగాను.

మరొక గిషే దగ్గర "పాస్ పోర్ట్" చూపించి, అతను ఇచ్చిన సూచన ప్రకారం పక్కకు తిరిగి ముందుకు వెళ్ళగానే ఎదురుగా "ఎస్కలియె" కనిపించింది పాకుతున్న మహా సర్పంలా. కాలుజారుతుందేమోనని భయపడుతూనే, ముందుగా వెళ్ళినవాళ్ళని అనుసరించాను. అడుగు పెడుతూనే కెవ్వు మన్నాను. కాళ్ళవైపు చూసుకున్నాను. ఏమీకాలేదు నిజానికి. చేతిలో ఉన్న చిన్న సూట్

కేసుని భుజాన ఉన్న బరువైన సంచీని, చీరకుచ్చెళ్ళనీ సరిగ్గా సర్దుకుని కదిలే మెట్టుమీద స్థిరంగా నిలబడడానికి ప్రయత్నించాను పై మెట్టుమీద నిలబడిన చిన్న పిల్లలిద్దరు (ఫ్రెంచి వాళ్ళు) నా అవస్థచూసి నవ్వారు. "ఎస్కలియె" వదిలి మళ్ళీ గచ్చు మీద కాలు పెట్టేముందు ఆ పిల్లలు నా వైపు తిరిగి "అతాన్సియోఁ" (జాగ్రత్త) అన్నారు. గచ్చుమీద కాలు పెడుతూ మరోసారి కెవ్వుమని అరిచి పిల్లలను నవ్వించాను.

నా "వలీజ్" (పెట్టె) ఎక్కడ వుందని అక్కడ కనిపించిన ఒక అధికారిని అడిగాను. అటు ప్రక్కనే గిరగిర తిరుగుతున్న ఒక చక్రం వైపుకు చూపించాడు. నావంటి ప్రయణీకులు కొంతమంది అక్కడ నిలబడి వున్నారు. బల్ల చక్రం మెల్లిగా తిరుగుతున్నది.

ఎవరిపెట్టె కనిపించినప్పుడు వారు తీసుకుని వెళ్ళిపోతున్నారు. పది నిముషాలు నిలబడ్డాను. నా పెట్టె కనిపించలేదు. నాగుండె దడదడ కొట్టుకుంది. నేను వచ్చే లోపల ఎవరన్నా పట్టుకుపోయారేమోనని. అక్కడ పెట్టెలు తనిఖీ చేసి ఇచ్చేందుకు ఎవరూ లేరు. నాతోపాటే ప్రయాణంచేసిన ఢిల్లీ అమ్మాయి అదే సమయానికి అక్కడికి చేరుకుంది. నా భయాన్ని ఆ అమ్మాయికి వెల్లడించాను. "ఏంపరవాలేదు. నీ పెట్టెని నువ్వు తీసుకునేదాకా తిరిగి తిరిగి మళ్ళీ నీముందుకు వస్తుంది. ఇక్కడ ఇతరులు ఎవ్వరూ తీసుకుపోరు" అంది. అంతలోనే నాపెట్టె కనిపించింది.

నాకోసం ఎయిర్‌పోర్టుకి వస్తారనుకున్న వాళ్ళెవరూ రాలేదు. అన్ని అవాంతరాలకూ సంసిద్ధమయే వున్నప్పటికీ నా ఒంటరితనానికి ఒణుకుపట్టుకుంది. నాతో వచ్చిన ఢిల్లీ అమ్మాయిని కలుసుకోవడానికి ఒక ఫ్రెంచి అమ్మాయి తండ్రితో కలిసి వచ్చింది. నా అవస్థ చూసి, నన్ను తమకారులో తీసుకువెళ్ళి పారిస్‌నగరం మధ్యలో ఎక్కడైనా దింపుతామనీ, అక్కడ నుంచి నేను వెళ్ళవలసిన చోటుకి టాక్సీలో వెళ్ళవచ్చుననీ చెప్పి 'దకో?' (సరేనా) అన్నారువారు. 'దకో, మెర్సీ' అన్నాను. ఆ అమ్మాయి తండ్రి నా పెట్టెలను. ఆ అమ్మాయి పెట్టెలను ఒక తోపుడు బండిలో పెట్టి (అటువంటిబళ్ళు స్టేషన్లలోనూ-సూపర్ బజార్లలోనూ ఎక్కువగా వుంటాయి.) తోసుకుంటూ ముందుకి బయలు దేరాడు. "కస్టమ్స్"లో ఎక్కువగా ఏదీ తనిఖీ చెయ్యలేదు. నేను తెచ్చుకున్న మాగాయి

ఊరగాయని ఏదో మందు అనుకొని అనుమానించి, తీసేసుకుంటారేమోనని నా మనస్సు బిక్కు బిక్కుమంది. తనిఖీ చెయ్యకుండా ముందుకు పంపించాడు.

"అసాన్ సొ (ర్)" (లిఫ్ట్)లో క్రిందికిదిగి అక్కడ నిలిపివున్న ఆయన కారులో బయలుదేరాం. నన్ను "షాంజ్ఎలీజే" (ఢిల్లీలో కనాట్ ప్లేస్ లాంటి పేరుపొందిన షాపింగ్ సెంటర్)లో దింపారు. ఆయనే ఒక "తక్సీ" (టాక్సీ)ని పిలిచి డ్రైవరుతో మాట్లాడి. నన్ను కూర్చో పెట్టాడు. వాళ్ళకు "మెర్సీ, ఓ (ర్) వ్వా" చెప్పి బయలుదేరాను. దారిలో హఠాత్తుగా గుర్తుకొచ్చింది. నాకు–ఢిల్లీలో మా ప్రొఫెసరు ఒకావిడ ఒక ఉత్తరం ఇచ్చి. పారిస్ ఎయిర్‌పోర్టులో దిగగానే అక్కడ పోస్టు చెయ్యమని చెప్పింది. అక్కడ జరిగిన గొడవలో ఆ సంగతి మరిచిపోయాను.

టాక్సీ అతన్ని ఒక పోస్టు బాక్సు దగ్గర ఒక్క క్షణం ఆపమని అడిగాను. సరేనంటూ ఒకచోట టాక్సీ ఆపి "వ్వాలా" అన్నాడు. ఉత్తరం తీసుకుని టాక్సీదిగి ఫుట్‌పాత్ దాటి ఇటూ అటూ చూశాను. పోస్టుబాక్సులాంటిది ఎక్కడా నాకు కనిపించలేదు. అనుమానం వేసింది. "అయ్యో ఎందుకు దిగానా. ఇప్పుడు ఆ టాక్సీవాడు నా పెట్టెలు తీసుకుని తుర్రుమంటే. నాగతేంకాను, టాక్సీ నంబరు కూడా నోట్ చేసుకోలేదుఅని క్షణం నా మనసు విలవిల్లాడింది. వెనక్కి తిరిగి చూశాను. టాక్సీ అతను చక్రంమీద చేతులు పెట్టుకుని వున్నాడు. బాబోయ్ బయలుదేరి వెళ్ళిపోతున్నాడేమోనని భయం. అడుగుముందుకుగాని, వెనక్కుగాని వెయ్యలేక వెర్రిగా చూశా నతనివైపు "వ్వాలా" అన్నాడు. మళ్ళీ ఒకవైపుకి చూపించి. అక్కడ నోరుతెరుచుకొనిఉన్న గుండ్రని పెట్టెలాంటిది కనిపించగానే అందులో ఠక్కున పడేశాను ఉత్తరం.

అటు పక్కగా ఉన్న "కఫే" బార్ ముందు కుర్చీలో కూర్చున్న ఆడ వాళ్ళిద్దరు నన్ను చూసి కెవ్వుమని అరిచి నవ్వడం మొదలుపెట్టారు. ఏం చేశానా అని అనుమానంవేసి టాక్సీ డ్రైవరుకేసి చూశాను. చివరికి అతను టాక్సీ దిగి నా వైపుకి రావడానికి బయలుదేరాడు. అతను టాక్సీ దిగిన తరవాత నా మనస్సు స్తిమితపడి, బుర్ర సరిగ్గా పని చెయ్యడం మొదలుపెట్టింది. నేను ఉత్తరం పడేసిన పెట్టెమూత వెడల్పుగా వుండడంవల్ల (అది చెత్తకాగితాలపెట్టె) వేళ్ళుపెట్టి ఉత్తరాన్ని పైకిలాగేసి, మళ్ళీ ఇటూ అటూ చూస్తే "పోస్త్" అని రాసివున్న రేక

పసుపు పచ్చరంగుది చిన్న పెట్టె ఒకటి కనిపించింది. అందులో వేశాను చివరికి. అక్కడ వున్న ఆడవాళ్ళూ, టాక్సీ అతనూ ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. వాళ్ళకేం తెలుసు మన దేశంలో పోస్టు బాక్సు ఎర్ర రంగులో ఉంటుందని ?

మళ్ళీ బయలుదేరి చివరికి "సితే అంతర్నాసియనాల్" ముందు ఆపాడు. అతను అడిగిన 22 ఫ్రాం(కు)లు చెల్లించి సామాను తీసుకుని పారిస్ యూనివర్శిటీ ఇంటర్ నేషనల్ హాస్టలు ఆవరణలో అడుగు పెట్టాను. విమాన ప్రయాణ నిబంధనల ప్రకారం పట్టుకొచ్చిన 20 కిలోల బరువున్న పెద్ద పెట్టెకాక (ఉన్న మంచి పట్టుచీరలన్నీ పట్టుకొచ్చాను వదల్లేక) అయిదు కిలోల బరువున్న చిన్న సూట్‌కేసూ, చేతి సంచీ (మామూలు హాండ్‌బేగ్ కాక)- ఇవన్నీ మోసుకుంటూ బయలుదేరాను. ఎండ మండిపోతున్నది.

1976లో యూరప్‌లో ఎండలు ఎన్నడూ లేనంత ఎక్కువగా ఉన్నాయి. అదొక విపరీత పరిస్థితి. కొంతమంది విద్యార్థులూ, విద్యార్థినులూ దాదాపు ఒంటి మీద బట్టలు లేకుండా చెట్లనీడన పడుకుని విశ్రాంతి తీసుకుంటున్నారు. దారిలో కనిపించిన ఒక రిద్దరిని "మెయిజోన్ద్ లాంద్" (ఇండియా భవనం), ఎక్కడ వున్నదని అడిగి, వాళ్ళు చెప్పిన ప్రకారం ముందుకు వెళ్ళాలని ప్రయత్నించాను కాని కాళ్ళు ముందుకు సాగలేదు. పైన తలతిరిగి పోయే ఎండ, చేతులు పుళ్ళు పడిపోయేటంత సామాను. కళ్ళనీళ్ళు తిరిగాయి నా అవస్థకు. ఇంతలో అదృష్ట వశాత్తు ఒక అరబ్ యువకుడు అటువస్తూ నన్ను చూసి, జాలిపడి నా పెద్ద పెట్టె అందుకుని నన్ను కూడా తీసుకువెళ్ళాడు.

నేను ఎరుగున్న పెద్ద మనిషి ఊళ్ళోలేడు. మరొకతనికోసం ఢిల్లీనుంచి ఎవరో ఇచ్చిన పాకెట్ ఒకటి పట్టుకువచ్చాను. ఆ వంకతో అతని దగ్గరకు వెళ్ళాను మరొక దేశపు భవనానికి అతనితో అతని భార్య కూడా వుంది. వాళ్ళిద్దరూ నన్ను ఆదరంగా ఆహ్వానించారు. దాహంతో నోరు ఆరిపోయివుంది. మంచినీళ్ళున్నాయా అని ఆవిడను అనుమానంగా అడిగాను. ఫ్రాన్సులో అందరూ వైన్‌గాని, బీరుగాని తాగుతారనీ, మంచినీళ్ళకు బదులు సోడా నీళ్ళలాంటివి తాగుతారనీ విన్నాను. ఆవిడ వాష్ బేసిన్‌లో వున్న కుళాయిలోంచి నీళ్ళు పట్టి గ్లాసు చేతికందించేసరికి ప్రాణం లేచివచ్చినట్టయింది. వరుసగా అయిదారు గ్లాసుల నీళ్ళు తాగేశాను మళ్ళీ దొరుకుతాయో లేదో నన్నట్టుగా. అతనే ఎలాగో తంటాలుపడి

ఇండియా భవనంలో నాకు గది ఇప్పించాడు తాత్కాలికంగా. ఫ్రెంచి ప్రభుత్వం స్కాలర్‌షిప్ ఇచ్చి ఫలానా రోజుకు రమ్మని ఆహ్వానిస్తుంది తప్ప, రాగానే అక్కడ వసతి సౌకర్యాలు చూపించే దిక్కుండదు. తెలిసివున్న వాళ్ళెవరన్నా ఇక్కడ వుంటేతప్ప ట్రెయినింగ్‌కు, చదువులకు వచ్చేవాళ్ళు పడేపాట్లు వర్ణనాతీతం.

గదిదొరకగానే ప్రాణంతేలిక అయింది. ఆరవ అంతస్థులో మారుమూల గదిలోకి వెళ్ళగానే హాయిగా ఫ్యాను వేసుకుని కాస్సేపు పడుకుందామనుకుని ఇటూ ఆటూ చూశాను. గదిలో ఎక్కడా ఫ్యానులేదు. గాలిలేదు. బయట ఎండ మండిపోతోంది. గదిలో ఊపిరి సలపలేదు, (ఫ్రాన్సులో ఎక్కడా ఫ్యానుల సదుపాయం వుండదు. వాళ్ళకు ఎప్పుడూ ఎండలు ఎక్కువగా వుండవు కాబట్టి చలికాలంలో వెచ్చగా వుండడానికి మాత్రం "షోఫాజ్‌సంత్రాల్" (సెంట్రలు హీటింగ్ వుంటుంది.) అదేమీ తెలియక "ఇదెక్కడి భూతలస్వర్గంరా బాబూ!" అనుకున్నాను.

సాయంకాలం అయిదు దాటింది. ఎండ తీవ్రత ఢిల్లీలోలాగే వుంది కాని రాత్రి పది దాటినా సూర్యుని వెలుగు వుంది. మెల్లిగా అప్పుడు చీకటి పడడం మొదలైంది. ఈ వింత చూడడానికి ఎంతో ఆశ్చర్యంవేసింది. మొదట్లో గడియారం సరిగ్గా పనిచెయ్యడం లేదనుకున్నాను. 'అ కనిపించేది సూర్యుడా చంద్రుడా?'అని అడిగిన సర్దార్జీ కథ గుర్తుకొచ్చింది. పాపం, ఆతనలా అడిగివుండడంలో తప్పు లేదు. ఇలాంటిచోటే అడిగివుంటాడు అనుకున్నాను. ఉదయం యథాప్రకారం ఆరుగంటలకు బాగా వెలుగువచ్చింది. మెల్లిమెల్లిగా పారిస్ జీవన విధానానికి అలవాటు పడ్డాను.

ఇక్కడ ప్రయాణం చెయ్యాలంటే "మెత్రో"లో గాని (అండర్‌గ్రౌండ్‌రైల్వే) బస్సులోగానివెళ్లాలి. ఇక్కడ చాలా రోజులువుండేవాళ్ళు ప్రయాణం చవుకగా చెయ్యాలంటే కొన్ని పద్ధతులువున్నాయి. నెలకు ఒకసారి ఫస్టు తారీకున ఆరెంజ్ టిక్కెట్టు కొనుక్కుంటే నెల పొడుగునా పారిస్‌లో ఎక్కడికైనా మెత్రోలోగాని బస్సులోగాని వెళ్ళవచ్చు. ఖరీదు 45 ఫ్రాం(కు)లు. మొదటిసారి కొన్నప్పుడు ఒక పెద్దకార్డుమీద మన ఫొటో అతికించియిస్తారు. దానిలో చిన్న టిక్కెట్టు పెట్టుకోవాలి, ప్రతి నెలా ఒక టిక్కెట్టుకొని అ"కార్త్‌ఒరాంజ్"లో పెట్టుకుని ప్రయా

ఛాలకు వాడుకోవాలి. మెట్రో స్టేషనులో ఉండే ఆటోమాటిక్ మెషినులో ఒకవైపు కన్నంలోంచి టిక్కెట్టుదూర్చితే ఎదురుగా ఉన్న మరోకన్నంలోంచి బయటికి వస్తుంది. అది తీసుకున్న తరువాత ఇనుపకడ్డీ తెరుచుకుంటుంది. ఇప్పుడు అవతలి వైపుకివెళ్ళి మెట్రోలో కూర్చోవడానికి దారిదొరుకుతుంది. ఆరెంజ్ కార్డులేనివాళ్ళు ఎప్పటికప్పుడు పదిచొప్పున పసుపుపచ్చరంగు టిక్కెట్లు కొనుక్కోవచ్చు. వీటిని ఒకసారివాడి మెట్రో స్టేషనుదాటి బయటికివచ్చిన తరువాత మళ్ళీ వాడడానికి వీలులేదు.

బస్సులో అయితే ఎక్కువగా ఈ పచ్చటిక్కెట్టును చిన్న మెషినులో పెట్టి స్టాంపుపడినతరువాత మళ్ళీ తీసుకొని బస్సుదిగేవరకూ దాచుకోవాలి. ఈ బస్సులలో కండక్టరుఉండడు. బస్సుడ్రైవరే టిక్కెట్లుఇస్తాడు. అవసరమైనవాళ్ళకు, బస్సు ద్వారాలు రెండూ వాటంతటవే తెరుచుకొని మూసుకుంటాయి (బస్సు ఆగడం, బయలుదేరడంతో). ఆఫీసులకు వెళ్ళివచ్చే వేళలు కానప్పుడు ఏదైనా స్టాపులో దిగాలంటే బస్సులో సన్నని ఇనుపస్తంభానికిఉన్న బెల్ నొక్కాలి. అప్పుడు బస్సు ఆగుతుంది.

బస్సుగాని మెట్రోగాని ఒకటి రెండు నిముషాలకంటె ఆగదు. మెట్రోలో ఎక్కేటప్పుడు, దిగేముందూ స్వయంగా తలుపుతెరుచుకోవాలి. కాని మెట్రో బయలుదేరే సమయంలో తలుపులు వాటంతటఅవే దఢాలున మూసుకుపోతాయి.. చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. ప్రతి అయిదు నిమిషాలకు ఒక మెట్రోవస్తుంది. సాధారణంగా పారిస్‌లో ఎక్కడికివెళ్ళాలన్నా చాలా సులభం. కాని, మెట్రోప్లాను మాత్రం క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి. కొత్తలో చాలా గందరగోళంగావుంటుంది. మెట్రో స్టేషనుమార్గం ప్రతి ముఖ్యమైన వీధిప్రక్కనా వుంటుంది. అక్కడ మెట్లు దిగి వెడితే మెట్రో స్టేషను కనిపిస్తుంది. మెట్రోలు మారడానికి లోపల గుహల లోంచి నడుచుకుంటూ వెళ్ళి మెట్లు ఎక్కుతూదిగుతూ అప్పుడప్పుడు ఎస్కలిటేల మీద వెడుతూ మనం వెళ్ళవలసినదిక్కుకు వెళ్ళాలి. స్టేషన్లు, మెట్రోలు, బస్సులు చాలా పరిశుభ్రంగావుంటాయి. స్టేషన్లలో కూర్చోడానికి సీట్లు వుంటాయి. ప్రతి స్టేషనులో దుకాణాలుకూడావుంటాయి. వాటిలో పుస్తకాలు, బొమ్మలు, పువ్వులు మొదలైనవి అమ్ముతారు.

ఇక్కడ ప్రతి దుకాణంలోనూ- పెద్దదిగాని, చిన్నదిగాని- ప్రతి వస్తువు

మీద ధర రాసి వుంటుంది. బేరాలు లేవు. అప్పుడప్పుడు వాళ్ళే ధరలు తగ్గించి "సోల్డ్" (సేల్) అని బోర్డు పెడతారు. నగరం నిండా ఎన్నో "సూపర్‌మార్షేలు" ఉన్నాయి ఇక్కడ వస్తువులు తక్కిన దుకాణాలలో కంటే కొద్దిగా చవక. ఇవి కాక "యూనిప్రి", "ప్రిజూని", "మోనోప్రి" అనే పెద్ద పెద్ద సూపర్‌మార్కెట్లు కొన్ని వుంటాయి వాటిలో అన్నిరకాల వస్తువులూ కొంత చవకగా దొరుకుతాయి. ఇక్కడ చాలా పేరుపొందిన సూపర్‌మార్కెట్లలో 'గేలరీ', 'పాయత్', 'ప్రాంతాఁ', 'సమారితేన్' ముఖ్యమైనవి. నిత్యావసరమయ్యే భోజనపదార్థాలు కొనుక్కోవడానికి ప్రజలు "సూపర్‌మార్షే" అని రాసివున్న చిన్నచిన్న సూపర్ మార్కెట్లకు వెడతారు.

"క్యూ" పద్ధతి ఫ్రెంచి నిత్యజీవిత విధానంలో ఒక భాగం. ప్రతి ఆఫీసు కౌంటరు దగ్గర, ప్రతి దుకాణంలోను (కూరలమ్మే దుకాణంలో కూడా) జనం క్యూలో నిలబడతారు. ఒకరిద్దరు అయినా సరే ఒక వరసలో నిలబడతారు. అలా క్యూలో నిలబడనివాళ్ళను దుకాణదారులు కూడా లెక్కచెయ్యరు. యూనివర్సిటీ "రెస్తొరాఁ"లో కూడా విద్యార్థులు వరుసలో వెళ్ళి ఒక్కొక్క ట్రే తీసుకుని అందులో కత్తి, ఫోర్కు, గ్లాసు వరుసగా పెట్టుకుంటూ ముందుకు నడిచి అక్కడ ప్లేట్లలో పెట్టిన వస్తువులను ఒక్కొక్కటే తీసుకుని ఒకచోట కూర్చుని తిన్నాక మళ్ళీ వరుసగా వెళ్ళి ఒక్కొక్కటే తిరిగి ఇచ్చేసి వెళ్ళాలి.

యూనివర్సిటీ రెస్తొరాఁలో భోజనం ఖరీదు 3-30 ఫ్రాఁ(కు)లు. ముప్ఫయి అయిదు సంవత్సరాల వయస్సు దాటిన విద్యార్థికి మాత్రం 6.60 ఫ్రాఁ(కు)లు. వాళ్ళిచ్చేపదార్థాలు రుచిగా వుండకపోయినా (సాధారణంగా ఉప్పుకూడా లేకుండా అన్నీ చప్పగా అదొకరకం వాసనతో వుంటాయి) అన్నీ పోషకపదార్థాలే ఇస్తారు. ఆరోగ్యానికి మంచివి. అనేక వస్తువులు అన్నీ ఒకసారి బయట కఫేలలో తింటే 15 ఫ్రాఁ(కు)లు దాకా అవుతుంది. ఇంట్లో చేసుకుంటే అంత ఖరీదు అవదు కాని కూరలు, పళ్ళూ చాలా ఖరీదు అవుతాయి.

ఇక్కడ సాధారణంగా అందరు వాడే బ్రెడ్ మనవేపులా దిమ్మలాగ ముక్కలు చేసి వుండదు. పొడుగ్గా దుడ్డు కర్రలా వుంటుంది. దీన్ని "బగెత్" అంటారు. పైకి గరుకుగా వుండి లోపల మెత్తగా వుంటుంది. ఒక్కరోజు కంటె తాజాగా వుండదు. అందరూ ఏరోజు కారోజు కొనుక్కొని తింటారు. మనవైపు

దొరికే బ్రెడ్ దీనికి రెట్టింపు ధర. ఈ బగెట్‌కి అలవాటు పడటానికి కొన్నాళ్ళు పడుతుంది. నములుతుంటే దవడలు నొప్పులు పుట్టడమే కాక నోరు లోపలి భాగం చెక్కుకుపోయి నోరంతా పుండు పడినట్టవుతుంది

ఇక్కడ బియ్యం మంచివి దొరుకుతాయి. అట్టప్యాకెట్లలో కిలోగ్రాము చొప్పున అమ్ముతారు. అమెరికా నుంచి వచ్చినవి, మెడగాస్కర్ నుంచి వచ్చినవి, వియత్నామ్ నుంచి వచ్చినవి రకరకాలు దొరుకుతాయి. కిలోగ్రాము బియ్యం ధర 4-5 ఫ్రాం(కు)ల మధ్య వుంటుంది. "వండితే అంటుకోవు" అని ప్రతి పాకెట్ మీద రాసి వుంటుంది ఇక్కడి వాళ్ళకు మెతుకు మెత్తపడి అంటుకుంటే నచ్చదు.

ఇక్కడ గోధుమ రవ్వ చాల మంచిది దొరుకుతుంది. ఎక్కడా చెత్తగాని ఇసుక గాని వుండదు బంగాళదుంపలు, ఉల్లిపాయలు, గజనిమ్మకాయలు (కోలగా వుండేవి) మొదలైనవన్నీ కిలోగ్రాముల చొప్పున ప్లాస్టిక్ అల్లిక సంచులలో కట్టి సూపర్‌మార్కెట్లలో అమ్ముతారు. విడిగా కావాలంటే కూరల దుకాణాలలో కొనుక్కోవాలి. సీమ మిరపకాయలు దొరుకుతాయి. మామూలు పచ్చిమిరపకాయలు ఒక్కొక్కటి ఒక ఫ్రాం-అంటే మన కరెన్సీ ప్రకారం రెండు రూపాయలు. వంకాయలు మంచివి దొరుకుతాయి. గుమ్మడికాయ కూడా దొరుకుతుంది. అల్లం, ఎండిపోయిన చింతపండు మొదలైనవి వియత్నామ్ దుకాణాలలో దొరుకుతాయి. (ఎలక్ట్రిక్ రైస్ కుక్కర్లు కూడా వియత్నామ్ షాపులలో దొరుకుతాయి). ధరలు మాత్రం ఆకాశాన్ని అంటేలా వుంటాయి. సూపర్ మార్కెట్లలో పప్పులు దొరుకుతాయి కాని మనవాటిలా వుండవు. వేరే రంగులలో అన్నీ కొత్తగా కనిపిస్తాయి. (తెల్ల సెనగలు) దొరుకుతాయి. కిస్‌మెస్‌పళ్లు, బాదం పప్పు కొంచెం చవకగా దొరుకుతాయి.

ఇక్కడ స్థిర నివాసం ఏర్పరచుకున్న భారతీయులకు కావలసిన సామగ్రి చాలావరకు దొరుకుతుంది. కాని, చీరలు మాత్రం దొరకవు. నైలాను చీరలు అమెరికాలోను, ఇంగ్లండులోను దొరికినట్టుగా ఇక్కడ దొరకవు. ఫ్రెంచి షిపాను చాల ప్రతీతి కాని, దానంత పలుచని వస్త్రం మరొకటి వుండదు. ధర చూస్తే కొనాలనే కోరిక చల్లబడిపోతుంది అందుచేత చీరలు కావలసినవాళ్ళు లండన్ వెళ్ళడం మంచిది.

నైలాను అండర్‌వేర్లు, పోలోనెక్ నైలాను స్వెట్టర్లూ ("సూ-పుల్" అంటారు. ఇవి సాధారణంగా కొరియానుంచివస్తాయి), పోలోనెక్ ఊలుస్వెట్టర్లూ (ఇటాలియన్‌వి) కొంచెం చవకగా దొరుకుతాయి.

సెంటు సీసాల సంగతి సరేసరి. ఎన్నో రకాలు చూడగానే మురిపిస్తుంటాయి. కాని ఖరీదు చూస్తే కొనడానికి చేతులు ముందుకురావు.

లెదర్ హాండ్ బ్యాగ్‌లు, లెదర్ బూట్లు కూడా చాలా ఖరీదు. ఇక్కడకంటె అన్నీ లండన్‌లో చవక.

ఫ్రాన్సు గురించి ఎంత నేర్చుకున్నా, ఫ్రెంచివారి సంస్కృతి, జీవితవిధానం తెలుసుకోవాలంటే ఈ దేశానికివచ్చి వాళ్ళతోకలిసి కొన్నాళ్ళుంటే అర్థమవుతుంది. ఫ్రెంచి భాష నేర్చుకుని వచ్చినప్పటికి ఇంకా ఇక్కడ వాడేమాటలు ఎన్నో కొత్తగా వుంటాయి. ఉదాహరణకు-

ఓలలా! ఫ్రెంచి వాళ్ళు "ఓలలా" అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తారు. ఇంగ్లీషులో "మైగాడ్" అనీ "ఓ గాడ్" అని, "ఓనో" రకరకాలుగా వ్యక్తం చెయ్యవచ్చు. కానీ ఫ్రెంచివాళ్ళ ఊతపదం "ఓలలా". ఫ్రెంచిలో ఆశ్చర్యం వ్యక్తం చెయ్యడానికి అంతకంటె మరొక మార్గం లేదు.

అబొఁ! సంభాషణలో తరచుగా వినవచ్చే శబ్దాలలో "అబొఁ!" ఒకటి. మన తెలుగులో "ఓహో", "అలాగా" అని హిందీలో "అచ్చా", అని అన్నట్టుగా ప్రతి సందర్భంలోను "అబొఁ" అంటారు వీరు.

బొఁ దకో: సరే మంచిది. సరే అర్థమైంది. సరే-అని రకరకాలుగా అంగీకారం సూచించడానికి "బో" అనీ, "బొఁ దకో" అని అంటూవుంటారు.

సవా: మనం ఏవన్నా ఎదుటివాళ్ళకి చెప్పిన తరువాత "సరేనా?" అని అడగడానికి "సవా?" అంటారు. అప్పుడు ఇష్టమయితే "దకో" అని సమాధానం వస్తుంది. ఒక్కొక్కప్పుడు ఎవరన్నా తెలిసినవాళ్ళు కనిపిస్తే "సవా" అని అడుగుతుంటారు. బాగున్నావా అని అర్థం. "బోంఝూర్, సవా" అనికూడా పలకరిస్తుంటారు.

ఝవుజంప్రి:- ఎవరైనా "మెర్సీ" (థాంక్స్) చెప్పినప్పుడు ఇంగ్లీషులో "వెల్‌కమ్" అన్నట్లుగా ఇక్కడ "ఝవుజంప్రి" అంటారు.

అ(షాంతే:- ఎవరినయినా కొత్తగా పరిచయం చేసినప్పుడు చేయి కలుపుతూ "అ(షాంతే" అంటారు ఇంగ్లీషులో. "ఎన్‌చాంటెడ్" అన్న మాట. సిహెచ్ అనే ఇంగ్లీషు అక్షరాలను 'ష' అని పలుకుతారు. "వై" అనే ఇంగ్లీషు అక్షరాన్ని "య్య" అని ఒత్తి పలుకుతారు

అందుకనే నా పేరును అందరూ "షయ్యాదవి" అని పలుకుతారిక్కడ. ("ఇ" రాసి పైన చిన్న గీత పెడితే తప్ప "ఎ" అనే శబ్దంరాదు. (ఇటలీ వెళ్ళినప్పుడు అక్కడ నేను "ఖయ్యాదేవి"ని అయాను. అక్కడ సిహెచ్‌ని 'ఖ' అని పలుకుతారు.

ప్రతి వ్యవహారసందర్భంలోను ఇంటి పేరు, సొంత పేరు అడుగుతారు. నా ఇంటిపేరు చూసి నన్ను 'అబ్బూర్హి' అని పిలవడం మొదలుపెట్టారు. వద్దు మొర్రో, మా ఊళ్లో నన్నందరూ నా పేరుతో పిలుస్తారని, నేను అలాగే సంతకం పెడతానని చెప్పినప్పటికీ వినిపించుకోరు. నన్ను "మదామ్ అబ్బూర్హి" అంటారు.

ఇక్కడ తోట తరణి అనే తెలుగు ఆర్టిస్టు చదువుకుంటున్నాడు. అతడిని అందరూ "తోతా" అని పిలుస్తారు.

ఇక్కడ వాళ్ళకి ఒక వింత అలవాటుంది. ఆప్తులు కనిపించినప్పుడు, విడిపోతున్నప్పుడూ భుజాలు పట్టుకొని ముఖానికి ఈ చెంప మీదా ఆ చెంపమీదా ఒకరినొకరు ముద్దుపెట్టుకుంటారు. ఒక రోజున ఏమి జరిగిందంటే- చాలా రోజులు మాతో కలిసి తిరిగిన ఒక ఫ్రెంచి అమ్మాయి వాళ్ళ ఊరు వెళ్ళిపోతున్నది. వెడుతూ వెడుతూ నాదగ్గరికి వచ్చింది చెప్పి వెళ్ళడానికి. నేను కుర్చీలో కూర్చుని ఉన్నాను. ఆ అమ్మాయి హఠాత్తుగా నామీదకి వొంగుతుంటే నేను అమాంతం ఆత్మరక్షణ చేసుకున్నట్లుగా చెయ్యి అడ్డం పెట్టాను. ఆ అమ్మాయి అసలే భారీ మనిషి. ఆగకుండా నా చెంపలను ముద్దుపెట్టుకుని, పాలిపోయిన ముఖంతో నా కేసి చూసి "మీకిలాంటి అలవాటు లేదా?" అని అడిగింది. నేను కూడా ఆమె చెంపలను అదే సమయాన ముద్దుపెట్టుకోకుండా ఒళ్లు చల్లబడిపోయి కొయ్యబారిపోయినట్టుగా కూర్చునేసరికి ఆ అమ్మాయికి అనుమానం వేసి వుంటుంది. నేను సిగ్గుపడి నవ్వి, "అవును మాకు ఇలాంటి ముద్దులు అలవాటు లేవు" అన్నాను. "అబో(!" అంది. "భార్యాభర్తలు", ప్రేయసీ ప్రియులుకూడా పబ్లిక్‌గా ముద్దుపెట్టుకోరు అన్నాను. "ఓలలా?" అంది నోరంతా తెరిచి.

శాకాహారభోజనం, మన చీర కట్టూ, బొట్టూ అన్నీ వీళ్ళకి ఆశ్చర్యకరం

గానే వుంటాయి. ఇక్కడ మత్స్యమాంసాలే ముఖ్య భోజనపదార్థాలు. అందుచేత నేను "మాంసం తినను" అని చెప్పగానే "చేపలు కూడా తినవా?" "కోడి గుడ్లు కూడా తినవా?" "కుక్క గొడుగులు కూడా తినవూ?" "మరేం తింటావు?" అంటూ జాలిపడి వెనిగర్ వేసిన "సలాద్" మరొక ప్లేటు ఇవ్వడమో, స్వీటుగాని పండుగాని ఇవ్వడమో చేస్తారు రెస్టోరాంలో. వీటితోపాటు ఒక్కొక్కసారి ఉడక బెట్టిన బంగాళదుంపముక్కలు, ఒకసారి బంగాల దుంపలముద్ద. ఉడకపెట్టిన మైదా జంతికల్లాంటివి, ఒక్కొక్కసారి అన్నంపొడి మెతుకులూ ఇస్తుంటారు. రొట్టె ముక్కలు (బగెత్ చక్రాల్లా కోసినవి) కావలసినన్ని ఇస్తారు. బల్లమీద ఉప్పు సీసా, ఆవముద్ద సీసావుంటాయి. చాలామంది కొన్నిపదార్థాల్లో ఆవ కలుపుకుంటూ వుంటారు.

హాస్టల్లో వుండేవాళ్ళకి స్వయంగా వంటచేసుకునే సదుపాయాలు కూడా వుంటాయి ప్రతి అంతస్తులోనూ ఒక గది వుంటుంది. దానిలో ఎలక్ట్రిక్ హీటర్లు వుంటాయి కావాలంటే చిన్న చిన్న గ్యాస్‌స్టవ్‌లు చవకగా కొనుక్కోవచ్చు. గ్యాస్ విరివిగా, చాలా చవకగా దొరుకుంది. వంటకి వేరుసెనగ నూనె ఎక్కువగా దొరుకుతుంది. వాసన వుండదు. రుచికి చాలా బాగుంటుంది. హల్వాలాంటి స్వీట్లకు కూడా వాడుకోవచ్చు. ఆదివారంనాడు సాధారణంగా యూనివర్సిటీ రెస్టోలు మూసేస్తారు కాబట్టి, అందరికీ ఆరోజు స్వయంపాకమే. అదే అందరికీ పండుగలా వుంటుంది. నలుగురైదుగురు స్నేహితులు కలసి రకరకాల వంటలు చేసుకుని తింటూవుంటారు. చాలా సరదాగా గడుస్తుంది. ఇక్కడకు వచ్చాక వంట నేర్చుకోనని. వంటచెయ్యని విద్యార్థి వుండడు. "మా అమ్మ ఇలా చేస్తూ వుండేది", "మా ఇంట్లో ఇలా చేసేవారు" అంటూ ప్రయోగాలుచేసి బ్రహ్మాండంగా కుదిరిరాయనుకుంటూ తింటారు. మధ్యమధ్య ఫ్రెంచి వాళ్ళని కూడా పిలిచి ఇతర దేశాల వంటలు రుచిచూపిస్తారు ఒకసారి మన ఉప్మా, బోండాలు, సొజ్జప్పాలు, నిమ్మకాయ పులిహోరచేసి పెడితే "త్రెబోఁ" (చాలా బాగుంది) అంటూతిన్నారు.

మన కట్టూ బొట్టూ ఫ్రెంచి వాళ్ళకు చాలా ఇష్టం ముసలివాళ్ళ నుంచి పడుచు వాళ్ళ దాకా అందరూ చీర, కుంకుమ బొట్టును తెగ మెచ్చుకుంటారు. విదేశీయులను అనుసరిస్తూ ప్యాంట్లు చొక్కాలు వేసుకుని తిరిగే స్త్రీలకన్న మన ఆచారం ప్రకారం దుస్తులు ధరించే స్త్రీలంటే వీళ్ళకు అమిత గౌరవం. అందరూ నన్ను ఇక్కడికి వచ్చే ముందు, వచ్చిన కొత్తలోనూ భయపెట్టారు. చీరతో

చలికాలంలో కాలక్షేపం చెయ్యడం కష్టం. మెట్రోలోను, ఎస్కలియేల మీద తిరగడం దుర్లభం అన్నారు. కాని చీర కట్టుకోకుండా మానవలసిన అవసరం నాకు కనిపించలేదు.

కుంకుమ బొట్టు గురించి ఎంతో మంది ఎన్నో రకాలుగా కుతూహలం కనపరచారు. "అది ఏమిటి?" "ఎందుకు పెట్టుకుంటారు?" "ఎలా పెట్టుకుంటారు? "పచ్చబొట్టులాగ ఎప్పటికీ అలాగే వుండిపోతుందా? దేనితో తయారు చేస్తారు? పెట్టుకోకపోతే ఏమవుతుంది?" "ఇంకో రంగు పెట్టుకోకూడదా?" "నుదుటిమీదే ఎందుకు పెట్టుకోవాలి? "ఇది శివుడి మూడవ కన్నుకి ప్రతిరూపమా?" అంటూ మేము ఊహించలేనన్ని ప్రశ్నలు వేశారు. పిల్లలు ఎర్ర బొట్టుకేసి చూస్తూ వుంటారు విపరీతమయిన కుతూహలంతో. ఒకటి, రెండుసార్లు మొగపిల్లలు దూరం నుంచి నన్ను చూసి నా నుదుటికేసి తుపాకితో గురిపెట్టినట్టు చూపుడు వేలుతో చూపించి పక్కనున్న పిల్లలతో, తల్లి తండ్రులతోను గుసగుసలాడడం చూశాను.

"ఇక్కడి మన కట్టూ బొట్టూ విషయమే కాదు – మనదేశం గురించి ఇక్కడి వాళ్ళకు అట్టే తెలియదు. వీళ్ళ పేపర్లలో మనదేశం వార్తలు ఎప్పుడో గాని పడవు అవి కూడా మనకు విరుద్ధంగానే వుంటాయి. వీటైనంతవరకు మన సంస్కృతి గురించి విస్తారంగా తెలిపే మార్గాలేమీ లేవిక్కడ. రవిశంకర్ పేరు అందరికీ తెలుసు. ఇంకెవరి గురించి, ఏ కళ గురించీ తెలియదు. ఇందిరా గాంధి మహాత్మగాంధి కూతురని చాలామంది అభిప్రాయం. "కాదా?" అని ఆశ్చర్యంగా అడిగారు కొందరు. మనం ఏ దేశస్తులమని అడిగినప్పుడు "ఆందియెన్" (ఇండియన్) అని చెప్పగానే "కాలిఫోర్ని" (కాలిఫోర్నియా) నుంచా అని అడిగారు కొందరు! అంటే "రెడ్ ఇండియన్స్" అని అనుకున్నారు, అందుకే వీళ్ళు మనలను "ఆందూ" హిందూ) అంటారు సాధారణంగా–స్పష్టంచెయ్యడానికి. మనలో మనం ఇంకా ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటామని, మన "దేశ భాష"లో మాట్లాడుకోమని వీళ్ళకి చాల ఆశ్చర్యంగా వుంటుంది.

మనకు విదేశ వస్తువులంటే వెర్రిమోజు, కాని వీళ్ళే మనలను చూసి మెచ్చుకునేవి ఎన్నో వున్నాయి. ఇక్కడ ఎన్ని వింతలు చూసినా, ఎన్ని వస్తువులు కొనుక్కుందామని అనిపించినా మళ్ళీ మన దేశాన్ని, మన సంప్రదాయాన్ని మరచిపోలేం. మన దేశ సంస్కృతి తరతరాలుగా స్థిరంగా నిలవగలిగే శక్తి మన స్త్రీలలోనే వుంది.

ఆంధ్రజ్యోతి ఫిబ్రవరి 13, 20, 1977

# కోపరూపాలు!

"నీకు కోపం వస్తే ఎంత అందంగా ఉంటావో తెలుసా!" అంటాడు మగవాడు ఆడదానితో—సాధారణంగా పెళ్ళికాకముందు. పెళ్ళయాక, భార్య కోపంతో రెచ్చిపోతుంటే "ఏం, కోపంతో చాలా అందంగా ఉంటాననుకుంటు న్నావా! వెళ్ళి ఒకసారి అద్దంలో ముఖం చూసుకో" అంటాడు భర్త.

"నాకు కోపంవస్తే మనిషినికాను, జాగ్రత్త!" అంటారు మగవాళ్ళు కొందరు కోపంతో. నిప్పుతొక్కిన కోతిలా గెంతులేస్తారు కొందరు. తోకతొక్కిన తాచులా బుస్సుమంటారు కొందరు. కొందరు ఆవేశపడ్డా అరుస్తారు. కొందరు చేతిలో ఏముంటే దాన్ని విసిరేస్తారు. కొందరు ఎదుటివారిని ఏమీ చెయ్యలేక నెత్తి మొత్తుకుంటారు. లేకపోతే, లెంపలు వాయించుకుంటారు.

పురాణాల్లో దేవుళ్ళు, దేవతలు, మునులు, పతివ్రతలు— 'పవరు'న్న ప్రతి వాళ్ళూ కోపంలో శపించేవారు. ఆ శాపాలు తూ.చా. తప్పకుండా పనిచేసేవి. కథలు ముందుకి సాగటానికి ఆ శాపాలే మూలాధారాలు. విశ్వామిత్రుడికి కోపం రాకపోతే హరిశ్చంద్రుడి కథే లేదు. దుర్వాసుడికి కోపం రాకపోతే శకుంతల కథే లేదు. వినాయకుడికి చంద్రుడిమీద కోపంరాకపోతే ఈనాటికీ వినాయకుడిని తలచు కునే వారా!

ఆడవాళ్లకి కోపంవస్తే అలుగుతారు సాధారణంగా. అలకే వారి ఆయుధం. ఆ విషయంలో ఆడవాళ్ళందరికీ సత్యభామే ఆదర్శం!

కోపంతో మౌనం వహిస్తే- అంటే మూతి ముడుచుకుని బిర్రబిగుసుకు పోయి కూర్చుంటే ఒక్కొక్కప్పుడు అనుకున్నవి తొందరగా సాధించగలుగు తాము. ఎదుటివాళ్ళు ఆ మౌనాన్ని ఎక్కువసేపు భరించలేక కాళ్ళబేరానికి దిగు తారు. మరీ బిగుసుకుపోతే తాడు తెగే ప్రమాదంకూడా లేకపోలేదు.

పువ్వు పుట్టగానే పరిమళించినట్లు మనిషి స్వభావం చిన్నప్పుడే తాస్తో

చూస్తో వెల్లడవుతుంది. అహంభావం, గర్వం, సహనం, ఔదార్యం, వినయం— ఇటువంటి లక్షణాలన్నీ చిన్నప్పటినుంచీ వ్యక్తమవుతూనే ఉంటాయి వారి వారి ప్రవర్తనలో. చిన్నప్పుడు నాకు కోపంవస్తే అన్నం తినటం మానేసేదాన్ని (అది గాంధీగారి ప్రభావం కాదు. నా స్వయం ప్రతిభే). అమ్మ నాలుగైదుసార్లు బ్రతిమాలేది. ఇంకొక్కసారి అడిగితే తినేద్దాం అని మనస్సులో నిర్ణయించుకొని అమ్మ పిలుపుకోసం ఎదురుచూసేదాన్ని. కాని, ఒక్కొక్కప్పుడు ఆవిడకి ఓపికలేక మాట్లాడక ఊరుకునేది. ఇక ఆ రోజుకి పస్తే ఈ చిట్కా పెళ్లయిన తరవాత పనిచెయ్యలేదు ! "నువ్వు తినకపోతే నేనూ తినను" అని భర్త భీష్మించుకుంటే ఏ భార్య లొంగిపోదు ?

మా మేనకోడలు చిన్నప్పుడు ఒకరి పెళ్ళిలో అందరితోబాటు తనకూ్కడా పళ్ళు, తాంబూలం, మిఠాయి ఉన్న సంచీ ఇవ్వలేదని, వెంటనే కట్టుకున్న పట్టు పరికిణీ, జాకట్టూ విప్పేసి పెళ్ళిపందిట్లో బోర్లా పడుకుని ఏడవడం మొదలు పెట్టింది పెద్దయ్యాక అది మారింది కాబట్టి సరిపోయింది !

పిల్లల పెంపకంలో తల్లిదండ్రులు తరచు కోపానికి లోనవుతూ ఉంటారు. వారిని బుజ్జగించి మంచిమాటలతో దారిలోకి తీసుకురాగల సహనం చాలామందికి ఉండదు చెడామడా తిట్టేస్తారు. "డొక్క చీల్చేస్తాను", "కాళ్ళువిరగ్గొడతాను", "తోలువలిచేస్తాను" లాంటి మాటలతో బెదిరిస్తారు. చేతిలో ఏముంటే దాన్తో కొట్టేస్తారు కొందరు. ఒక్కొక్కప్పుడు సమయానికి ఏమీ దొరక్క ఆ కోపం భార్య మీదకో నౌకరు మీదికో మళ్లుతూ ఉంటుంది.

కొందరికి పిచ్చికోపం వస్తుంది. అంటే కోపం పిచ్చిదనికాదు. కోపంలో వాళ్ళు పిచ్చివాళ్ళలా ప్రవర్తిస్తారు. "అత్తమీది కోపం దుత్తమీద చూపించింద"నీ, "అత్తగారిమీద కోపంతో కూతుర్ని కుంపట్లో కుదేసింద"నీ సామెతలు చెప్పినట్లుగా ఒకరిమీద కోపాన్ని మరొకరిమీద చూపిస్తారు. "బాసు" మీది కోపం భార్యమీద చూపించడం మామూలే కదా !

మా నాన్నగారికి ఒకసారి ఎందుకో వెర్రికోపం వచ్చింది. ఆయన చేతినున్న వాచీని తీసి నేలమీద గిరవాటేసి, పెరట్లో రోటి దగ్గరున్న పచ్చడిబండతో దాన్ని చితక్కొట్టి, ఇంకా కోపం చల్లారక, ఆ వాచీని మండుతున్న పొయ్యిలో పడేశారు.

నాకోసారి మావారిమీద ఎందుకో చెడ్డకోపం వచ్చి చేతిలోనున్న పుస్తకాన్ని విసిరిపారేశాను. ఈకలు పీకినకోడిలా పడున్న ఆ పుస్తకాన్ని చూడగానే చటుక్కున గుర్తుకొచ్చింది అది లైబ్రరీ పుస్తకమని. చచ్చినట్లు నేనే వెళ్ళి ఆ పుస్తకాన్ని తీసి కవరు సర్ది బల్లమీద భద్రంగా పెట్టేశాను.

కొంతమందికి కోపం వస్తే తెలుగులో ఉచ్ఛరించరాని పదాలన్నిటినీ వాడతారు కొంతమంది ఇంగ్లీషులోనే తిడతారు కోపంవస్తే. కొంతమంది కోపం టాటాకు మంటలా గప్పున వెలిగి తుస్సుమని చల్లారిపోతుంది. కొంతమంది కోపం చిటపట చినుకుల్లా ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. మరి కొందరికోపం ఆస్తి పంపకాల వరకూనో విడాకులవరకూనో దారి తీస్తుంది. కొందరి కోపం హత్యానేరాలకు కూడా దారి తీస్తుంది.

కోపం రావటం కోపం ప్రదర్శించటం మానవ సహజం. దాన్ని ఎప్పటికప్పుడు కక్కేసి మరిచిపోతే పరవాలేదు. కోపాన్ని అణచి పెట్టుకుంటే అనుకోకుండా అది ఎప్పుడో లావాలా పొంగి అనుకోని ప్రమాదాలకి దారి తీయవచ్చు, లేదా, క్రమంగా వేళ్ళు పాతుకుపోయి, కక్షగా రూపొంది, మనసుని కలుషితంచేసి, మనిషిని మంచితనానికి దూరం చేస్తుంది.

కోపాన్ని జయించటానికి పురాణకాలం నుంచి ఈనాటి వరకూ ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. కోపాన్ని జయించటానికి వివిధ ప్రయత్నాలు చేసే కన్న కోపం ఎందుకొస్తోందో గమనించడానికి పూనుకుంటే కోపంయొక్క స్వరూపాన్ని అర్థం చేసుకోవడానికి వీలవుతుందిట. అది అర్థమైతే కోపానికి తావుండదట. ఆ చిట్కా ప్రయత్నించ తగినదే!

కోపం తెచ్చుకోవడం ఎంత సులభమో కోపం తెప్పించడం కూడా అంతే సులభం! మన కిష్టంలేని పనులు ఎదుటివారు చేస్తే మనకి కోపం వస్తుంది అలాగే ఎదుటివారి కిష్టంలేని పనిని మనంచేసి వారికి కోపం తెప్పిస్తాము. మనకి లేనిది ఎదుటివారికి ఉంటే మనకు కోపం వస్తుంది. మనకి లేకుండా చేసి ఎదుటివారు అనుభవిస్తుంటే మరింత కోపం వస్తుంది. ఎవరికీ కోపం తెప్పించకుండా, ఎవరిమీదా కోపం తెచ్చుకోకుండా ఉండడం ఈ సంఘంలో మానవ సహజీవనంలో

ఎంతవరకు సాధ్యం ? ఆవేశం వస్తే ప్రయోగించటానికి అప్పడాల కర్ర నించి ఆటంబాంబుదాకా అనేక ఆయుధాలున్నాయి మనదగ్గర.

కోపం కోపావేశంగా రూపాంతరం చెందకుండా ఉండాలి. వాదం ఉగ్ర వాదంగా రూపొందకుండా ఉండాలి.

(ఆదివారం ఆంధ్రజ్యోతి, 18 జనవరి' 87)

***

# చేతిచేష్టలు

కొంతమందికి చెయ్యి ఊరుకోదు. పిల్లలకేకాదు, పెద్దలకికూడా. మనస్సు కోతిలాంటిది. చేతిచేష్టలు అందుకు తగినట్లుగానే ఉంటాయి.

క్లాసులో గురువుగారు పద్యం అప్పజెప్పమంటారు. పిల్లవాడు లేచినుంచుని మొదలు పెడతాడు. ఒక పాదం పూర్తి అవుతుంది. ఇక గుర్తుకిరాదు తక్కిన పద్యం. తల గోక్కుంటాడు కాస్సేపు. ఊహూఁ, లాభంలేదు. మరి కాస్సేపు వీపు గోక్కుని చూస్తాడు. ససేమిరా అంటుంది మెదడు. ఈలోగా గురువుగారికి సహనం చచ్చిపోతుంది. "వెధవా, చేతులు కట్టుకు నుంచో" అని పేక బెత్తం ఝుళి పిస్తాడు. కుర్రాడికి వీపుమీద చివ చివ ఇంకా తగ్గక మెదడు మరీ మొద్దుబారి పోతుంది. ఆ చేతుల్తో ఏదో వొకటి చేస్తేగాని వాడికి పద్యం గుర్తుకిరాదు. చేతులు కట్టుకు నిలబడితేగాని గురువుగారికి చేతిలో బెత్తం కుదురుగా ఉండదు. ఈచేతుల్తో చిక్కులు చిన్నప్పుడేకాదు, పెద్దయ్యాక కూడా వేధిస్తాయి.

కొందరు పిల్లలకి మెలకువగా ఉన్నంత సేపూ చేతివేళ్ళు నోట్లోనో ముక్కు లోనో పెట్టుకుంటేగాని తోచదు. కొందరికి అలవాటు పెద్దయినా పోదు. ఓ టైపిస్టు టైపు చేసినంతసేపూ ధనధనా చేసి, పని లేనప్పుడు నోట్లో వేలు పెట్టు కుని కూర్చునేవాడుట.

రోడ్డుమీద నడుస్తూంటే చేతులెక్కడ పెట్టుకోవాలో వాటితో ఏంచెయ్యాలో కొందరికి తెలియదు. అందరికీ తలోరకం అలవాటూను. ఒకడు రెండుచేతులూ విసురుగా ఇటూఅటూ ఊపుతూ నడిచిపోతూంటాడు. అటువంటి మనిషికి కాస్త దగ్గర్లోంచి ఎవరైనా వెళ్ళటం తటస్థిస్తే ఇహ వాళ్ళు ఆ చేతి విసురుకి అటు నడి రోడ్డుమీదికైనా ఇటు మురికి కాలవలోకైనా తూలి పడాల్సిందే. పడినా అతను పట్టించుకోకుండా ఆ చేతులలాగే ఊపుకుంటూ ముందుకిపోతాడు.

మరొకడు చేతులు రెండూ ఎందుకిచ్చాడా భగవంతుడు అన్నట్లుగా, వడిలి పోయిన తోటకూర కాడల్లా వేళ్ళాడేసుకుని చూసేవాళ్ళకికూడా జీవితంమీద విరక్తి పుట్టేస్తూ నడిచిపోతూంటాడు.

కొందరు నడిచేటప్పుడుకూడా రెండుచేతులూ జేబుల్లో పెట్టుకుని నడుస్తారు. ఎవరైనా ఎదురుపడి నమస్కారం పెడితే ప్రతి నమస్కారం చెయ్యటానికి చేతులు చటుక్కున ఊడిరావు పంట్లాం జేబుల్లోంచి.

పిలక, ఉత్తరీయం ఉన్నవాళ్ళు రెండేసి నిముషాలకోసారి పిలకముడి విప్పి మళ్ళీ వేసుకుంటూనో, ఉత్తరీయం దులుపుకుని మళ్ళీ వేసుకుంటూనో కాలక్షేపం చేస్తారు. సిగరెట్టు అలవాటున్న వాళ్ళకి ఓ చెయ్యి ఎప్పుడూ బిజీగా ఉంటుంది కాబట్టి, రెండోది ఏ జేబులో పెట్టుకునో, క్రాఫింగు సర్దుకుంటూనో కాలక్షేపం చేస్తారు.

మనస్సులోని భావాల్ని చేతుల్తో వెళ్ళబోస్తారు కొందరు. బస్సురాగానే చేతులు నలిపేసుకోవడమో. బాస్‌ని చూడగానే రెండుచేతులూ మెలేసుకుని మోకాళ్ల మధ్య పెట్టుకుని బిడియంగా నిలబడటమో, బడిపిల్లవాడిలా చేతులు కట్టుకుని నిలబడటమో, తప్పు చేసినట్లు మెడగోక్కుంటూ మాట్లాడటమో, చేతులు రెండూ పైకెత్తేసి వేళ్ళు మెలిపెట్టుకుంటూనో, అరచేతులు నెత్తిమీద పెట్టుకుని మాట్లాడటమో చేస్తారు కొందరు.

క్లాసులో పాఠం చెబుతూంటే చేతులెక్కడ పెట్టుకోవాలో, ఏం చెయ్యాలో తెలియదేమో లెక్చరర్స్‌కి-చీటికీ మాటికి బల్ల గుద్దుతూనో, చేత్తో గాలిలో సున్నాలు చుడుతున్నట్లుగానో, రెండుచేతుల్తోనూ "ఇంత" "అంత" అని సూచిస్తున్నట్లుగానో అభినయం చేస్తూ ఉంటారు. వీళ్ళచేతుల కేసే దృష్టిపోతుంది తప్ప పాఠంమీద మనస్సు నిలవదు విద్యార్థులకు.

సభల్లో ఉపన్యాసాలిచ్చేవాళ్లు మైకుని కౌగిలించుకునో, దాన్ని పట్టుకుని ఊగుతూనో చేతుల్ని బిజీగా ఉంచుకుంటారు కొందరు.

ఆడవాళ్ళ చేతులికి ఎప్పుడూ హడావిడే. పిల్లలున్నవాళ్ళు ఓ చేత్తో పిల్లాణ్ణో పిల్లనో ఈడ్చుకుపోతూ రెండో చంకని చంటివాణ్ణి పెట్టుకుంటారు. లేకపోతే ఒక చేత్తో కూరలసంచీ, మరోచేత్తో చంటివాణ్ణి పట్టుకుంటారు. అయితే, ఈ మధ్య ఆ బాధ్యత మొగుడే తీసుకోవటంతో బజారుకిగాని షికారుకిగాని వెళ్ళేటప్పుడు ఆవిడకి చేతుల్తో ఏం చెయ్యాలో తెలియదు. పాపం, ఒకచేత్తో పమిట సర్దుకుంటూ రెండో చేత్తో వానిటీబాగ్ పట్టుకోవడం అలవాటు చేసుకుంటోంది.

చదువుకుంటున్న అమ్మాయిలకి ఓ చేతిలో పుస్తకాలో, రెండోచేతిలో హాండ్‌బాగో, పమిట కొంగో ఉండబట్టి ఎలాగో కాలక్షేపం అవుతుంది. అయితే, ఆదివారం నాడు కాలేజీ అమ్మాయి ఎక్కడికన్నా వెళ్ళాలంటే చచ్చే ఇబ్బందిగా ఉంటుంది. చేతిలో ఏమీ ఉండవు. నడుస్తూంటే చేతుల్తో ఏం చెయ్యాలో వాటినెలా ఎక్కడ పెట్టుకోవాలో తెలియక తికమక పడటంతో ఇటూ అటూ వయ్యారం వలకబోస్తున్నట్లు కనిపిస్తుంది. అటువంటి పరిస్థితి చూసి అబ్బాయిలకి ఈలవెయ్య బుద్దేస్తుంది.

నడవటం మాట ఎటున్నా, రెండు నిముషాలు కుదురుగా నుంచుని మాట్లాడాలంటే ఆడపిల్ల చేతుల్ని ఎక్కడ పెట్టుకోవాలన్నది పెద్ద సమస్య. ఓ చెయ్యి గడ్డంకింద పెట్టుకుని మరోచెయ్యి నడుంచుట్టూ వడ్డాణంలా పెట్టుకుని సిగ్గుపడుతూ నిలబడటం అనాదినుంచీ వస్తున్న ఆచారం. ఈ మధ్య కాలేజీ చదువులూ 'సమాన హక్కులూ' వచ్చాక, కాస్త సిగ్గు, బిడియం వదిలేసి నిటారుగా నిలబడి మగవాడిలా చేతులు వెనక్కి పెట్టుకోవటం అలవాటు చేసుకుంటున్నారు. లేకపోతే 'కుర్తా', 'పైజామా' వేసుకుని పల్లెవాటు చీటికీ మాటికీ సర్దుకుంటూ ఉంటారు. ఉత్తరాదిని చలికాలంలో ఆడవాళ్లుకూడా కోట్లు తొడుక్కుని హాయిగా మగవాళ్లలా చేతులు రెండూ జేబుల్లో పెట్టుకుని సమానంగా దీమాగా నిలుచుని మాట్లాడగలుగుతున్నారు. ఎండాకాలం మళ్ళీ చేతుల్తో చిక్కులు తప్పవు కదా!

నిత్యజీవితంలో జరిగేవే నాటకాల్లోనూ ప్రతిబింబించటం సహజం. రంగస్థలం మీద ఆడవేషంలో ఉన్న మగవాణ్ణి చూసినా, మగవేషంలో ఉన్న ఆడపిల్లని చూసినా కృత్రిమమైన మీసం పెట్టుకుని ఆ మీసాన్ని పౌరుషంగా మెలివేసే నటులను చూసినా నా మనస్సు స్థిమితంగా ఉండదు. నా కళ్ళన్నీ వాళ్ళ చేతుల మీదే ఉంటాయి.

(ఆదివారం ఉదయం, 13 జూలై' 86)

* * *

# 'ఉత్తరక్రియ'

అవసరం లేని వస్తువుల్ని చూస్తూ చూస్తూ పారెయ్యలేం. కొన్నాళ్లో కొన్నేళ్లో దాచి దాచి, చివరికి ఎవరికీ ఉపయోగపడని స్థితిలోకి వచ్చాక అవతల పారేస్తాం. లేకపోతే, మన ఔదర్యాన్ని ప్రదర్శించటానికి ఏ పనివాళ్ళకో ఇస్తాం. ఆ యిచ్చేదో, పారేసేదో ముందు చేస్తే ఇల్లు ఖాళీగా ఉంటుంది. మనస్సు తేలికగా ఉంటుంది. ఆ సత్యాన్ని గ్రహించక వస్తువులమీద మమకారాన్ని తెంచుకోలేం.

ఉత్తరాలసంగతే తీసుకుందాం. బంధుమిత్రులెవరి దగ్గరనుంచైనా ఉత్తరాల వస్తే ఆత్రుతగా చదువుతాం. ఆ తరవాత వాటిని ఏం చేస్తామన్నదే గమనార్హం. ఉత్తరాలకు తక్షణం కాకపోయినా వీలయినంత త్వరగా ప్రత్యుత్తరాలు రాసేవారు చాల తక్కువమంది ఉంటారు ఉత్తరం అందుకోవటంలో ఉన్న ఆత్రుత ప్రత్యుత్తరంలో కనిపించదు. అశ్రద్ధ ఆవహిస్తుంది మనిషిని. కవరు ఇంట్లో లేదనో, పెన్నులో ఇంకు లేదనో, తీరిక దొరకడంలేదనో వంక పెట్టి ఉత్తరం రాయటానికి బద్ధకిస్తారు జవాబు రాయాలని కూర్చున్న సమయానికి అసలు ఉత్తరం కనిపించదు. ఉత్తరం రాగానే చదివి, దాన్ని ఒక నియమిత స్థలంలో పెట్టే అలవాటు ఉండాలికదా. ఆ ఉత్తరాన్ని ఏ కిటికీ ఊచల మధ్యనో, గోడ అలమారులో సామాన్ల వక్కనోవడేస్తే అది సమయానికి దొరకాలంటే మాటలా ! పెట్టినచోట ఉంటుందని ఏముంది ? ఇక ఉత్తరానికీ ప్రత్యుత్తరానికీ మధ్య ఆమడదూరముంటుంది. ఉత్తరంలో రాసిందొకటి, జవాబులో రాసేదొకటి.

కొంతమందికి ఉత్తరంలో నంబర్లువేసి ఒక్కొక్క విశేషం ప్రశ్నరూపంలో గాని సమాచారం రూపంలోగాని విడివిడిగా రాయటం అలవాటుంటుంది అటువంటి 'చాదస్తం' మనుషులకి వాళ్ళకి వచ్చే జవాబు చూడగానే అరికాలిమంట నెత్తికెక్కుతుంది. ఆ నంబర్ల ప్రకారం రాసిన విషయాలకీ, జవాబులకి సంబంధం ఉండదుమరి.

కొందరు ఉత్తరం రాగానే చదివి చింపేస్తారు. కొందరు జవాబు రాశాక

చింపేస్తారు. కొందరు ఆ ఉత్తరాన్ని ఎక్కడో అక్కడ పడేసి ఉంచుతారు, కొందరు పదిలంగా భద్రపరుస్తారు. చదివిన వెంటనే చింపటానికి సాధారణంగా ఏదో ఒక అనుబంధం అడ్డొస్తుంది కోపంతో చింపటం జరుగుతుంది అప్పుడప్పుడు. అవసరం తీరినా చింపలేం ఒక్కొక్కప్పుడు. బంధుమిత్రుల నుంచి వివాహాలకు శుభలేఖలు వస్తుంటాయి. వివాహం అయిపోయిన తరవాతకూడా శుభలేఖని చింపి చెత్తబుట్టలో పారెయ్యటానికి చేతులు రావు. చూసీ చూడనట్లు ఎక్కడో ఉంచేస్తాం. కాగల కార్యాన్ని గంధర్వులే తీర్చినట్లు ఆ శుభలేఖ నేలమీదపడితే ఏ పనిమనిషో ఊడ్చేస్తుంది, లేదా, ఏ పిల్లలో చింపేస్తారు, లేకపోతే, తక్కిన పాతఉత్తరాలతో ఇది కూడా జతకూడుతుంది.

ఎప్పటికో అప్పటికి యీపాత ఉత్తరాలు తడిసి మోపెడవుతాయి. అప్పుడొస్తుంది బాధ. వాటన్నిటినీ చెత్తకింద జమకట్టి పారెయ్యలేరు. అందులో ఏవైనా ముఖ్యమైన ఉత్తరాలు ఉన్నాయేమోనని అనుమానం వస్తుంది. వాటన్నిటినీ మన ముందు పోగేసుకుని వాటిలో అవసరమైన వాటినీ, అనవసరమైనవాటినీ వేరు చెయ్యటం యజ్ఞంలాంటిది. 'అవసరమైన' వాటిలో బంధువులనీ మిత్రులనీ వేరు వేరుగా ఉంచాలనే ఆలోచన రావచ్చు. అందుకని వీటిని యథాలాపంగానైనా విప్పిచూడాలికదా. ఆ కార్యక్రమం మొదలు పెట్టినప్పుడు ఉత్సాహంగానే ఉంటుంది. ఆ ఉత్తరాలలో గ్యాస్ బిల్లులూ, దుకాణాల బిల్లులూకూడా కలిసిపోయి ఉంటాయి. వాటిని చూడగానే నలిపి ఉండచుట్టి బుట్టలోకి విసిరెయ్యడం చురుకుగానే సాగుతుంది. ఉత్తరాలు విప్పి చూసేటప్పుడు మాత్రం కొన్ని కొన్ని అకట్టుకుంటాయి. పూర్తిగా చదివేస్తాం అనుకోకుండా. కొన్ని నవ్వు తెప్పిస్తాయి. కొన్ని గత స్మృతులలోకి యీడ్చుకుపోతాయి. అసలుపని ఆగిపోతుంది. కాస్సేపటికి నడుమునొప్పి, తలనొప్పి మొదలై ఆ కార్యక్రమాన్ని అంతటితో ఆపుచేస్తాం.

పూర్వం పల్లెటూళ్ళలో ఉత్తరాలను వరసగా ఒక తీగకు గుచ్చి చూరు నుంచి వేళ్ళాడదీసి ఉంచేవారు. అవి మసిబారి, బూజుపట్టి ఉండేవి. వాటిచుట్టూ ఏదో 'మిస్టరీ' ఉన్నట్లుగా అనిపించేది.

ఇప్పటివాళ్ళు ఎలా దాచుకుంటున్నారు ? చదువుకున్న వాళ్ళంతా ఒకపద్ధతి ప్రకారం దాచుకుంటున్నారంటే నమ్మలేం. అలమారులో ఒకమూలో, పాత ట్రంకు పెట్టెలోనో, అట్టపెట్టెల్లోనో, కాగితం సంచుల్లోనో కుక్కేసి, ఏదైనా అవసరం

వచ్చినప్పుడు-అంటే, ఫలానా ఉత్తరం కావాలనుకున్నప్పుడో, ఫలానా ఎడ్రసు కావాలనుకున్నప్పుడో (ఆ అడ్రసుని డైరీలో రాసుకుని ఉంచుకునే అలవాటు అందరికీ ఉండదుకదా) ఆ ఉత్తరాలన్నీ క్రిందపోగేసి, వాటిలో కావలసిన దాన్ని వెతకటం మొదలు పెడతారు. దొరక్కపోతే ఇంట్లోవాళ్ళని తిట్టుకోవటం, మళ్ళీ ఆ ఉత్తరాల్నీ కాగితాల్నీ యథావిధిగా కుక్కేయ్యడం జరుగుతుంది. వాటిని సక్రమ పద్ధతిలో అమర్చటం ఒక పంచవర్ష ప్రణాళిక అవుతుంది.

ఎన్ని చెప్పినా, ఉత్తరాలు రాగానే వాటి అంతు తేల్చటం అంత సులభం కాదు.

(ఆదివారం ఉదయం, 8 జూన్' 86).



# మన వెనకటి తరాల స్త్రీలు : చెళ్లపిళ్ల వారి విశ్లేషణ

నలభయ్యేళ్ళ క్రితం చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు స్త్రీల స్థితిగతుల గురించి "ఆంధ్ర వీక్లీ"లో (1-9-1948) రాస్తూ పురాణ కాలంనాటి కథ ఒకటి ఉదహరించారు.

జరత్కారుడనే ముని ఉండే వాడట. అతడు ఒక రోజు మధ్యాహ్నం భార్య తొడమీద తల పెట్టుకుని పడుకున్నాడట. సాయంకాలం అవుతున్నా నిద్రలేవకపోయే సరికి భార్య కంగారు పడిందట. నిద్రలేపకపోతే సంధ్యా వందనం కార్యక్రమానికి భంగం కలుగుతుంది. లేపితే నిద్రా భంగమవుతుంది. మనసులో మథన పడిపడి చివరికి కర్మ లోపం కాకూడదని నిశ్చయించుకుని, సంధ్యా సమయం అయిందంటూ నిద్ర లేపిందట. నిద్రా భంగం చేసినందుకు భర్త మండిపడి, ఔరౌరా! నన్ను లేపి నిద్రా భంగం చేస్తావా? నీ కింత స్వాతంత్ర్యమా?" నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" ఇట్టి నీతో నాకు పొత్తు కుదరదు" అంటూ లేచి చక్కా పోయాడట. భర్త ప్రకృతి తెలుసును గనక ప్రయోజనం వుండదని కాళ్ళా వేళ్ళాబడి బతిమాలడం వగైరా ఆచారాలు జరపలేదుట ఆవిడ! ప్రస్తుత కాలంలో" (చెళ్లపిళ్లవారి కాలం) జరత్కారు ముని వంటి ముక్కోపి గృహస్థులు ఎక్కడపడితే అక్కడ కనిపిస్తారనీ అటువంటి వారి ప్రవర్తన హేయమైనది కాబట్టి ఆమోదించరాదనీ, అటువంటి వారిని నాగరికులు మంద లించాలనీ రాశారు. అంతేకాదు స్త్రీల స్థితిగతులు ప్రాచీన కాలంలో ఏ విధంగా ఉండేవో జరత్కారుని కథలో కనిపిస్తుందని చెబుతూ "పురుషుడు చేసే తప్పు లను దేవతలు కూడా సమ్మతించి వూరుకుంటారనిన్నీ స్త్రీలు చేసే తప్పులను దేవతల మాటకేం భర్తలే క్షమించేటట్టు లేరనిన్నీ" నిజాన్ని ప్రకటించారు. స్త్రీల స్థితిగతులు పురాణ కాలం నాటి నుంచి ఇరవయ్యవ శతాబ్దం నాటికి మార్పు చెందినట్లు కనిపించినా, పురాణ కాలపు స్త్రీల కన్నా ఈ శతాబ్దపు స్త్రీలు ఎక్కువ అదృష్టానికి నోచుకున్నట్లు తోచినా, ఇంకా హిందూ గృహస్థులలో నూటికి 90

మంది "జరత్కారులే" ననీ జరత్కారుని వంటి భర్తలను మందలించడం ఆరంభిస్తే ఇతరులకు బుద్ధి వచ్చి కొందరు గృహిణుల స్థితిగతులు తిన్నబడతాయనీ" రాశారు వెంకటశాస్త్రిగారు.

నూటికి 90 మంది జరత్కారులే అనడం అతిశయోక్తి కావచ్చును. కానీ పురుషాధిక్య సమాజంలో జరత్కారు లెక్కువగా ఉంటారన్నది ఈ నాటికీ వాస్తవం. అయితే చెళ్లపిళ్ల వారి కాలం నాటి స్త్రీలకన్నా ఈనాటి స్త్రీలు మరింత అదృష్టవంతులే విద్య, ఉద్యోగావకాశాలు అందుబాటులో వున్నాయి. కొంత వరకు సాంకేతిక వికాసం మూలాన్ని నిరక్షరాస్యులకు కూడా లోకజ్ఞానం, విషయ పరిజ్ఞానం ఎక్కువవుతున్నాయి. కరెంట్ వసతి, నీటి వసతి, వంటింటి సదుపాయాలూ మొదలైన సుఖాలతో చాలామంది స్త్రీల జీవన విధానంలో అభివృద్ధికరమైన మార్పు వచ్చింది. కానీ ఈ మార్పు పైపై మెరుగువంటిదే.

బాల్యవివాహ దురాచారాన్నీ, కన్యాశుల్క దురాచారాన్నీ రూపుమాపడానికీ, బాల్య వైధవ్యాల్ని నిరోధించడానికీ "శారదా బిల్లు"ని ప్రవేశపెట్టింది ఆనాటి ప్రభుత్వం దాన్ని సదాచార సంపన్నులూ గ్రామ వాసులూ అనేకమంది ప్రతిఘటించడానికి ప్రయత్నిస్తున్న సమయంలో చెళ్లపిళ్ల వారు 'శారదా బిల్లు"ని అతిక్రమించడం క్షేమం కాదని ప్రబోధిస్తూ 1938లో 'ఆంధ్రవీక్లీ'లో ఒక వ్యాసం రాశారు—"... శారదా బిల్లుగాని విడాకుల చట్టం గాని వితంతూద్వాహం కాని పురికొల్పే వారి వుద్దేశం ఎలాంటిదంటే, స్త్రీస్వాతంత్ర్యాన్ని బలపరచేదిగా కనపడుతుంది. మీరేమో స్త్రీ స్వాతంత్ర్యం వల్ల ఇబ్బందులు వున్నాయి కనక అది పనికి రాదంటారు. "ఆ ఇబ్బందులు ఇబ్బందులుకావు, పునర్వివాహం చేసుకోవడానికి గానీ, విడాకులిచ్చుటకు గాని పురుషుడికి అధికారం వున్నప్పుడు స్త్రీకెందుకు ఉండకూడదు?" అని వారంటారు' అంటూ శారదా బిల్లుకి అనుగుణంగానూ, వ్యతిరేకంగానూ వచ్చిన వాద ప్రతివాదనలను వివరించి తను శారదా బిల్లుని ఎవరూ ఎందుకు అతిక్రమించ కూడదనుకుంటున్నారో సోదాహరణంగా చెప్పారు.

"ప్రస్తుత కాలంలో లేచిపోయిన స్త్రీకి కూడా తగిన ఆలంబనమంటూ దొరికితే సంఘంలో గౌరవం లేకపోలేదు. అలాంటి సంఘ గౌరవానికి తగ్గ ప్రాపకం సంపాదించిన ఒక ఇల్లాలు ఆ ద్వితీయ భర్తతోనూ, ఆ బావతు

సంతానంతోనూ రంగూన్ నుంచి సుమారు సంవత్సరం నాడు దేశానికి వచ్చి రక్తసంబంధుల చేత పంక్తిభోజనాది సత్కారాలు పొంది ఇచ్చి పుచ్చుకునే మాటలు కూడా జరిపించి వెళ్ళినట్లు విన్నాను..." అని రాస్తూ, ఆవిడని క్రమంగా సంఘం గౌరవించినట్లుగానే ఎటువంటి మార్పులయినా కాలక్రమేణా ఆమోదాన్ని పొందుతాయనీ అందుచేత "తాటాకు పుస్తకాల్లో వుండే శ్లోకాలు యేకరువు పెట్టిన ప్రయోజనం లేదు" అనీ తెలియజెప్పారు.

అయితే, ఇది చెళ్ళపిళ్ళ వారు శారదా బిల్లుని స్వయంగా హర్షించి ఆమోదించి చేసిన వ్యాఖ్యానమనిపించదు. ప్రభుత్వం ఆ బిల్లుని ప్రవేశపెట్టింది దాన్ని అతిక్రమిస్తే శిక్ష తప్పదని చేసిన హెచ్చరిక మాత్రమేనన్నది ఆయన మాటల బట్టి తెలుస్తుంది–

"ఇప్పుడు సిద్ధంగా బాధిస్తూ వున్నది "శారద బిల్లు'. మనకు సంఘబలం లేదు... నా బంధుజాతంలో చాలా మందికి నేను సలహా ఇవ్వడం ఈ బిల్లును అతిక్రమించవద్దు. ముప్పు మూడి తీరుతుందనే ఇస్తూ వున్నాను..." అని రాశారు.

చెళ్ళపిళ్ళ వారు వెనకటి తరానికి చెందిన మహాపండితుడు, మహా మేధావి. స్త్రీల గురించీ, వారి స్థితిగతుల గురించీ ఆయనకి కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలుండేవి.

"రాజ్యలక్ష్మి" అనే నాటకాన్ని రాసిన సందూరి బంగారయ్య గారి అభిప్రాయాలను హర్షిస్తూ శాస్త్రిగారు తమ సమీక్షలో ఇలారాశారు...."స్త్రీలు నాటక రంగాలలో అభినయించడం ఈ గ్రంథ కర్తకు లేశమున్నూ ఇష్టం లేదనే అంశం మిక్కిలి మృదువుగా బోధించిన ఈ కవిత్వ ప్రౌఢిమను ఎంత వర్ణించినా తనివి తీరదు.

ఈయన శుద్ధ ఛాందసుడు కాకపోయినప్పటికీ ప్రస్తుత విషయంలో ఆ ఛాందసుల అభిప్రాయాలే సర్వదా శ్రేయస్కాములకు ఆదరణీయాలుగా ఈ నాటకంలో చిత్రించి వున్నారు. కులస్త్రీలు నాటకాలలోనూ సినిమాలలోనూ అభినయ పాత్రలుగా వుండవచ్చునని వాదించేవారు తీరా అది తమకు సంబంధించవలసి వచ్చేటప్పటికి యే స్థితికి రావలసి వస్తుందో ఈయన బహుమృదువుగా బోధించారు...

ఈ నాటకంలో ఎక్కడా కూడా 'పేకేజీ' సరకు నాకు కనిపించలేదు.. రాజ్యలక్ష్మి శీల సంరక్షణవల్ల పురుషులలో వున్నంత అవినీతి ఇప్పటికిన్నీ మన భారత ఖండంలో స్త్రీలలో లేదనిన్నీ వాళ్ళ మూలకంగానే భరతఖండపు యోగ్యత ఇంకా అంతోఇంతో నిలిచి వుందనిన్నీ స్ఫురింప చేసినట్లయింది.... ఆ పెత్తత్వం కూడా అసలు మంచిదే అయినా ఈ నాటక కళా వ్యామోహం చేత చెడ్డట్టు వ్యంగ మర్యాదగా తేల్చినట్లయింది.

దీనివల్ల తేలే సారం కులస్త్రీలు నాటక రంగాలకు పనికిరారు అనగా నాటక రంగంలో ఇతర పురుషులతో ఆయా భాగాలు నటించిన పిమ్మట శీలాన్ని చెడ గొట్టుకోకుండా వుండటం కలలో వార్త అనేదే ఇందు తెలుసుకోదగ్గది. శీలమే అక్కరలేదు కులస్త్రీలకనే వారు తప్ప తదితరులు ఈ భావాన్ని శిరసావహిస్తారు.

కనక ఈ నాటకం సామాన్యంగా అన్ని పక్షాల వారికిని ఆమోద పాత్రమని నేనభిప్రాయపడతాను....". నాలుగు ఐదు దశాబ్దాల కిందట చెళ్లపిళ్లవారు వెలి బుచ్చిన అభిప్రాయాలు కొన్ని మనకిప్పుడు అంత ఆశ్చర్యం కలిగించకపోవ చ్చును. కానీ ఒక అర్థ శతాబ్దం తరువాతకూడా స్త్రీల విషయంలో సమాజ నియ మాలు మౌలికంగా అట్టే మారలేదని తెలుస్తోంది. అదే ఆశ్చర్యం కలిగించే విషయం.

మౌలికమైన మార్పు రావాలంటే ఆలోచనాసరళిలో, సామాజిక దృష్టిలో మార్పు రావాలి. ఎన్ని శాసనాలు చేసినా, చట్టాలు అమలు కావాలంటే సామాజిక సంప్రదాయాల్లో, భావాల్లో ప్రవర్తనలో, పరివర్తన రావాలి. మనిషిలో మార్పు రావాలి.

(ఉదయం నవతరం వారపత్రిక, 22-9-89)

---

# చేనుమేసే కంచెలుంటే...?

చిన్నప్పుడు 'మానవతి' అనే ఒక రాజకుమార్తె కథ చదివాను. అందులో ఒక రాజకుమారుడు ఒక మానవతి అయిన రాజకుమార్తెని పెళ్ళిచేసుకోవాలనుకుంటాడు. ఆ ప్రయత్నంలో కొంతమంది రాజకుమార్తెలను కలుసుకొని వారికి ఒక ప్రశ్న వేస్తాడు-'నీ మీద ఎవరయినా అత్యాచారం జరపడానికి ప్రయత్నిస్తే నిన్నెవరు రక్షిస్తారు?'అని. దానికి సమాధానంగా-'నా తండ్రిరక్షిస్తాడ'నీ'మా సేనాధిపతి రక్షిస్తాడ'నీ,'నా రక్షకభటులు రక్షిస్తార'నీ,'నా చెలికెత్తెలు రక్షిస్తార'నీ, 'నా భర్త రక్షిస్తాడ'నీ-ఇలా రకరకాలుగా చెబుతారు రాజకుమార్తెలు. చివరకు ఒక్క రాజకుమార్తెమాత్రం 'నన్ను నేనే రక్షించుకుంటాను' అంటుంది. ఆమెనే వివాహం చేసుకుంటాడా రాజకుమారుడు. ఇక్కడ రాజకుమార్తె నిజంగా తన్నుతాను రక్షించుకోగలదా అన్నదికాదు ఆలోచించవలసిన అంశం. ఆమెకున్న ఆత్మవిశ్వాసం అదీ ముఖ్యమైన విషయం.

సమాజంలో స్త్రీకి రక్షణలేకపోవడం ఆనాటినుంచీవస్తున్నది. తమ్ము తాము రక్షించుకోగలిగిన స్త్రీలకన్నా అత్యాచారాలకు బలైపోయినవాళ్ళసంఖ్యే పెరుగుతోంది నానాటికీ. దీనికి కారణం 'కంచే చేనుమేస్తే...' అన్నట్లున్న సామాజిక వ్యవస్థ. ఒకవైపునుంచి స్త్రీ అబల అంటూ సంరక్షణ పేరుతో స్త్రీని నాలుగుగోడల మధ్య బంధించి పురుషుడు అవకాశందొరికితే చాలు గోడమీది బల్లి పురుగును గుటుక్కున మింగినట్లు స్త్రీ బలహీనతపై దెబ్బతీస్తూ, మరో వైపునుంచి స్త్రీ తన శీలాన్ని కాపాడుకోవడం అత్యావశ్యకమనీ, 'శీలంచెడిన' స్త్రీకి సభ్య సమాజంలో స్థానంలేదనీ శాసించి, స్త్రీకి విముక్తిమార్గం లేకుండాచేశాడు. అంతేకాక, మగవాడు ఏంచేసినా చెల్లుతుందనే 'అనుమతిపత్రాన్ని' తనకు తాను ఇచ్చుకున్నాడు. ఇదీ-నేటికీ నడుస్తున్న సామాజిక చరిత్ర.

పూర్వం స్త్రీలు చదువుకోని రోజుల్లో, పూర్వాచారాలు ప్రబలంగాఉన్న రోజుల్లో అనేకవిధాల హింసింపబడ్డారు. ముఖ్యంగా బాల్యవివాహాలు స్త్రీలను నానా విధమైన చిత్రహింసలకూ గురిచేశాయి. రాజారామ్‌మోహన్‌రాయ్, వీరేశలింగం

వంతులు, దుర్గాబాయి మొదలైన సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా పూర్వపు సాంఘిక దురాచారాలు కొంతవరకు సమసిపోయాయి. కాని, నేడు స్త్రీలకు విద్యాభ్యాసం, ఉద్యోగావకాశాలూ లభించడం పరిపాటి అవుతున్నప్పటికీ, సమాజంలో స్త్రీకి స్థానంమాత్రం పురుషునిస్థాయికి చేరుకోవడంలేదు. ఇప్పటికీ పురుషుని ప్రవర్తనకి ఒక కొలమానం, స్త్రీ ప్రవర్తనకి ఒక కొలమానం వాడుతున్నారు. విద్యా ఉద్యోగాలవల్ల స్త్రీకి తాను కోరుకున్న స్వేచ్ఛ లభించకపోగా, గృహ బాధ్యతలతో బాటు ఉద్యోగనిర్వహణ బాధ్యతకూడా పెరిగి, 'వెనకచూస్తేనుయ్యి, ముందుచూస్తే గొయ్యి'అన్న స్థితిలో ఇరుక్కుపోయింది

ఆర్థికంగా, సామాజికంగా, చట్టపరంగా తనకు లభించిన హక్కులనూ, అధికారాలనూ వినియోగించుకోగల స్థితిలోఉంటోందా స్త్రీ? భర్తపోయిన స్త్రీలు, విడాకులు ఇవ్వవలసివచ్చిన స్త్రీలు తనకుతగిన న్యాయం జరగడంకోసం న్యాయవాదుల దగ్గరకువెళ్ళి వారి వలలో చిక్కుకుని సంఘంచేత దూషింపబడిన వాళ్లున్నారు. పురుషుల అత్యాచారాలకుగురై రక్షణకోసం పోలీసులదగ్గరకు పరుగెత్తి వాళ్ళ విషవలయాల్లో చిక్కుకుపోయిన వాళ్లెందరోవున్నారు. విద్యాభ్యాసంకోసం వెళ్ళిన ఆడపిల్లలు తోటి విద్యార్థుల ఆకతాయితనానికీ, 'గురువుల' అత్యాచారాలకీ లోనై, అభాగినులైన వారున్నారు. ఉద్యోగాలకోసం, బదిలీలకోసం అధికారులనూ, రాజకీయనాయకులనూ ఆశ్రయించి వారికబందహస్తాల్లో చిక్కుకుపోయి, మార్గాంతరం లేక ఆత్మహత్యలకు పాల్పడినవాళ్ళూ, లేదా జీవచ్ఛవాల్లా మిగిలినవాళ్ళూ ఎక్కువవుతున్నారు. ప్రేమించినవాళ్ళు మోసంచేసినా, తండ్రి పోషించలేని స్థితిలోనూ పెళ్ళిచెయ్యలేని స్థితిలోనూవున్నా, భర్తపోయి పిల్లల్ని పోషించుకోలేని స్థితిలోవున్నా పడుపువృత్తితప్ప గత్యంతరంలేని హీనస్థితికి ఈడుస్తుంది పురుషాధిక్య సమాజం.

ఈ దుస్థితినుంచి స్త్రీలకు విముక్తి కలిగించడానికి మరో రామమోహన్‌రాయ్, మరో వీరేశలింగం పుట్టాలని ఎదురుచూస్తూ చేతులుముడుచుక్కూచునే బదులు స్త్రీలు తమంతటతాము ఏంచెయ్యగలమని ఆలోచించుకోవలసిన అగత్యం ఎంతైనా వుంది. ఓటుహక్కు, ఆస్తిహక్కు, న్యాయస్థానాలు, పోలీసుస్టేషన్లు-వీటివల్ల లభించే రక్షణ, గౌరవం చూస్తూనేఉన్నాం. అభివృద్ధినిరోధకశక్తుల్ని అధిగమించే శక్తి స్త్రీలు ఏ విధంగాపొందాలి, ప్రదర్శించాలి-అని ఆలోచించుకోవాలి.

సమాజంలో ఎటువంటిమార్పు తీసుకురావాలన్నా వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ రెండువిధాలా కృషి చేయవలసివుంటుంది. మహిళా సంఘాలూ స్త్రీ విముక్తి ఉద్యమాలూ ఎంత కృషిచేసినా, వ్యక్తిగతంగా ప్రతి స్త్రీ అభివృద్ధినిరోధక శక్తుల్ని స్వయంగా ప్రతిఘటించకపోతే ప్రయోజనంవుండదు ప్రతిఘటించడమంటే హింసామార్గాన్ని అవలంభించమని కాదు.

పూర్వం రచనల్లోనూ చలనచిత్రాల్లోనూ స్త్రీలు పడే బాధలకి ఆత్మహత్య వంటి ఆత్మ వినాశకరమైన పరిష్కారాలనేచూపేవారు ఇప్పుడు విప్లవంపేరుతో చట్టాన్ని చేతుల్లోకితీసుకుని హత్యవంటి హింసాకాండలకు పాల్పడటమే పరిష్కారమార్గంగా చూపిస్తున్నారు. ఇవి రెండూ నిషిద్ధమార్గాలే. విద్యాసంస్కారాలు చూపవలసినది మధ్యేమార్గం. అది-స్త్రీలు తాము చైతన్యవంతులు కావడానికి ప్రయత్నించడమే కాక, పురుషులకుకూడా స్త్రీల సమస్యలపట్ల సదవగాహన కలిగించడమే.

(ఆంధ్రజ్యోతి అక్టోబరు 25, 1988)

---

# ...వివాహమంత్రాల తాత్పర్యం

ఇది పెళ్లిళ్ల సమయం. ఎందరో వధూవరులు పెళ్ళిపీటల మీద కూర్చుని పురోహితుడు చదివే మంత్రాలను వింటున్నారు. కొన్నిటిని చిలకపలుకుల్లా పురోహితుడు చెప్పమన్నట్లు చెబుతున్నారు. అందులో ఎందరికి తెలుసు వివాహ మంత్రాల అర్థాలు? పీటలమీద కూర్చున్నవాళ్ళకి తెలియవు. పెళ్ళికి వచ్చిన ఆహూతులకూ తెలియవు. ఎవరో ఒకరిద్దరికి తప్ప.

మచ్చుకి కొన్ని ముఖ్యమైన వివాహ మంత్రాలకు తాత్పర్యాన్ని తెలుసుకుంటే చాలు ఎన్నో ఆశ్చర్యకరమైన విశేషాలు వెల్లడవుతాయి. వివాహ కార్యక్రమంలో వరుడి ప్రాముఖ్యం, ఆదిమానవుల సాంఘిక వ్యవస్థ, వేదకాలంనాటి వారి విశ్వాసాలూ, ధర్మసూత్రాలూ మొదలైనవి ఎన్నో తెలియవస్తాయి. ముఖ్యంగా అరుంధతిని ఆదర్శంగా తీసుకోవలసిన వధువుస్థానం ఎటువంటిదో, ఆ వధువు పొందే వరుడు ఎటువంటివాడో మొదలైనవి తెలుసుకోవలసిన, ఆలోచించవలసిన అంశాలు.

వివాహ కార్యక్రమంలో పురోహితుడు చదివే మంత్రాలు చాలావరకు వరుడి తరపున, వరుడికి బదులుగా చదివే మంత్రాలే. వివాహం చేసుకుంటున్నది వరుడు. వరుడు ముందుగా దేవతలను ప్రార్థిస్తాడు.

"దేవతలకు తల్లివైన ఓ ఆదితీదేవీ, నేను చేస్తున్న ఈ వివాహ కర్మను అంగీకరించు— ఓ సరస్వతీ దేవీ అంగీకరించు— ఓ పరమేశ్వరుడా నాకు స్ఫూర్తినిచ్చి, ఈ కర్మను అంగీకరించు— ఓ వరుణుడా ఈ కన్యకు సహోదరులు పొనట్టి భాగ్యాన్ని ప్రసాదించు.... ఓ బృహస్పతీ ఈమెకు భర్త పొనట్టి భాగ్యాన్ని ప్రసాదించు.... ఓ ఇంద్రుడా ఈమెకు పుత్రులు పొనట్టి భాగ్యాన్ని ప్రసాదించు— ఓ సూర్యుడా ఈమెకు సహోదరులు, భర్త, పుత్రులూ పొనట్టి భాగ్యాన్ని ప్రసాదించు"

తరువాత వరుడు వధువుని ఉద్దేశిస్తూ—

"ఓ కన్యా నీవు హింసాకరమైన దృష్టిలేకుండా భర్తను చంపేదానవు కాకుండా ఉండు. భర్త కోసం, బావమరదుల కోసం మంగళప్రదంగా ఉండు. మంచి మనస్సూ, మంచి తేజస్సూ కలిగిఉండు. దేవతలను పూజిస్తూ ఉండు. మనుషులనూ, పశువులనూ సుఖప్రదంగా ఉంచు" అని చెప్పి,

"ఓ వధూ, భర్తను చంపే దౌర్భాగ్యం నీకున్నట్లయితే దాన్ని ఈ దర్భతో తుడిచివేస్తున్నాను" అంటూ వధువు కనుబొమల మధ్య దర్భను తాకిస్తాడు.

వధువు శిరస్సుపైన ఉంచిన దర్భ వలయంలాగ వధూవరుల తల్లులు, బావమరదులూ వలయాకారంలో వివాహాగ్ని చుట్టూ ఉండి దాన్ని సంరక్షించమని ప్రార్థిస్తాడు.

తరవాత ఇంద్రుని ప్రార్థిస్తాడు వరుడు.

"ఓ ఇంద్రుడా! 'అపాల'ను తేజోవంతంగా చేసినట్లుగానే ఈ వధువును కూడా సూర్యతేజస్సు కలదానినిగా చేయి–" ఈ ప్రార్థనకు కారణం అత్రి మహాముని కుమార్తె బ్రహ్మవాదిని అనే కన్యకు "బొల్లి" వ్యాధి ఉండటం వలన వరుడు దొరకలేదు. "పాలకుడు" లభించనిది కాబట్టి ఆమెకి "అపాల" అని పేరొచ్చింది. వరుడు లభించేలా చేయమని ఆమె నిత్యం ఇంద్రుని పూజించేదిట. ఓసారి నదిలో కొట్టుకుపోతూ కూడా, చేతికందిన సోమలతని నమిలి, ఆ రసంతో ఇంద్రుని పూజించిందట. ఇంద్రుడు ఆ రసాన్ని స్వీకరించి రతము, ఇరుసు, కాడి ఈ మూడింటి రంధ్రాల గుండా ఉదకాన్ని పోసి ఆమెను పవిత్రురాల్ని చేశాడుట. ఆమెకు 'బొల్లి' పోయి ఆరోగ్యవంతురాలైందట. అప్పటినుంచీ ప్రతి వధువునూ ఈ విధంగా ఉదకంతో పవిత్రం చేయడం ఆచారమైంది.

బండి కాడియొక్క రంధ్రంలో బంగారం (మంగళసూత్రం) ఉంచి దాని మీదుగా వధువుపైన ఉదకం వచ్చి వధువు దేహాన్ని పవిత్రంచేసి "ఆలింగనానికి అర్హమయ్యేటట్లు" చేయమని పరమేశ్వరుని ప్రార్థిస్తాడు వరుడు.

ఆ తరవాత వధువుకి మధుపర్క వస్త్రాన్ని ఇచ్చి, వరుడు వధువు నడుముకి దర్భతాడు కడతాడు వివాహమనే పుణ్యకర్మ ఆచరించడానికి.

వరుడు వధువుని ఉద్దేశించి ఇలా అంటాడు–

ఓ వధూ! చంద్రుడు నిన్ను ముందుగా పొంది. తరువాత విశ్వావసుడనే గంధర్వునికిచ్చాడు. ఆ ఇద్దరి తరువాత అగ్నిహోత్రుడు నిన్ను వరించి నీకు మూడవ భర్త అయ్యాడు. ఆ దేవతలు పొందిన తరువాత మనుషులలో నిన్ను పొందిన నేను నీకు నాల్గవ భర్తనవుతాను. అగ్నిహోత్రుడు నిన్ను నాకిచ్చి, నీ వల్ల సంతానమూ, భాగ్యమూ కలిగేటట్లు నన్ను అనుగ్రహించాడు. నన్ను వివాహం చేసుకుని ఆజన్మాంతం నాతో ఉండు. యోగ్యమైన సంతానం కోసం నిన్ను వివాహమాడుతున్నాను. వివాహవేదికపై ప్రకాశిస్తున్న అగ్నిహోత్రుని ఎదుట దేవతలందరూ నిన్ను నాకర్పించినందువల్ల నిన్ను స్వీకరిస్తున్నాను. అగ్నిహోత్రుని స్నేహితుడైన వాయువు నాపై ఎల్లప్పుడూ నీవు ప్రేమ కలిగి ఉండేలా అనుగ్రహించవలసిందని కోరుతున్నాను".

"ఓ వధూ, నీవు నన్ను అనుసరించినడు. విష్ణుమూర్తి నీవువేసే మొదటి అడుగు వలన అన్నాన్నీ, రెండవ అడుగువలన బలాన్నీ, మూడవ అడుగువలన కర్మాన్నీ, నాల్గవ అడుగువలన కర్మసుఖాన్నీ, అయిదవ అడుగువలన పశు సమృద్ధినీ, ఆరవ అడుగువలన ఋతుసంపత్తినీ, ఏడవ అడుగువలన యజ్ఞం చేయించడానికి ఏడుగరు ఋత్విక్కులనూ కలుగజేయవలసిందని ప్రార్థిస్తున్నాను".

"ఓ వధూ! మనమిద్దరం ఏడడుగులు కలిసి నడిచినందువల్ల స్నేహితుల మైనాం. ఇక మనం ఒకరినొకరు విడువవద్దు. మనమిద్దరం పరస్పరం ప్రేమించుకుంటూ, అనుకూల దాంపత్యం సాగిస్తూ, ఒకరినొకరు సంప్రదించుకుంటూ మన మనసుల్ని ఏకం చేసుకుని ధర్మ కార్యాలన్నిటినీ నిర్వర్తిస్తూ కలిసి ఉందాం. నేను సామవేదమైతే, నీవు ఋగ్వేదానివి. అంటే ఋగ్వేద సామవేదాల లాగే అవినాభావంగా ఉందాం. సంయోగక్రియని బట్టి నేను ఆకాశంతో సమానం. నీవు భూమితో సమానం. నేను పైన, నీవు కింద... ఇంద్రియాల్లో ప్రధానమైన మనస్సుని నేనైతే, ఆ మనస్సు నుంచి వచ్చే వాక్కువి నీవు...."

వధువుని మొట్టమొదట పొందిన చంద్రునికీ, తరవాత పొందిన విశ్వావసుడనే గంధర్వునికీ, ఆ తరవాత పొందిన అగ్నిహోత్రునికీ, హవిస్సుని సమర్పిస్తాడు వరుడు. అంతటితో కన్యావ్రతం పూర్తయి, వధువు తండ్రి గృహాన్ని విడిచి భర్త గృహానికి బయలుదేరుతుంది.

వరుడు మళ్ళీ ప్రార్థిస్తాడు—

"ఓ ఇంద్రుడా, ఈ వధువుకి వివాహానంతరం పుట్టింటిపైన ఆపేక్ష లేకుండానూ, మెట్టింటిపైనే ప్రేమ కలిగి ఉండేట్లుగానూ, సుపుత్ర సంతానం, భాగ్యం కలిగేటట్లుగానూ అనుగ్రహించు".

దీర్ఘాయువుకలిగిన సంతానాన్ని ప్రసాదించమని వరుణునీ, అగ్నిహోత్రుని కూడా ప్రార్థిస్తాడు.

తరవాత, వధువుతో అంటాడు—

"ఓ వధూ, మన ఇంట్లో ఎప్పుడూ ఏడుపు వినిపించకుండా ఉండాలి. ఏడ్చేవాళ్ళకి దూరంగా ఉండు. నీవు కూడా ఎప్పుడూ జుట్టు విరబోసుకుని, గుండెలు బాదుకుంటూ ఏడవకు. భర్తనీ, సంతానాన్నీ చూసుకుంటూ సంతోషంగా ఉండు".

"ఓ వధూ, నీ నడుముని ఆకాశమూ, తొడల్ని వాయువూ, స్తనాల్ని అశ్వనీదేవతలూ, ధరించిన వస్త్రాన్ని బృహస్పతీ, వెనుకభాగాన్ని విశ్వదేవతలూ రక్షించవలసిందని ప్రార్థిస్తున్నాను".

"ఓ వధూ, ఈ రాతి మీద పాదం పెట్టు. నీవు కూడా ఈ రాయిలాగే శాశ్వతంగా ఉంటావు. యుద్ధం చేసేవారిని ఎదుర్కొని యుద్ధం చెయ్యి".

'ఓ వధూ, వరుణ దేవుడు నిన్ను బంధించిన పాశాన్ని విడిపిస్తున్నట్లుగా ఈ దర్భతాడుని విప్పుతున్నాను".

"అత్తమామల పైనా, ఆడబిడ్డల పైనా, బావమరదుల పైనా ప్రేమగా ఉండు. నీవు నావలన పోషింపబడుతూ, నాయందు నిశ్చలమైన భక్తితో ఉండు. బృహస్పతి నిన్ను నా కొరకు ఇచ్చాడు కనుక, నావల్ల సంతానాన్ని పొంది నూరేళ్ల జీవించు" అని చెప్పి వరుడు ఇలా ప్రార్థిస్తాడు.

"కశ్యపుడు మొదలైన ఏడుగురు మునులూ తమ ఏడుగురు భార్యలలో అరుంధతీదేవి అగ్రగణ్యురాలనీ, మనస్సులోనైనా వ్యభిచరించే గుణంలేని నిశ్చల మనస్సుకలది అనీ భావించేవారు. అందువల్ల అరుంధతిని తక్కిన ఆరుగురు స్త్రీలూ

తమలో అగ్రగణ్యురాలని భావించారు. ఇప్పుడీ వధువు ఆ ఏడుగురి తరువాత ఎనిమిదవదిగా పవిత్రమైనదిగా ఎంచాము కాబట్టి ఈమె వృద్ధి పొందుగాక!"

ఇదంతా హిందూ సంప్రదాయం ప్రకారం చెప్పే కొన్ని వివాహమంత్రాల తాత్పర్యం. అయితే, ఆచరణలో వివిధ ప్రాంతాల్లో వివాహ కార్యక్రమంలో వైవిధ్యం కనిపిస్తుంది. తక్కిన మతాలవారు వారి సంప్రదాయాల ప్రకారం ఏమేం చెబుతారో మరి?!

(ఉదయం నవతరం వారపత్రిక, 15-7-90)



# తోచక పోవడం

ఒకరి కొచ్చింది, ఇద్దరికొచ్చింది, అర్ధరాత్రివేళ ఇంటిల్లిపాదికీ వచ్చిందని నిద్రగురించి పొడుపుకథ చెప్పినట్లు, "తోచకపోవడం" అనేదికూడా లోకానుభవం. ఆడవాళ్ళు, మగవాళ్ళు, పిల్లలు, వృద్ధులు-అందరూ అంటూ ఉంటారు "తోచడం లేదు" అని.

మనిషికి ఒంటరిగా ఉంటే తోచదు. మరో మనిషి తోడుకోసం తహతహ లాడతాడు. మనిషికి ఏదైనా వ్యాపకం లేకపోతే తోచదు. ఒకేరకం వ్యాపకం ఉన్నా తోచదు. ఆ వ్యాపకంలో ఏదో మార్పుగాని, మరో వ్యాపకంగాని ఉంటే తప్ప తోచదు. ఒకేచోట ఉంటే తోచదు. మరో చోటికి పోతేనేగాని తోచదు.

మనిషికి తోడు ఉంటే తోచకపోవడం ఉంటుందా అనుకుంటే పొరపాటే. ఉన్నతోడు నచ్చకపోయినా తోచదు. నచ్చినా, ఇద్దరికీ కలిసి తోచదు. ఇద్దరూ కలిసి రోజంతా ఇంట్లో కూర్చుంటే తోచదు. ఇద్దరూ కలిసి ఎక్కడికైనా వెళ్ళా లనుకుంటారు. లేకుంటే, మూడో మనిషి ఎవరైనా వస్తే తోస్తుందనుకుంటారు. మూడోమనిషి వస్తే, మళ్ళీ వెళ్లేవరకూ తోచదు.

పుస్తకాలు లేకపోతే తోచదు. రేడియో లేకపోతే తోచదు. రేడియో ఉంటే టి.వి. లేకపోతే తోచదు. టి.వి. ఉన్నా సినిమాహాలుకి వెళ్ళి కొత్తసినిమా చూడక పోతే తోచదు. డబ్బుంటే వి.సి.ఆర్. లేకపోతే తోచదు. కొందరికి టెలిఫోన్ లేక పోతే తోచదు. కొందరికి మందుంటేనేగాని తోచదు మందుతోబాటు మనుషులుంటే గాని తోచదు పత్రికలుంటేగాని తోచదు. పత్రికలు చదువుతూన్నప్పుడు ఏ జంతికలో వక్కపొడో నములుతూంటేగాని తోచదు.

ఇంట్లో పిల్లలు లేకపోతే తోచదు. ఉంటే, పిల్లల్ని ఎవరిమీదనో వదిలేసి, ఎక్కడికైనా వెడితేగాని తోచదు. సెలవురోజున తల్లిదండ్రులకీ, పిల్లలకీకూడా తోచదు. అందులో ఎవరో వొకరు తమ అభిరుచిని బట్టి ఏ మూలో కూర్చుంటే తక్కిన వాళ్ళకి తోచదు. అందరూ కలిసి సినిమాకి వెళ్ళటమో, పేకాట ఆడటమో

చేస్తారు. ఇంట్లోవాళ్ళు తమలో తాము ఆడుకుంటే తోచదు. స్నేహితులతోనో, బంధువులతోనో కలిసి ఆడుకుంటే బాగుంటుందనుకుంటారు.

ఈ తోచకపోవడం ఒక వయస్సుకీ, ఒక సందర్భానికీ, ఒకళ్ళిద్దరికీ పరిమితమైందికాదు. ఇప్పటివాళ్ళకి ప్రతిదీ "బోర్"! ఏ పెళ్ళికయినా వెడితే ఆ పెళ్ళిలో జరిగే అన్నిరకాల తంతులూ అందరికీ ఇష్టం ఉండదు. ఆ తంతులో పాల్గొనటం నచ్చని వాళ్ళకి ఏం చెయ్యాలో తోచదు. ఎవరైనా తెలిసినవాళ్ళుగాని, మనసుకి నచ్చినవాళ్ళుగాని ఉంటే వాళ్ళతో కలిసి వేరే ఏదైనా వినోద కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకుంటేనేగాని తోచదు

చిన్న వయస్సులో ఆటలు, స్కూల్లో చదువు, పెద్దయాక పెద్దచదువులు, స్నేహితులు, ఆటలు, నాటకాలు, సినిమాలు, ఉద్యోగం, వివాహం, పార్టీలు, పండుగలు, పేరంటాలు, పిల్లలు, పిల్లల పెళ్ళిళ్ళు, వాళ్ళ పురుళ్ళు, మనవలతో ఆటలు, పాటలు, క్లబ్బులు, సంఘాలు- ఇలా ఎన్నిటితోనో కాలక్షేపం అవుతుంది. జీవితంలో అడుగడుగునా తోచడం లేదని అనిపించటం, తోచడంకోసం బంధాలనూ, అనుబంధాలనూ విస్తృతం చేసుకోవటం, తద్వారా నూతన సమస్యల్ని సృష్టించుకోవటం, ఆ సమస్యల్ని పరిష్కరించుకోవటానికి నూతన మార్గాల్ని అన్వేషించటం, సాధించటం జరుగుతూ ఉంటుంది. ఆట విడుపు అనేది లేకుండా సమయం గడుస్తుంది.

వృద్ధాప్యంలో అన్ని శక్తులూ ఒక్కొక్కటే ఉడిగిపోయాక ఒంటరితనం ఒక్కటే మిగులుతుంది. ఒంటరితనంలో తోచకపోవడం అనేది ఇంతింతై బ్రహ్మాండంబంతై అన్నట్లుగా మనిషిని ఆవహిస్తుంది గతస్మృతులు ఒంటరితనం అనే గాయం మీద ఈగల్లా ముసిరి మనిషిని మరింత బాధపెడతాయి. పూర్వం తాతయ్యల దగ్గరికీ, బామ్మల దగ్గరికీ చిన్నవాళ్ళు కథలకోసం, కబుర్లకోసం వెళ్ళేవారు ఇప్పుడు చిన్నపిల్లల అభిరుచులకీ తాతయ్యలు, బామ్మల అభిరుచులకీ పొంతన కుదరక వృద్ధాప్యంలో ఆశించిన ఆసరా దొరకదు. ఇంట్లో పనులతోను, బయట ఉద్యోగాలతోనూ హడావిడిగా తిరిగే మధ్యవయస్సు వాళ్ళకి వృద్ధులతో కలిసి కాలక్షేపం చేసే తీరిక, ఇచ్ఛ ఉండదు. ఇక ఒంటరితనంలో వృద్ధులు శారీరక అశక్తతకన్న మానసిక బలహీనతతోనే బాధపడుతూ ఉంటారు. వారి 'తోచకపోవడాని'కి మందు దొరకదు. అదే వారికి క్రమంగా జీవితంమీద నిస్పృహ, నిరాశ కలిగిస్తుంది.

ఈ 'తోచకపోవడం' అనేదే లేకపోతే మనిషి అనాదినుంచి యీ నాటిదాకా ఏదీ సాధించలేకపోయి ఉండేవాడేమో- సాంకేతికంగా, సాంస్కృతికంగా పురోగమించ లేకపోయి ఉండేవాడేమో.

కాని, ఎన్ని సాధించినా అనుక్షణం ఒంటరితనం మనిషిని నీడలా వెన్నాడుతూనే ఉంటుంది. దాన్ని అధిగమించటానికే యీ ఆధునిక పరికరాలు, సంసార బంధాలు, వినోద కార్యక్రమాలు, విజ్ఞాన ప్రక్రియలు ! ఎన్నిటి ఆసరా తీసుకున్నా మనసుని ఒంటరి తనం భయపెడుతూనే ఉంటుంది. మనిషి తననుండి తాను పారిపోవటానికే నిత్యం ప్రయాస పడుతున్నట్లు తోస్తుంది. ఒంటరితనం అంటే భయపడటం మానేసి, ఏకాంతంలోని ప్రశాంతతని గ్రహించ గలిగితే యీ తోచకపోవడం అనే భావం అంతగా వేధించకపోవచ్చు. ఇది చిన్నతనం నుంచీ అలవరచుకుంటే వృద్ధాప్యంలో అంతగా బాధించకపోవచ్చు.

(ఆదివారం ఆంధ్రజ్యోతి, జనవరి 25' 1987)

———

# ప్రేమించడం ఎలా?

'అమ్మ' తరవాత అమ్మంత ఆకర్షణీయమైన, అనువైన పదం 'ప్రేమ' ఒక్కటే అనిపిస్తుంది. తల్లి ప్రేమ తరవాతే ఏ ప్రేమ అయినా అంటారు. అంత ప్రేమగా పెంచే తల్లి కూడా "నేను ఇంతగా ప్రేమిస్తున్నాను, అంతగా ప్రేమించాను. కాని వాళ్ళు నన్ను ఎందుకు ప్రేమగా చూసుకోరు, నన్నెందుకు లక్ష్యపెట్టరు?" అని ఆక్రోశిస్తుంది వృద్ధాప్యంలో.

కొందరు ఎందుకు ప్రేమించగలుగుతారు, కొందరు ఎందుకు ప్రేమించలేకపోతారు– అనే ప్రశ్నలకు ఎన్ని రకాలుగా సమాధానాలు చెప్పుకున్నప్పటికీ ప్రేమించడం అందరికీ సులభ సాధ్యంకాదు. ప్రేమ అనే పదానికి ఎన్ని నిర్వచనాలిచ్చినా ప్రేమించడం అంత సులభం కాదు.

రక్త సంబంధం ఉన్న వాళ్ళ మీదే ప్రేమ ఉంటుంది అనుకోవడం పూర్తిగా నిజంకాదు. అదే నిజమైతే మన రక్తాన్ని పీల్చి బ్రతికే దోమల మీద మనకి ప్రేమ ఉండాలి కాని, మన రక్త బిందువులో ఒక్క అణుమాత్రం పీల్చినా, తక్షణం ఆ దోమని అరచేత్తో ఒక్క చరుపు చరిచి దాని అంతు చూస్తాం. రక్త సంబంధం ఉన్న బంధువులందరినీ సమానంగా ప్రేమించలేం. అంటే ప్రేమలో కూడా హెచ్చు తగ్గులుంటాయనే కదా అర్థం. ఎవరిని ఎంతలో ఉంచాలో అంతలో ఉంచినట్లు, ప్రతి ఒక్కరినీ తూచి తూచి ప్రేమిస్తాం. 'నా అత్యంత ప్రియమైన భార్యకి' అని ఎవరో అపురూపంగా రాసిన మొదటి ఉత్తరానికి భార్య తన సమాధానంలో 'ఆ తక్కిన వాళ్లెవరు' అని అడిగిందట. అంటే, 'ప్రియమైన భార్య', 'అతి ప్రియమైన భార్య' కూడా ఉండి ఉంటారని ఆవిడకి అనుమానం!

'నిష్కల్మషమైన ప్రేమ' అని వాడుతూ ఉంటాం. అంటే ప్రేమలో కల్మషం, కల్తీ ఉంటాయనే కదా దాని భావం. ఫలానా వారి ప్రేమ నిష్కల్మషమైనది అని ప్రత్యేకంగా చెబుతున్నామంటే, నిష్కల్మషమైన ప్రేమ అరుదైనదని

అర్థమవుతుంది. ప్రేమలో కర్త ఎలా ఏర్పడుతుంది? ప్రేమలో కలగాపులగంగా స్వార్థం, అసూయ, అహంకారం మొదలైన మానవ దుర్లక్షణాలన్నీ ఉంటాయి. కొన్ని పైకి కనిపిస్తాయి. కొన్ని కనిపించవు. కొన్ని పైకి కనిపించినా, వాటిని సమర్థించు కుంటాం.

ప్రేమిస్తున్నామంటే సరిపోదు. ప్రేమకి నిదర్శనం కావాలనుకుంటాం. మనం ప్రేమిస్తున్నవారికి ఇష్టమైనవి వండి పెడతాం, కొని పెడతాం. పుట్టిన రోజు గుర్తు పెట్టుకుని ఏవైనా బహుమతులిస్తూ ఉంటాం. మనం ప్రేమిస్తున్న వారితో స్నేహ పూర్వకంగా, సరళంగా, మృదువుగా మాట్లాడుతాం. వాళ్ళు కష్టాల్లో ఉన్నప్పుడు ఆదుకుంటాం. మనల్ని ప్రేమించే వాళ్ళు కూడా అలాగే ప్రవర్తించాలని ఆపేక్షిస్తాం. మన మంటే నిర్లక్ష్యం చూపించే వాళ్ళకి మన మీద ప్రేమ ఉందంటే నమ్మ బుద్ధి కాదు. మనల్ని తిట్టి కొట్టే వాళ్ళకి మన మీద ప్రేమ ఉందంటే ఒప్పుకోము. చివరికి తల్లి తండ్రులైనా సరే, నిత్యం పిల్లల్ని తిట్టి, కొడుతూంటే వారిమీద విముఖత పెరుగుతుంది పిల్లలికి. ఏదో విసుగొచ్చి తిట్టి, కొడితే మాత్రం తల్లి దండ్రులికి పిల్లల మీద ప్రేమ ఉండదా అంటారు. ఆ విషయం కొందరు పిల్లలు పెద్దయాక అర్థంచేసుకోగలుగుతారు. కాని కొంత మంది పిల్లలికి తల్లి తండ్రుల కఠిన ప్రవర్తన మనస్సులో నాటుకు పోయి, పెద్దయిన తరవాత కూడా తల్లిదండ్రులు తమను చిన్నప్పుడు సరిగ్గా ప్రేమగా చూడలేదనే భావం మనసులో ములుకులా గుచ్చుకుంటూ ఉంటుంది.

అలాగే భార్యాభర్తలు కూడా నిత్యం తమ ప్రేమను మాటల ద్వారా, చేష్టల ద్వారా ప్రదర్శించాలనుకుంటారు ఒకరికిష్టమైనట్లు మరొకరు ప్రవర్తించక పోతే ఎదుటి వారికి తమ పైన ప్రేమ, గౌరవం లేవనుకుంటారు. ఈ ప్రేమ ప్రదర్శించడంలో ఎదుటివారి కిష్టమైన పనులు చెయ్యడమే కాక, ఎదుటి వారి కిష్టం లేని పనులు చెయ్యకుండా ఉండటం కూడా ఒక భాగమవుతుంది.

ఈ ఇష్టం లేని వాటిలో ఇంకొకరి మీద ప్రేమ చూపించడం ముఖ్యమైనది. తన తల్లి ఇంకొకరి పిల్లని ప్రేమించడం పిల్లలు సహించలేరు. మరొక తల్లి పిల్లల్నే గాక, తన చెల్లినో తమ్ముడినో ప్రేమించడం కూడా సహించలేరు కొందరు పిల్లలు. అలాగే భార్యా భర్తలు కూడా పరస్పరంగానే తప్ప, పరులను ప్రేమించడం సహించరు.

ప్రేమ గుడ్డిది అంటారు. యుక్తాయుక్త విచక్షణ లేకుండా యుక్త వయసులో ప్రేమలో పడే వాళ్ళ గురించి అంటూ ఉంటారు ఇలా. ఒకతను ఎవరో కర్ణకఠోరంగా ఉండే కంఠ స్వరం ఉన్న అమ్మాయిని ప్రేమించాడుట. అది చూసి అనుకున్నారట- ప్రేమ గుడ్డిదే కాదు, చెవిటిది కూడా అని. ప్రేమించడం తప్పు అని అనరు పాపం పెద్ద వాళ్ళు. ఎటొచ్చీ, ప్రేమించే ముందు ఆ వ్యక్తి హిందువా. ముస్లిమా, క్రిష్టియనా, మన కులం అవునా కాదా, రక్తసంబంధం ఉన్నదాలేదా, డబ్బున్నదా లేదా, అందం ఉన్నదా లేదా, మంచి, మర్యాద ఉన్నవా లేవా, తెలివి తేటలున్నవా లేవా, ఆరోగ్యం ఉన్నదా లేదా, నలుపు, తెలుపు, పొడుగు, పొట్టి, లావు, సన్నం- ఇలా సవాలక్ష విషయాలు ఆలోచించి మరీ ప్రేమించాలంటారు.

పెళ్ళి సంబంధం విషయంలో మన వాళ్ళు ముందుగా ఇవన్నీ ఆలోచిస్తారు. వివాహం విషయంలో ముందుగా ప్రేమ ప్రస్తావన ఉండదు. పెళ్ళయిన తరవాత వాళ్ళే ప్రేమించుకుంటారు. ఎవరికోసం ప్రేమించుకుంటారు. చచ్చినట్లు ప్రేమించుకుంటారు. ప్రేమించడం కూడా ఓ గొప్ప పనేనా అన్నట్లుగా ఉంటారు. ఇహ అత్తవారింట్లో వాళ్ళని ప్రేమించగలగడం గొప్ప సంగతే తల్లి తండ్రుల్నీ, సొంత అక్క చెల్లెళ్ళనీ, అన్న దమ్ముల్నీ ప్రేమించినట్లు అత్తవారింట్లో వాళ్ళని ప్రేమించలేరు. పరాయి వాళ్ళని ప్రేమించలేక పోవడం చిన్న తనం నుంచే అలవడుతుంది కొందరికీ. కొంత వరకు పెద్ద వాళ్ళని చూసి చిన్న వాళ్ళు నేర్చుకుంటారు ప్రేమించినట్లు కనిపిస్తే పిల్లలైనా పెద్దలైనా నెత్తికెక్కుతారని అయిన వాళ్ళని కూడా ప్రేమించనట్లు ప్రవర్తిస్తారు కొందరు. బంధు మిత్రులందరితో ప్రేమగా ఉండాలంటే ఒక్కొక్కప్పుడు మనకొచ్చే ఆదాయం చాలదు! అందుకే ప్రేమని అదుపులో పెట్టుకుంటారు కొందరు. ప్రేమించడానికి కూడా పరిస్థితులు అనుకూలించాలి.

ఒక్కొక్కప్పుడు ఎదుటివాళ్ళు ప్రేమిస్తున్నారనుకుని వాళ్ళని ప్రేమించి మోసపోవడం జరుగుతూ ఉంటుంది. పిల్లి మన కాళ్ళకి రాసుకుంటూ మన చుట్టూ తిరగ్గానే అది మన మీద ప్రేమ చూపిస్తోందనుకుని ముద్దొచ్చి అమాంతం దాన్ని చేతుల్లోకి తీసుకుని దాని ఒళ్ళు నిమరబోతే, అది గింజుకుని మన చేతుల్ని గోళ్లతో రక్కి ఒక్క దూకు దూకుతుంది క్రిందికి. ఎదుటి వారి అంతర్యాన్ని తెలుసుకోకుండా ప్రేమిస్తే ఇటువంటి అనుభవం అవుతూ ఉంటుంది. శరీరానికి, మనసుకి

గాయాలు తగుల్తాయి. కొందరి ప్రేమ లతలా పెనవేసుకుని ఊపిరి సలపనివ్వదు. కొందరి ప్రేమ పాశంలా తగులుకుని ప్రాణాలు తీసేటంత పని చేస్తుంది

ప్రేమించడం ప్రేమించబడటం కూడా సులభం కాదు. ప్రేమించాలంటే ఎదుటివారు ఎలాంటి వారైనా, వారి లోపాలను పట్టించు కోకుండా ప్రేమించగల గాలి. ప్రేమించబడాలంటే కోపం, అసూయ, దురాశ మొదలైన లక్షణాలు లేకుండా ఉండాలి. దయ, సానుభూతి, ఔదార్యం, స్నేహం చూపించాలి. మన ప్రవర్తనలో ఎటుచూసినా, స్వార్థాన్ని త్యాగం చెయ్యడం తప్పని సరి అవుతుంది ఈ లెక్కని. ఎంత మందిని ప్రేమించగలం? ఎంత మంది ప్రేమని పొందగలం? ఎవరి మటుకు వారు తమ స్వార్థాన్ని ఎవరి కోసం ఎంతవరకు వదులుకోవచ్చునో అంతరాంతరాల్లో బేరీజు వేసుకుని అంతంత మాత్రంగా ప్రేమిస్తారు.

అనాలోచితంగా ప్రేమించగలగడం ఒక కళ.

(ఆదివారం ఆంధ్రజ్యోతి, ఫిబ్రవరి 14,1988)

——

# స్వేచ్ఛ-సమస్య-మనిషి

**తల్లి**తండ్రుల ఆధీనంలో ఉన్నప్పుడు పిల్లలు స్వేచ్ఛలేదనుకుంటారు. భర్త ఆధీనంలో ఉన్న భార్య స్వేచ్ఛలేదనుకుంటుంది. పిల్లలు పెద్దవాళ్లయాక వాళ్లమీద ఆధారపడిన తల్లితండ్రులు కూడా తమకు స్వేచ్ఛ లేదనుకుంటారు. వారి ఆధీనంలోంచి బయటపడితే అంతా స్వేచ్ఛేననుకుంటారు. ఆర్థిక స్వాతంత్ర్యమే కాదు, భావ స్వాతంత్ర్యాన్ని కూడా కోల్పోయినట్లు బాధపడతారు. ఆర్థికస్తోమత ఉంటే మనిషికి స్వేచ్ఛ లభించిందని భావిస్తారు.

అసలు 'స్వేచ్ఛ' అంటే ఏమిటి? ఎవరి ఇష్టం వచ్చిన రీతిని వారు ప్రవర్తించగలగటమే స్వేచ్ఛ అనుకోవాలా? అదే నిర్వచనమయితే, అటువంటి స్వేచ్ఛను అనుభవించే స్వేచ్ఛాజీవి ఎవరైనా ఉన్నారా అన్న సంశయం కలుగుతుంది. మనిషి సంఘజీవి. నలుగురితో కలిసి మెలిసి బ్రతకవలసిన మనిషి. ఒకరిమీద ఒకరు ఏదో ఒక విధంగా ఆధారపడి జీవనం సాగించక తప్పదు. బంధువులైనా సరే, స్నేహితులైనా సరే, అధికారులైనా సరే– ఒకరి మీద ఒకరు ఆధారపడకుండా, ఒకరి సహాయం మరొకరికి లేకుండా పనులుసాగవు. పని మనిషి ఒక్కపూట రాకపోతే ఇల్లాలు గిలగిల్లాడిపోతుంది. దాన్ని తిట్టుకుంటూనే దానికి పాతచీరలిచ్చీ, ఊరగాయలిచ్చీ, అన్నంపెట్టీ ఆకట్టుకుంటుంది. ఆఫీసులో టైపిస్టు రాకపోతే ఆఫీసరుగారి ఆటకట్టు. ప్యూన్ చెప్పినమాట వినకుండా మొరాయించే రకమైతే ఇక ఆ ఆఫీసరు గౌరవం ఏం నిలబడుతుంది? అందరి మనస్తత్వాలూ గ్రహించి, వారిని మంచి చేసుకుని వారివల్ల పనులు చేయించగలిగితేనే ఆఫీసరు ప్రజ్ఞ బయటపడుతుంది. అలాగే, తల్లిదండ్రుల మనస్తత్వాన్ని గ్రహించి పిల్లలూ, పిల్లల మనస్సుని తెలుసుకొని తల్లిదండ్రులూ ఒకరికి అనుగుణంగా మరొకరు నడుచుకుంటేనే మనశ్శాంతి, ఆనందం పొందటం సాధ్యమవుతుంది.

ఎదుటివారి మనస్తత్వాన్ని అసహ్యించుకుంటూ, వారిబారినుండెలా తప్పించుకుందామా అని ఆలోచించే వారికి మనస్తాపమే మిగులుతుంది గాని కించిత్తు ఆనందం లభించదు. ఎదుటివారికి అనుగుణంగా నడుచుకోవాలంటే మన అభి

ప్రాయాలను కొంతవరకు విస్మరించాలి. స్వార్థాన్ని కొంతవరకు త్యాగంచెయ్యాలి. అంటే కొంత 'స్వేచ్ఛ' పోగొట్టుకున్నట్లే కదా. ఆ 'స్వేచ్ఛ'ను త్యాగం చెయ్యటం వల్లనే మనకు మానసికానందం (ఆనందం, దుఃఖం వంటివి అన్నీ మానసికమే) లభిస్తుందని గ్రహించినప్పుడు మనం ఒకరి ఆధీనంలో ఉన్నామన్న భావం గాని, మనకు సేచ్ఛ లేదన్న ఊహగాని అంతగా బాధించవు.

చెప్పటం సులభం, అనుభవించడం కష్టం. నిజమే. కాని, మనం అనేక సందర్భాల్లో ఇతరులతో ప్రమేయంలేకుండానే స్వేచ్ఛను ఎలా చేజేతులా పోగొట్టుకుంటున్నామో ఆలోచించి చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. మనం కావాలనే ఇతరులకు బందీలవుతున్నామా అనిపిస్తుంది. కొత్త బట్టలు కొనుక్కుంటాం. కొనుక్కునేటప్పుడు నచ్చినవి కొనుక్కుంటాం. కాని వాటిని కట్టుకున్నాక అద్దంలో చూసుకుని మనం అందంగా ఉన్నామని మురిసిపోయి, అంతటితో తృప్తిపడి ఊరుకోము. అందరూ ఈ కొత్త బట్టలు చూడాలి. వాటినీ, వాటిల్లో ఉన్న మనల్నీ మెచ్చుకోవాలనిఆశిస్తాం. మెచ్చుకున్న వాళ్ళని మంచివాళ్ళనుకుంటాం. మెచ్చుకోనివాళ్ళని రసికత లేదనో, గర్వం ఉందనో, కుళ్ళుబోతుతనం అనో అనుకుంటాం. వాళ్ళు మెచ్చుకుంటే మనకు ఆనందం. లేకుంటే కోపం, అసంతృప్తి, దుఃఖం. అంటే మన ఆనందం వాళ్ళమీద ఆధారపడిఉందన్నమాటే కదా. మన ఆనందం ఒకరి ఆధీనంలో ఉన్నంతకాలం దాన్ని అనుభవించే స్వేచ్ఛ మనకు లేనట్లే.

అవకాశాలు ఉన్నా, అసలు స్వేచ్ఛగా బ్రతకటం మనకి తెలుసునా అని అనుమానం కలుగుతుంది. మనచుట్టూ ఉన్న సమాజం గాని, మనమీద అధికారం ఉన్న వాళ్ళుగాని మనల్ని కొన్ని కట్టుబాట్లకి గురిచేసి మనస్వేచ్ఛకి అవరోధాలు కల్పించటం మామూలే. కాని, మన స్వేచ్ఛకి మనమే అవరోధాలు కల్పించుకోవటం ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఉదాహరణకి, ఎవరికైనా జుట్టు నెరిసిపోతే చాలాబాధపడిపోతారు. అద్దంలో ముఖం చూసుకున్నప్పుడల్లా మనస్సు కుంచించుకుపోతుంది. తలకి రంగువేసుకుని తమ పూర్వపు అందాన్ని తెప్పించుకుంటే తప్ప మనస్సు స్థిమితంగా ఉండదు. ఇక, రంగు మొదలు పెట్టినప్పటినుంచీ వాళ్ల జీవితాంతం ఆ రంగుకి బానిసలేకదా! మనగురించి మనం కల్పించుకున్న రూపం ఎప్పటికప్పుడు ఆదేశించి మనల్ని అదుపులో ఉంచుతుంది. నిజానికి మన ఊహలకే మనం బానిసలం.

ఉన్న పరిస్థితులతో ఏ మనిషీ తృప్తిపడడు. ఉన్నదాన్ని మెరుగుపరుచుకోవాలనీ, భవిష్యత్తులో ఇంతకన్న మెరుగైన పరిస్థితులు ఏర్పడతాయనీ, అప్పుడు ఇంతకన్న సుఖపడవచ్చుననీ ఆలోచిస్తూ, ఆశిస్తూ, ఉన్న పరిస్థితులలోంచి ఎప్పుడు బయటపడతామా అని తపిస్తూ, ఆ పరిస్థితులను మార్చడానికి అనుక్షణం శ్రమిస్తూ ఉంటాడు.

అంతేకాదు. మనం గతాన్ని తలుచుకుంటూ కాలం గడుపుతాం. కొన్ని అయిష్టమైనవీ, దుఃఖభాజమైనవీ ఉంటాయి గతస్మృతులలో. వాటినుంచి తప్పించుకోలేము. గతానుభవాలను స్మరించకుండా ఉండలేము. వాటినుంచి స్వేచ్ఛను పొందలేము. ప్రేమ, భయం, కోపం, అసూయ, అవమానం, దుఃఖం, సుఖం ఇటువంటి అనుభూతుల ఆలవాలమే మనస్సు. ఆ అనుభూతులను ఉద్భవింపచేసేదీ మనస్సే వాటిని పదిలపరచుకుని, వాటి నిర్బంధంలో చిక్కుకుని బయటపడాలని తాపత్రయ పడేదీ మనస్సే. మనిషికి స్వేచ్ఛ అంటే ఏమిటో తెలియజెప్పేదీ మనస్సే. స్వేచ్ఛలేకుండా చేసేదీ మనస్సే. ఈ సంఘర్షణలో చిక్కుకున్న మనిషి స్వేచ్ఛాజీవి ఎలా అవుతాడు?

(ఉదయం, మార్చి 6, 1987)

—:o:—

ఈ సందేశాన్ని అందించడానికి 1929 నుండి 1986 వరకూ దాదాపు అరవై సంవత్సరాల పాటు అనేకదేశాలు పర్యటించి అనేక ప్రసంగాలు చేశారు. జీవితంలో మానవులు ఎదుర్కొనే సమస్యలన్నిటినీ చర్చించారు. జీవించడమే లక్ష్యమనీ, ఎలా జీవించాలో జీవితం నుంచే నేర్చుకోవాలనీ, గురువుల నుంచీ మతాల నుంచీ కాదనీ విశదపరచారు.

కృష్ణమూర్తిగారు సంసార తాపత్రయాలు లేకుండా, ఈతి బాధలు లేకుండా, స్వార్థరహితంగా జీవించారు. ఇది సామాన్యులకెలా సాధ్యమవుతుంది- అనుకుంటాం. ఆయన అసామాన్యుడు, విచిత్ర వ్యక్తి-నిజమేనని ఆయనకి తెలుసు. తలుచుకుంటే ఎవరైనా ఆయనవలె అసామాన్య వ్యక్తి కావచ్చునని ఆయన విశ్వాసం. ఆయన ప్రబోధాలలోని అంతర్యం అదే- మానవ ప్రవర్తనలో పరివర్తన రావాలన్నది—అంటే మామూలుజీవనవిధానంలో మార్పు రావాలనీ, సంఘర్షణ, క్రౌర్యం, తృష్ణ, దురాశ, ద్వేషం మొదలైన లక్షణాలను వదులుకుంటే మన ప్రవర్తనలో మూల పరివర్తన వస్తుందనీ, ఒక నూతన మేధస్సు మేల్కొంటుందనీ, జీవితాన్ని శాంతిమయం చేస్తుందనీ ఆయన బోధించారు.

అనాదిగా మానవ ప్రవృత్తిలో మార్పు లేనప్పుడు ఆలోచనల్లో కూడా మార్పు ఉండదు. మానవులు సాంకేతికంగా, వైజ్ఞానికంగా అభ్యుదయం సాధించి ఉండవచ్చు. కాని మానవ లక్షణాల్లో, ప్రవర్తనలో ఏవిధమైన మార్పూ రాలేదనీ, అందువల్లనే మన జీవితాలు దుఃఖ భూయిష్టంగా, సంఘర్షణ మయంగా ఉంటున్నాయనీ అవగాహన చేసుకోమని చెప్పారు కృష్ణమూర్తిగారు. మన జీవితాలు దుఃఖభూయిష్టం కాకుండా చేసుకోవడం మన చేతుల్లోనే ఉన్నదనీ, ఎవరి ఉపదేశంలోనూ ఉండదనీ, ఎవరి మనసుని వారు అవగాహన చేసుకుని ఆత్మజ్ఞానాన్ని అలవరచుకోవాలన్నారాయన.

కృష్ణమూర్తిగారు సర్వ ఆధ్యాత్మిక సూత్రాలనూ ఖండించారు. ఆయన చెప్పినది - ధ్యానం చేసుకోవడమంటే పద్మాసనం వేసుకూర్చుని ఏదో నామాన్నిగాని, మంత్రాన్ని గాని గ్రామఫోను రికార్డులా పదే పదే వల్లించడం కాదు; అనుక్షణం మన మనసులో వచ్చేపోయే ఆలోచనలను శ్రద్ధగా గమనించడమే. దీనివల్ల ప్రయోజనం ఏమిటి అనుకుంటాం. కాని, మన మనసులో ఆలోచనల సంఖ్యను మనం లెక్కపెట్టలేము. మనోవేగాన్ని మించిన వేగం

లేదంటారు. అయితే, మాట్లాడేటప్పుడు గాని, రాసేటప్పుడుగాని మనసులోని ఆలోచనలను యథాతథంగా వ్యక్తం చెయ్యం. అంటే, కొన్నిటిని సవ్యమైనవి కావని వదిలేస్తాం.

మన మనసులో మెదిలే భావాలన్నిటినీ ఎప్పటికప్పుడు శ్రద్ధగా గమనిస్తే మన మనస్సేమిటో, మన ప్రవర్తనని పురికొల్పే ఆలోచన లెటువంటివో తేట తెల్లమవుతుంది. అదే ఆత్మజ్ఞానం అంటే. దీని కొరకు అస్తవ్యస్తంగా ఉండే మన కలలను, మనకే నచ్చని మన ఆలోచనలను, మన ప్రవర్తననీ వ్యాఖ్యా నించి, మన అంతరంగంలో ఏమున్నదో విప్పిచెప్పమని ఏ సైకియాట్రిస్ట్ వద్దకూ వెళ్లనవసరం లేదు. మనశ్శాంతిని ప్రసాదించే మంత్రోపదేశం చెయ్యమని ఏ మతగురువు వద్దకూ వెళ్లనవసరం లేదు. నిశ్శబ్దంగా, నిశితంగా గమనిస్తు న్నప్పుడు మన ఆలోచనల ప్రవాహం తగ్గుతుంది. ఆలోచనలు ఆగిపోతాయి. ఆ నిశ్శబ్ద, శూన్య స్థితిలోనే వివేకం ఉదయిస్తుంది-అని ఉద్బోధించారు.

అనుక్షణం మనసులో మెదిలే ఆలోచనలను శ్రద్ధగా గమనిస్తూ జీవించ డమే క్షణక్షణం జీవించడం. అప్పుడు జీవితంలో ప్రతిక్షణం అమూల్యమైన దవుతుంది. చనిపోయేముందు కొందరికి తాము చేసిన పనులకు పశ్చాత్తాపం కలుగుతుంది. కొందరు దానధర్మాలు చేస్తారు. జీవితంలో క్షణం తరవాత క్షణం గతిస్తూ ఉంటుంది. అంటే క్షణక్షణం మరణాన్ని ఎదుర్కొంటున్నాం. అందుకే అనుక్షణం మంచి మనిషిగా జీవించడం తెలుసుకోవాలన్నారాయన. జీవితంలో ప్రతిక్షణమూ మరణిస్తుందని తెలుసుకున్నవారికి ఆఖరున సంభవించే శారీరక మరణంవల్ల ఆశ్చర్యం, భయం, బాధ ఏవీ ఉండవన్నారాయన.

ప్రకృతినీ ప్రాణికోటినీ ప్రేమించడం తెలుసుకోవాలి, నిస్వార్థమైనది, నిష్కల్మషమైనది, అనాలోచితమైనదే ప్రేమ అన్నారాయన. సుఖం ఎక్కడో ఎందులోనో ఉందని వెతికి ప్రయోజనం లేదు. నీ సుఖం నీ మనసులోనే ఉందని తెలుసుకోమన్నారు కృష్ణమూర్తిగారు 'స్వేచ్ఛ' అనేది ఆర్థికంగా గాని, రాజ్యాంగం ద్వారా గాని లభించేది మాత్రమే కాదు. మానసిక స్వేచ్ఛయే నిజ మైన స్వేచ్ఛ; కోరికలు, ఆగ్రహావేశాలు, మొదలైన మానసిక బలహీనతలకు బానిసకాకుండా ఉన్నప్పుడే నిజమైన స్వేచ్ఛ లభిస్తుందన్నారు.

విప్లవం రావాలి, విప్లవం తేవాలి అంటూ రాజకీయవేత్తలు, సాహితీవేత్తలు సంఘ సంస్కర్తలూ ఘోషిస్తూ ఉంటారు. ప్రభుత్వం మారినందువల్లగాని,

హింసాకాండవల్లగాని, విప్లవం రాదనీ, మానవ ప్రవృత్తిలో, ప్రవర్తనలో, నిత్య జీవనంలో మార్పు రావాలనీ, విప్లవానికీ, శాంతియుత సమసమాజానికి అదొకటే మార్గమనీ ఉద్ఘాటించారాయన. మొత్తం సమాజాన్ని ఏదో ఒకరోజున మార్చ గలమనుకోవడం అవివేకం. సమాజం అంటే మీరూ, నేనూ, సమాజం నేను సృష్టించుకున్నదే. సమాజమంటే నేనే. నన్ను నేను మార్చుకుంటే ప్రపంచం లోనూ మార్పు వస్తుంది. ఆ విధంగా ఎవరికి వారు పరివర్తన చెందాలి. మన అహంభావాలూ, ఈర్ష్యలూ, కాంక్షలూ, కావేషాలూ, అలాగే ఉండాలి, సమాజం మారాలి, అందరం సమానం కావాలి అంటే విప్లవం ఎలా సాధ్యమౌతుంది_అని ప్రశ్నించారాయన.

'పోటీ'లు మనుషుల్లో అహంభావాన్నీ, విపరీతమైన కాంక్షనీ, ఈర్ష్యనీ పెంపొందించుతాయని ఆయన నమ్మకం. మన పిల్లల పెంపకం లోనూ, విద్యా విధానంలోనూ మార్పురావాలనీ, పిల్లలు పసితనం నుంచీ స్వార్థం, అసూయ, అహంభావం, క్రోధం మొదలైన లక్షణాలు లేకుండా నిర్మలమైన, పరిశుద్ధమైన, వాతావరణంలో పెరగాలనీ, విద్యా విధానం అందుకు అనుకూలంగా ఉండాలనీ, ముందుగా తల్లితండ్రులూ, ఉపాధ్యాయులూ అందుకు అనుకూలంగా మారాలనీ ఆయన అభిప్రాయం.

మనం నిత్యం కోరుకునే ప్రేమ, స్వేచ్ఛ, ఆనందం మనకెందువల్ల లభ్యం కావడం లేదు ? నిత్యం మనల్ని పీడించే భయాన్నీ. అసంతృప్తినీ, దుఃఖాన్నీ, మనం ఎందుకు తప్పించుకోలేకపోతున్నాం ? మనకి ఎన్ని ఉన్నా మనశ్శాంతి ఎందుకు కరువవుతోంది ? మనిషికీ మనిషికీ మధ్య సంఘర్షణ, దేశానికీ దేశానికీ మధ్య కలహం లేకుండా చెయ్యలేక పోవడానికి గల కారణం ఏమిటి ? ఇటువంటి ప్రాథమిక సమస్యలన్నిటి గురించీ కృష్ణమూర్తిగారు అనేక సభల్లో ప్రసం గించారు.

కృష్ణమూర్తిగారు అరవై సంవత్సరాలపాటు మానవ జీవితం మీద అనేక రకాలుగా వ్యాఖ్యానించారు. తన భావాలను సుస్పష్టం చెయ్యడానికి ఎన్నో రకాలుగా వ్యక్తం చేశారు. కృష్ణమూర్తిగారి జీవిత చరిత్రను రాస్తున్న మేరీ లుట్యెన్స్‌తో ఆయన తన 87వ ఏట- తను బోధించవలసినదింకా ఎంతో ఉన్న దనీ, ఇంకా అయిదు సంవత్సరాలైనా తను బ్రతకాలనీ అన్నారుట. అలా

అనడం 'వృద్ధాప్య లక్షణం' అని పరిహసించవచ్చు కొందరు. కానీ, కృష్ణమూర్తి గారు 1986 ఫిబ్రవరి ప్రారంభంలో, అడయారులో తన ప్రసంగాన్ని పూర్తి చేసిన తరువాత శ్రోతలనుద్దేశించి "ఇదే మన ఆఖరి సమావేశం కావచ్చును, ఇంకొంచెం సేపు మనందరం కలిసి నిశ్శబ్దంగా కూర్చుందామా" అని అడిగారని విన్నప్పుడు ఎంతటి కఠినాత్ములకైనా కళ్లు చెమ్మగిల్లక మానవు.

(జిడ్డు కృష్ణమూర్తి వర్ధంతి సందర్భంగా)

(ఉదయం, ఫిబ్రవరి 17, 1987)

---

# జీవితవ్యాఖ్యాత జిడ్డు కృష్ణమూర్తి

సభా వేదిక పైన చక్కగా పద్మాసనం వేసుకుని కూర్చుని ఆంగ్లంలో అనర్గళంగా వేదాంతోపన్యాసాలు చేసిన దివ్య సుందరమూర్తి జిడ్డు కృష్ణమూర్తి అని మాత్రమే అనుకుంటే అది సరియైన అవగాహన కాదు. ఆయన ఉపన్యాసాలు మేధావులను సమ్మోహన పరచేవి. చిరస్మరణీయమైనవి అని కానీ, ఆయన గ్రంథాలు వృద్ధాప్యంలో వ్యాపకానికి వినియోగపడేవి మాత్రమే అని కాని అనుకుంటే అది పొరపాటే.

నిత్య జీవితంలో ఆనందం ఎలా పొందవచ్చునో, ఎవరి సహాయమూ లేకుండా ఎవరికి వారు మధురమైన జీవితసారాన్ని ఎలా అస్వాదించవచ్చునో బోధించారు కృష్ణమూర్తిగారు తమ ఉపన్యాసాల్లో. గ్రంథాల్లో, పామరుల నుంచి మేధావుల వరకూ తమ జీవితల్లో తాము ఎదుర్కొంటున్న సమస్యల గురించి ప్రస్తావించి ఆయనతో చర్చించేవారు.

అందరిలాగా ఆయన జీవితాన్ని సంసార తాపత్రయంతో గడపకపోయినా, సామాన్య మానవుని సమస్య లన్నింటినీ ఆయన సంపూర్ణంగా అవగాహన చేసుకుని కూలంకషంగా చర్చించి, ఆ సమస్యలు ఎందుకు ఉత్పన్నమవుతున్నాయో విపులపరచేవారు.

సంసార తాపత్రయాలకు దూరంగా వుండే మనిషికి, సభా వేదిక పైన కూర్చుని ప్రసంగాలుచేసే మనిషికి సామాన్య మానవుని నిత్య జీవిత సమస్యలు ఎలా అర్థమవుతాయని ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. అందుకే ఆయన చెప్పే వేదాంతం కబుర్లన్నీ వినటానికే గాని ఆచరణకు ఎందుకూ పనికిరావని కొందరు అనుకుంటూ వుంటారు. ఒకాయన కృష్ణమూర్తి గారిని కుండబద్దలు కొట్టినట్టు అడిగాడు : "ఈ మనస్తత్వం గురించి, మనస్సు లోపల జరిగే కార్యకలాపాలగురించీ మాట్లాడినదంతా సమయం వృధా చేయడానికే, జనానికి కావలసింది పని, తిండి. మొట్టమొదట ఎదుర్కోవలసింది ఆర్థిక పరిస్థితి అని స్పష్టమైనప్పుడు, మీరు శ్రోతల్ని ప్రయత్నపూర్వకంగా పెడదారి పట్టించడం లేదా ?

మీరు చెప్పేదానికి ఆఖరున ప్రయోజనం వుంటే వుండొచ్చును. కాని, జనం మల మల మాడిపోతుంటే ఈ చెత్తంతా ఏం ప్రయోజనకరం?" అని. దీనికి కృష్ణమూర్తి గారు చెప్పిన సమాధానం "గడుపుకు పోవడానికి కడుపులో ఏదో కొంత పడా లన్నది నిజమే. కాని, అందరికీ తిండి దొరకాలంటే మన ఆలోచనా విధానంలోనే మూల పరివర్తన రావాలి. అందువల్లనే మానసిక రంగాన్ని ఎదుర్కోవడం ముఖ్యం" అని.

కృష్ణమూర్తి గారు విమానాల్లోనూ, కారుల్లోనూ ఎంతగా ప్రయాణం చేసే వారో అంతగా నడిచి వెడుతూ వుండేవారు. వీధుల్లోని బిచ్చగాళ్ళనూ, గ్రామాల్లోని బీద కుటుంబాలనూ, బజార్లలో తిరిగే రకరకాల జనాన్ని సూక్షంగా పరిశీలించే వారు వారి జీవన విధానాన్ని, వారి చిత్ర విచిత్ర చర్యల్ని పరిశీలించి, వారి మనస్తత్వాన్ని అవగాహన చేసుకునేవారు. ఒకసారి ఆయన చూసిన దాన్ని ఇలా రాశారు: "ఓ కుర్రావాడు పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడుస్తున్నాడు. నడుస్తూ పాడుతున్నాడు. దారిపొడుగునా ఎదురైన వాళ్ళందర్నీ చూసి చిరునవ్వు నవ్వుతున్నాడు. చాలా మంది స్నేహితులున్నట్టు కనిపిస్తోంది. ఒంటి మీద సరియైన దుస్తుల్లేవు. తలకి ఒక మాసిన గుడ్డ చుట్టుకున్నాడు. కాని, ముఖం కాంతివంతంగా వుంది, కళ్ళు మెరుస్తున్నాయి. టోపీ పెట్టుకున్న ఒక లావుపాటి ఆయన పెద్ద పెద్ద అంగల్లో అతన్ని దాటి వెళ్ళాడు. లావుపాటి ఆయన కాళ్ళు ఎడంగా పెట్టి ఈడుస్తూ నడుస్తున్నాడు. ముఖం వ్రేలాడేసుకుని, వ్యాకులపాటుతో ఆదుర్దాతో. ఆ కుర్రవాడు పాడుతున్న పాటని వినలేదు. పాట పాడిన వాడి వైపు ఒక్కసారి చూడనైనా లేదు... "

మరో సందర్భంలో ఇలా రాశారు: "గ్రామం మురికిగా వుంది. కాని, ప్రతి గుడిసె చుట్టూ శుభ్రంగా వుంది( వాకిలి కడిగి రోజూ ముగ్గువేసినట్టు వుంది. గుడిసె లోపల కూడా పరిశుభ్రంగానే వుంది— వంట వల్ల వచ్చే పొగ తప్పించి. ఇంటిల్లిపాదీ అక్కడే వున్నారు తండ్రి, తల్లి, పిల్లలు, ఒక ముసలావిడ— నాయనమ్మ కావచ్చు. అందరూ సంతోషంగా, చిత్రంగా తృప్తిపడుతున్నట్టుగా వున్నారు. మాటల ద్వారా తెలుసుకోవడం కష్టం. వాళ్ళ భాష మాకు రాదు. మేము కూర్చున్నాం. ఎవరికి ఇబ్బందిగా అనిపించలేదు వాళ్ళ పనులు వాళ్ళు చూసుకుంటున్నారు. పిల్లలు దగ్గరికి వచ్చారు. ఒక పిల్లవాడు, ఒక పిల్ల కూర్చు

న్నారు చిరునవ్వు నవ్వుతూ. రాత్రికి భోజనం తయారయినట్టే వుంది అంత ఎక్కువగా ఏమీ లేదు. మేము వెళ్ళిపోతూంటే అందరూ బయటికి వచ్చి చూస్తూ నిలబడ్డారు...వరుసగా పొడుగునా వున్న గుడిసెల మధ్య నుంచి ఒక విశాలమైన దారి వుంది. ఆ దారికిరువైపులా బాహాటంగా మురికి కాలువ వున్నాయి-ఊహించ లేనన్ని రకరకాల పురుగులతో చేల్లటి బురద మీద తెల్లటి పురుగులు పెనుగు లాడటం స్పష్టంగా కనిపిస్తోంది. పిల్లలు దారిలో ఆడుకుంటున్నారు. పూర్తిగా ఆటల్లో మునిగిపోయి నవ్వుకుంటూ అరుస్తున్నారు-దారిన పోయేవాళ్ళని పట్టించుకో కుండా."

కృష్ణమూర్తిగారు ఇరుగు పొరుగు వారిని ఎంతో సానుభూతి తోనూ, సునిశితంగానూ గమనించేవారు. "చంటి పిల్లవాడు రాత్రంతా ఏడుస్తూనే వున్నాడు. తల్లి తన చాతనైనదంతా చేసింది. పిల్లవాణ్ణి ఊరుకోబెట్టడానికి-విసుక్కుంది, లాలించింది, ఉయ్యాల ఊపింది. ఏం చేసినా లాభం లేకపోయింది. పిల్లవాడికి పళ్ళొస్తూ వుండాలి. రాత్రంతా ఇంట్లో ఎవరికీ నిద్రలేదు. చీకటిగా వున్న చెట్లపైన ఇప్పుడు తెల్లవారుతోంది చిట్టచివరికి పిల్లవాడు శాంతించాడు." అని ఒకరి గురించి రాస్తే. మరొకరి గురించి ఇలా రాశారు: "రేడియో... పక్కింటి వాళ్ళు దాన్ని రోజంతా పెట్టుకోవడమే కాక, రాత్రి చాలా సేపటివరకూ వుంచుతారు. తండ్రి చాలా తొందరగా ఆఫీసుకి వెళ్ళిపోతాడు. తల్లి, కూతురూ ఇంట్లోనూ తోటలోనూ పని చేస్తున్నంతసేపూ రేడియో గట్టిగా మోగుతునే వుంటుంది. కొడుక్కి కూడా ఆ సంగీతం, ప్రసార కార్యక్రమాలూ ఇష్టంలాగే కనిపిస్తుంది. అతను ఇంట్లో వున్నప్పుడు కూడా ఆ రేడియో అలా మోగుతూనే వుంటుంది. ఇందులో అన్నిటికన్నా చిత్రమైనదేమంటే, రేడియో మన జీవన విధానంలో తెచ్చే మార్పు ఎంత స్వల్పమోనన్నది .. మన యుద్ధ మనస్తత్వం ఎప్పటి లాగే వుంది. ఇతర జనాన్ని మనం అసహ్యించుకుంటున్నాం... మన దుఃఖాలూ అలాగే కొనసాగుతున్నాయి."

కృష్ణమూర్తి గారిని కలుసుకోవడానికీ వచ్చే రకరకాల వ్యక్తుల్ని కూడా ఆయన సునిశితంగా గమనించేవారు. వారి సమస్యలు ఎంత అల్పమైనవైనా, ఎంత గంభీరమైనవైనా అన్నిటినీ శ్రద్ధగా ఆలకించేవారు. ఆయన్ని కలుసుకోవ డానికి వెళ్ళిన ఒక వృద్ధురాలి గురించి ఇలా రాశారు: "ఆవిడ వృద్ధురాలు, పిట్టలా వుంది-తెల్లని జుట్టుతో, ముఖం నిండా ముడుతలతో, ఎంతో మంధి

పిల్లల్ని కన్నట్టుగా వుంది. కాని, బలహీనంగా గాని, ఊపిరి లేనట్టుగా గాని లేదు. ఆవిడ చిరునవ్వులో ఆవిడ ప్రగాఢమైన మనస్సు ప్రస్ఫుటమవుతోంది. ఆవిడ చేతులు ముడతలు పడివున్నా దృఢంగా వున్నాయి. ఆ చేతులు ఎన్నో కూరలు వండివుంటాయి-ఎందుకంటే ఆవిడ కుడిచేతిబొటనవేలికి, చూపుడువేలికీ కూరలు తరిగేటప్పుడు ఎన్నో చిన్నచిన్న గాట్లుపడి నల్లబడివున్నాయి. కాని, అవి ఎంతో చక్కనిచేతులు-ఎంతోకష్టపడి పనిచేసినచేతులు, ఎన్నోకన్నీళ్ళను తుడిచినచేతులు... 'ఈ దుఃఖపూరితమైన ఒంటరితనం నన్ను భగవంతుడిదగ్గరకు చేరుస్తుందా' అని అడిగిందావిడ ఆత్రుతతో..."

కృష్ణమూర్తిగారిని చూడటానికివచ్చిన కొందరిలో ఒక చిన్నపిల్లకూడా వుంది. ఆ పిల్లను గురించి ఆయన ఇలారాశారు : "ఒక చిన్నపిల్ల తల్లి చెప్పకుండానే వచ్చి దగ్గరగాకూర్చుంది. అదంతాఏమిటి అన్నట్టు తెల్లబోయి చూస్తోంది. అప్పుడే స్నానంచేసి బట్టలు వేసుకున్నట్టుంది తల్లోపువ్వులున్నాయి. ఆ అమ్మాయి ప్రతిదీ గమనిస్తోంది. పిల్లలందరిలాగే-దేన్నీ మనసులో పదిలపరచుకోకుండా. ఆ పిల్ల కళ్ళు మెరుస్తున్నాయి. ఏంచెయ్యాలో తెలియట్లేదు ఆ పిల్లకి-ఏడవాలో, నవ్వాలో, ఎగరాలో. దానికి బదులు నాచెయ్యిపుచ్చుకొని ఎంతో దీక్షగాచూస్తోంది అంతలోనే ఆ గదిలో చుట్టుపక్కలవున్న మనుషులందర్నీ మరచిపోయి హాయిగా తన తల నావొడిలోపెట్టుకుని నిద్రపోయింది. ఆ అమ్మాయి తల మంచి తీరుగా సరిగ్గా సరిపోయినట్టుంది. ఎంతో పరిశుభ్రంగావుంది పిల్ల. ఆ అమ్మాయి భవిష్యత్తుకూడా ఆ గదిలోకూర్చునివున్న తక్కినవాళ్ల భవిష్యత్తులాగే అయోమయంగా, దుఃఖపూరితంగా వుంటుంది..."

ఇంకో పెద్దమనిషిగురించి ఇలా రాశారు: "ఆయన పండితుడు. ఆయనకు ఎన్నోభాషలు మాట్లాడడంవచ్చు. మద్యానికి అలవాటుపడ్డట్టుగా ఆయన జ్ఞానానికి అలవాటుపడ్డాడు. తన అభిప్రాయాలకు ఆధారాలుగా ఎవరెవరో చెప్పినవాటిని ఎప్పుడూ ఉదహరిస్తూవుంటాడు....తన అభిప్రాయాన్ని వెల్లడించినప్పుడు బుర్ర కొంచెంఊపి చిరునవ్వు నవ్వుతాడు-అది తన అభిప్రాయం మాత్రమేకాదు, అదే తుది సత్యం అన్నట్టుగా.

మరొకావిడగురించి ఇలా వ్యాఖ్యానించారు: "ఏదో గంభీర విషయాన్ని చర్చించడానికివచ్చిన కొద్దిమందిలో ఆవిడకూడావుంది. కుతూహలంకొద్దీ వచ్చి వుండవచ్చు. లేదా స్నేహితులెవరైనా తీసుకొస్తే వచ్చివుండవచ్చు మంచిదుస్తుల

వేసుకుంది. హుందాగావుంది. తక్కినవాళ్ళు ఏవో గంభీర విషయాలగురించి మాట్లాడడం మొదలు పెట్టారు. ఆ గంట సేపూ ఆవిడ అదే ఠీవిలోవుంది తను ఆ గంభీర సంభాషణలో పాల్గొనలేకపోతున్నదని-అంతలోనే తనలోతాను ముడుచుకునిపోతున్నట్టు కనిపించింది".

మనుషులను సునిశితంగా పరిశీలించడం, వారి మనస్తత్వాలను అవగాహన చేసుకోవడమేకాదు, కృష్ణమూర్తిగారు ప్రకృతిదృశ్యాలనుచూసి కవితాహృదయంతో స్పందించేవారు. "సూర్యాస్తమయం దేదీప్యమానంగాఉంది-మామూలుగా ఉంటుందనుకునే చోటగాక, తూర్పువైపునఉంది. అది సూర్యాస్తమయపు ప్రతిబింబం మాత్రమే. అందమైన ఆకృతుల్లోఉన్న పెద్ద పెద్ద మేఘాలు సూర్యకిరణం ప్రతిఫలించే రంగులన్నిటితోనూ వెలుగుతున్నాయి. అది నిజంగా ఊహాతీతంగా భరించలేనట్లుగాఉంది. నీటిపైనకూడా ఆ కాంతివంతమైన రంగులుపడి ఆనంతాకాశానికి కాంతి పథంలా అయినాయి."

మరొకదృశ్యంచూశాక, "భూమి నిద్రావస్థలోఉన్నట్లు. సాగుచేయకుండా పడిఉన్నట్లుగాఉంది. పచ్చనిచెట్లమీద గూళ్లుకట్టుకుని కిలకిలమంటూ ఎగిరే పక్షులు లేవు. దారులన్నీ గట్టిపడి మట్టికొట్టుకునిఉన్నాయి. కొత్త వసంతం వస్తుందని ఆశపెడుతున్నాయి పర్వతాలు. భూమి దానిగురించి కలగంటోంది" అనిపించిందాయనకు

ప్రకృతి సౌందర్యాన్నిచూసి పులకించే కృష్ణమూర్తిగారు నగర జీవనగతికి చింతించేవారు. "నగరంలో జీవితానికీ జగత్తుకీ బంధం తెగిపోతుంది చిత్రంగా. లోయలూ కొండలూఉండే స్థలాల్లో మనుష్యులుకట్టిన మేడలు, ఉరకలువేసే జలధారలస్థానంలో వచ్చే పోయే వాహనాలరొద. రాత్రి నక్షత్రాలు కనిపించడం అరుదు. ఒకవేళ ఎవరైనా చూడాలనుకున్నా నగర దీపాలు మరీ కాంతివంతంగా ఉంటాయి...ఆకాశంలో ఒక మేఘం వెడుతుంది దానివైపు ఎవరోగాని కన్నెత్తి చూడరు. హడావిడి, కల్లోలం".

ఎన్నిదేశాలూ ప్రదేశాలూచూసినా, ఎన్ని జాతుల వారిని గమనించినా, మానవ మనస్తత్వంలో ఆయనకు ఏమీ తేడాకనిపించలేదు. ఒకపాశ్చాత్య దేశస్థుడు కృష్ణమూర్తిగారితో అన్నాడు: "మీప్రాచ్యదృక్పథం మా పాశ్చాత్యులకేం వర్తిస్తుంది? చురుకుగాఉండటం, కష్టపడి పనిచెయ్యటం ప్రవృత్తి ఆవసరం. మీరు

చెప్పేదంతా మా జీవన విధానానికి విరుద్ధంగా ఉంటుంది"అని. దానికి కృష్ణమూర్తి గారు సమాధానంగా, "నాగరికతలు వేరుకావచ్చు-వాతావరణం, పరిస్థితులు, ఆహారం మొదలైన వాటినిబట్టి కాని, సంస్కృతి యావత్ప్రపంచంలోనూ ప్రాథమికంగా ఒక్కటే-కరుణామయంగాఉండటం, దుష్టశక్తుల్ని దూరంగాఉంచటం, ఔదార్యం చూపించటం, అసూయపడకుండా ఉండటం, క్షమా హృదయం కలిగి ఉండటం మొదలైనవి" అన్నారు.

అందువల్లనే, సమస్యలు ధనికులవైనా, దరిద్రులవైనా, మేధావులవైనా, విద్యా హీనులవైనా కృష్ణమూర్తిగారు ఒకే విధంగా సూచించారు. అన్ని సమస్యలకీ ఒక్కటేమూలం. ప్రపంచ సమస్యలైనా, వంటింటి సమస్యలైనా, రాజకీయాలైనా, వ్యక్తిగత వ్యవహారాలైనా, మతానికి సంబంధించినవైనా, సిద్ధాంతానికి సంబంధించినవైనా" "...ఏ సమస్యగానీ-దాని మొత్తం ప్రక్రియని తెలుసుకున్నప్పుడే సమస్యనుంచి విముక్తిలభిస్తుంది. సంపూర్ణంగా తెలుసుకోవడానికి ఖండన జరగకూడదు, సమస్యని సమర్థించనూకూడదు. తెలుసుకుని ఉండటం ఇష్టాయిష్టాలు లేకుండా జరగాలి. ఆ విధంగా తెలుసుకోవటానికి ఎంతో ఓర్పు, సున్నితత్వం ఉండాలి. ఉత్సుకత, నిర్విరామధ్యానం ఉండాలి-మొత్తం ఆలోచనా ప్రక్రియని గమనించడానికీ, అవగాహన చేసుకోవడానికీ".

"మనం ఏది ఆలోచిస్తామో అదే మనం. ఆలోచనా ప్రక్రియని అర్థం చేసుకోవడమే ఆత్మజ్ఞానం." ఆత్మజ్ఞానంతో వివేకం ఆరంభమవుతుంది ఆత్మజ్ఞానం అంటే అనుక్షణం ఆత్మ అవలంబించే మార్గాలనీ, ప్రయత్నాలనీ, ఆలోచనలనీ, తృష్ణలనీ కనుక్కోవడమే. అటువంటి ఆత్మజ్ఞానమే మనిషికి సమస్యలనుంచి విముక్తి కలిగిస్తుందనీ, మానసికస్వేచ్ఛను కలిగిస్తుందనేదే కృష్ణమూర్తిగారి బోధన.

(ఆదివారం ఆంధ్రజ్యోతి, ఫిబ్రవరి 15, 1987)

***

# ఒంటరితనం, విసుగు -
# కృష్ణమూర్తి చూపిన వెలుగు

నాగరికత ఎంతో వృద్ధి చెందినప్పటికీ, సాంకేతిక పరిజ్ఞానం ఎంత విస్తృతమైనప్పటికీ అనాదినుంచి నేటిదాకా మానవ స్వభావంలో మార్పు కనిపించడం లేదు. మనిషిలోని స్వార్థం, అత్యాశ, అసూయ, హింస అంతకంతకు విశ్వమంతటా వికృతరూపాల్ని ప్రదర్శిస్తున్నాయి. మనిషి పడే కష్టాలూ, బాధలూ అంతకంతకు అధికమవుతున్నాయి.

మనమంతా కల్మష వాతావరణంలో, హింసాత్మక వాతావరణంలో ఇరుక్కుపోయి, అందులోంచి బయటపడే మార్గం కోసం అన్వేషిస్తున్నాం. అందులోంచి ఏ మహిమాన్వితుడో మనను బయటకు లాగుతాడనీ, రక్షిస్తాడనీ ఆశిస్తున్నాం. అటువంటి అన్వేషణకూ, ఆశకూ అర్థంలేదనీ, మనల్ని మనం రక్షించుకోవడానికి ఏ మహాత్ముడి సహాయమూ, ఏ గురువు సహాయమూ అవసరం లేదనీ చెప్పారు. విశ్వవిఖ్యాత తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి.

## ఏం చెప్పారు ?

ముందుగా, ఆ వాతావరణాన్ని సృష్టించిన దెవరో, ఎలా సృష్టించారో తెలుసుకోమంటా రాయన. అందుకు మనల్ని మనం తెలుసుకోవా లంటారాయన. మన గురించి మనకే తెలియని నిజాలూ, తెలుసుకోవడానికి ఇష్టంలేని నిజాలూ, తెలియడం లేదనుకునే నిజాలూ ఎన్నో మనిషి మనసులో నిగూఢంగా ఉంటాయని ఆయన చెప్పారు. వాటిని అనుక్షణం శ్రద్ధగా గమనించి తెలుసుకోవడం ద్వారానే మనిషి తన సమస్యల్ని అవగాహన చేసుకోగలుగుతాడనీ, ఆ అవగాహనలోనే సమస్యకు పరిష్కారంకూడా ఇమిడి ఉంటుందనీ తెలియజెప్పారు.

మన సమస్యలకు పరిష్కారాల్ని సూచించడం కాదు కృష్ణమూర్తిగారి పద్ధతి. ఏ సమస్య అయినా అది ఎలా సృష్టింపబడిందో, ఎలా పోషింపబడుతోందో

మన ముందు ఆవిష్కరించడమే ఆయన చేసినది. మన మనస్సు తీరుతెన్నుల్నీ అది చేసే చేష్టల్నీ అవగాహన చేసుకోమని చెప్పడమే ఆయన చేసినది.

ఏ సమస్య అయినా, దాని ప్రక్రియ సంతటినీ పూర్తిగా తెలుసుకున్నప్పుడే ఆ సమస్యనుంచి విముక్తి లభిస్తుంది. ఆ విధంగా తెలుసుకోవడానికి మొత్తం ఆలోచనా ప్రక్రియను గమనించి, అవగాహన చేసుకోవలసి ఉంటుంది. అందుకు ఆసక్తి, అప్రమత్తత, నిర్విరామ ధ్యానం అవసరం. ఎంతో సహనం, సున్నితత్వం ఉండాలి అంటా రాయన.

"మనం ఏది ఆలోచిస్తామో అదే మనం." మన సమస్యలు మన ఆలోచనలు సృష్టించినవే. ఆత్మజ్ఞానం అంటే అనుక్షణం ఆత్మ అవలంబించే మార్గాలనూ, తృష్ణలనూ కనుక్కోవడమే. అటువంటి ఆత్మజ్ఞానమే మనిషికి సమస్యల నుంచి విముక్తి కలిగిస్తుందనీ, మానసిక స్వేచ్ఛ కలిగిస్తుం దనేదే కృష్ణమూర్తి గారి బోధన.

మన సమస్యలకూ, మనస్సుకూ ఉన్న సంబంధం తెలుసుకోవడానికి ఉదాహరణగా ఒంటరితనం అనే సమస్యను తీసుకోవచ్చు. ఇది సాధారణ మానవ సమస్య. మనకు ఒంటరితనం అంటే భయం. ఒంటరిగా ఉండాలంటే బెంగ మన కెవరూ లేరనిపించినప్పుడూ, మన కిం కే శరణ్యమూ లేదనిపించినప్పుడూ, ఏదో శూన్యం, ఏదో వెలితి ఏర్పడినప్పుడూ– ఇలా ఎన్నోరకాల మనఃస్థితులలో ఒంటరితనం ఆవహిస్తుంది. అటువంటి స్థితి ఏర్పడినప్పుడు సాధారణంగా మన ప్రతిక్రియ ఏమిటంటే, ఆ బాధను తప్పించుకోవడానికి ప్రయత్నించడం– ఏదో పుస్తకం తీసి చదువుకోవడం, ఏదో సినిమా చూడటానికి వెళ్ళడం, లేదా ఏదో గుడికి వెళ్ళడం, లేకపోతే ఏదైనా లలితకళలోగాని, ఏదైనా సాంఘిక కార్యకలాపంలోగాని నిమగ్నమవడం, లేదా ఏ స్వామినో అనుసరించడం. మనం చేపట్టే వ్యక్తిగత, సామాజిక రాజకీయ, సాంస్కృతిక, ఆధ్యాత్మిక కార్యకలాపా లన్నీ ఈ ఒంటరితనాన్ని తప్పించుకోవడానికే– ఇదే మన నాగరికత అయిపోయింది అంటారు కృష్ణమూర్తిగారు

## పరిశీలనే మార్గం

ఒంటరితనాన్ని తప్పించుకునే మార్గాలన్నిటినీ పక్కకుపెట్టి, ఒక్కసారి

ఒంటరితనాన్ని పరిశీలించమంటా రాయన. మనం ఏకాంతంగా ఉన్నప్పుడు కూడా మనను ఒంటరిగా ఉండనీయదు మనస్సు. మనస్సు కలవరపడుతూ ఉంటుంది- ఒంటరితనం అనే శూన్యాన్ని దేనితో నింపాలా అని. కానీ, ఎన్నివిధాల ప్రయత్నించినా, ఎన్ని తెలివితేట లుపయోగించినా ఆ శూన్యాన్ని నింపలేకపోతున్నాం. ఆ శూన్య భావాన్ని వదిలించుకోలేక పోతున్నాం. ఒంటరితనాన్ని జయించలేక పోతున్నాం. ఆ విషయంలో ఎవరూ మనకు సహాయ పడలేక పోతున్నారు కదా! అందుచేత ఒంటరితనం అనే శూన్యస్థితిని తప్పించుకునే మార్గాన్ని అన్వేషించడం, అనుసరించడం కాకుండా, దాన్ని సూటిగా, ముఖాముఖీ ఎదుర్కొని చూడమంటా రాయన. ఆ సూటిగా చూడటంలోనే ఒంటరితనం అనే సమస్య అంతమవుతుం దంటా రాయన.

అదొక చిట్కా కాదు, పద్ధతికాదు, సూత్రంకాదు. ఉన్నస్థితిని గమనించడంలో ఏ సమస్య అయినా ఎలా రూపాంతరం చెందుతుందో స్పష్టమవుతుం దని చెప్పారు. ఉన్నస్థితిని అవగాహన చేసుకున్నప్పుడు ఆవేదన ఉండదు, భయం ఉండదు, బెంగ ఉండదు.

అయితే, ఈ అవగాహన అంత సులభం కాదు. మనిషి మనస్సు మహాక్లిష్టమైనది. వైరుధ్యాన్ని సృష్టించి, అందులో ఇరుక్కుపోయి బాధపడటంలో మనిషి మనస్సుకు సాటి మరోటి లేదు.

## స్వయంకృతం ఇది

మనిషి ఈ ఒంటరితనాన్ని తానే స్వయంగా సృష్టించుకున్నాడంటే ఆశ్చర్యపో నక్కర్లేదు. మనిషి సంఘ జీవి అంటాం. కానీ ప్రతి విషయంలోనూ తన్ను తాను ప్రత్యేక పరచుకుంటూ, ఇతరుల నుంచి వేరు చేసుకుంటూ, ఇతరులతో సన్నిహిత సంబంధాలు లేకుండా, తనచుట్టూ గోడలు కట్టుకుంటూ, ఒకవైపు మానసికంగా తన్ను తాను ఏకాకిగా చేసుకుంటూ ఉంటాడు. మరోవైపు ఒంటరితనం గురించి బాధపడుతూ ఉంటాడు. ఈ గోడలు తనచుట్టూ ఎలా కట్టుకుంటున్నాడో చూపిస్తారు కృష్ణమూర్తిగారు.

ఈ గోడలు ఇంటికీ- ఇంటికీ మధ్య కట్టే అడ్డుగోడలే కావు- సామాజికంగా, ఆర్థికంగా, మానసికంగా ఎన్నో గోడలు- కులాలూ, మతాలూ, వర్గాలూ,

జాతులూ, జాతీయతలూ, దేశాలూ, సిద్ధాంతాలూ, ఆదర్శాలూ అంటూ ఎన్నో రకాల గోడలు నిర్మించుకుంటూ, మనుషులంతా ఒకరి నొకరు వేరు చేసుకుంటున్నారు. మళ్ళీ మరోవైపు నుంచి దేశ సమైక్యతనీ, విశ్వమానవ సౌభ్రాతృత్వమనీ ఆదర్శాలు వల్లెవేస్తారు. శాంతిగురించి మాట్లాడుతూ యుద్ధానికి సన్నద్ధమవుతూ ఉంటారు.

ఈ వైరుధ్యం మనిషికీ మనిషికీ మధ్యేకాదు–మనిషి మనసులోనే మొదలవుతుంది– మంచివాడుగా ఉండాలనుకుంటూ చెడ్డగా ప్రవర్తిస్తూ ఉంటాడు. తను ఇతరులకన్న గొప్పవాణ్ణి అనుకుంటూ ఇతరులను దూరంగా ఉంచుతాడు. తను ఏకాకి నయ్యానని బాధపడుతూ ఉంటాడు.

మానవ జీవితం అంటేనే సంబంధం. మనిషికి తోటి మనుషులతో, ఇతర ప్రాణులతో, ప్రకృతితో, వస్తువులతో, భావాలతో ఉండే సంబంధమే మనిషి జీవితం. మనిషి ఈ లోకంలో ఒంటరిగా జీవించడం సాధ్యంకాదు. ఆ సత్యాన్ని గ్రహించకుండా ఒంటరితనం గురించి బాధపడటంలో అర్థంలేదని సూచిస్తారు కృష్ణమూర్తిగారు.

జీవితం మీద ఆయన వ్యాఖ్యానాల్ని చదివితే, ఆయన చెప్పిన విషయాలు మన దైనందిన జీవితాలకు ఎంతగా వర్తిస్తాయో తెలుస్తుంది.

ఉదాహరణకు విసుగు పుట్టడం–ఒంటరితనానికి సంబంధించినదే ఈ సమస్య కూడా. తోచకపోవడం, విసుగు పుట్టడం- ఈ రెండూ ఒకలాంటివే.

మనకు ఆసక్తి కలిగించే విషయా లెన్నో ఉన్నాయి. లేకపోతే సృష్టించుకుంటాం. కానీ, వాటివల్ల పొందే ఆనందం నిలకడగా ఉండదు. దేనిమీదా ఆసక్తి నిలవదు. విసుగు కలుగుతుంది. 'బోరెత్తు'తుంది. పిల్లలు బొమ్మలతో విసుగు చెందినట్లు మనం అనేక విషయాల మీద ఆసక్తి పెంచుకుంటూ, వాటిమీద విసుగు చెందుతూ ఉంటాం. అది పుస్తకమైనా, టీ.వీ. అయినా, ప్రేమ సంబంధమైనా, రాజకీయ సంబంధమైనా, మత సంబంధమైనా– మనకు వ్యక్తిగతంగా ఏదైనా లాభమో, ఆనందమో కలుగుతున్నంత వరకే మనకు ఆసక్తి ఉంటుంది. లేకపోతే విసుగు పుడుతుంది. ఏదైనా లాభం ఉంటుందనో, ఆనందం లభిస్తుందనో ప్రయత్నిస్తున్నంత వరకూ ఆసక్తి ఉంటుంది. లేదని తెలియగానే విసుగు పుడుతుంది.

ఆనందం కలిగినా, ఇంకా ఆనందం కలగా లనుకోవడం ఇంకా విసుగు చెందడానికే అని తెలియచెబుతా రాయన.

అందుచేత అనుభవించడంలోనే అందం, ఆనందం ఉంటాయి. గతించిన అనుభవంలో కాదు. మనం ఉన్న స్థితిని అవగాహన చేసుకోవడం ముఖ్యం. మనం ఎప్పుడూ ఉండేది వర్తమానంలోనే - గతంలోనూ, భవిష్యత్తులోనూ కాదు. వర్తమానంతో, ఉన్న స్థితితో విసుగు చెంది గతంలోకో, భవిష్యత్తులోకో పారిపోవా లనుకుంటాం. అదే మానసిక సంఘర్షణకు కారణ మవుతోందని తెలియచెప్పారు.

కృష్ణమూర్తిగారు స్వేచ్ఛా జీవిగా అరవై సంవత్సరాలకు పైగా ఉద్బోధించిన విషయాల గురించి ఎవరైనా ఒకరు మరొకరికి విడమరిచి చెప్పడం సాధ్యంకాదు. ఎన్నివిధాల విడమరిచి చెప్పాలో అన్ని విధాలుగా, ఎంత సరళంగా చెప్పాలో అంత సరళంగా కృష్ణమూర్తిగారే చెప్పారు. స్వార్థం, అవినీతి, హింస ప్రబలిపోతూ, మానవత్వం నశించిపోతున్న ఈనాడు కృష్ణమూర్తిగారి భావాల్ని ఎవరికివారు స్వయంగా అధ్యయనం చేయడం అత్యంతావశ్యకం.

(ఫిబ్రవరి 17 - జిడ్డుకృష్ణమూర్తి వర్ధంతి సందర్భంగా)

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, ఫిబ్రవరి 12-18, 1992)



# హింసకి మూలం...

హింస! ఎక్కడ విన్నా ఎక్కడచూసినా హింసాకాండ! మతకలహాలూ, దేశాల మధ్య యుద్ధాలూ సర్వసామాన్య సంఘటనలుగా కనిపిస్తున్నాయి. చీకటిలా వ్యాపించి మనుషుల్ని భయభ్రాంతుల్ని చేస్తున్నాయి. దేశాలమధ్య, వర్గాల మధ్య, వ్యక్తుల మధ్య సంభవిస్తున్న సంఘర్షణలూ, హింసా ప్రవృత్తి ఏర్పడటం ఎందు వల్ల జరుగుతున్నది? ఈ చీకటి బ్రతుకులకు తెల్లవారడం ఉండదా? మానవులంతా హింసాయుతంగా, హింసామయ వాతావరణంలో జీవించవలసిందేనా? శాంతిస్థాపన కోసం శిఖరాగ్ర సమావేశాలను జరుపుతూనే యుద్ధ సన్నాహాలు చేయడం, సర్వ మానవ సోదరత్వం, సర్వమత సమానత్వం అంటూ ప్రవచనాలు వలుకుతూనే మనిషిని మనిషి హతమార్చడానికి ప్రయత్నించడం–ఇలా ఎందుకు జరుగు తున్నది? దీనికి అంతులేదా? ఏదైనా పరిష్కార మార్గం లేదా? హింసలేకుండా జీవించడం సాధ్యమా? సాంఘిక జీవితంలోనూ, వ్యక్తిగత జీవితంలోనూ విప్ల వాత్మక పరివర్తన తేవడం సాధ్యమా? హింసా రహితమైన విప్లవాత్మక పరివర్తన సాధ్యమా!

పోనీ, పరివర్తన తీసుకురావడం ఎవరి చేతుల్లో ఉంది? రాజకీయ నాయకుల చేతుల్లోనూ, ఒక వర్గం చేతుల్లోనా, ఒక ముఠా చేతుల్లోనా, ఎవరివల్ల సాధ్యం, ఎలా సాధ్యం? ప్రపంచమంతటా విస్తృతంగా వ్యాపించి పోయిన హింసాకాండని అరికట్టడం వాస్తవంగా సాధ్యమయిన పనేనా?

ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవాల్సిన అత్యవసర పరిస్థితిని ఎదుర్కొంటున్నాం నేడు. నిజానికి, ఇది ఈనాటి సమస్య కాదు. మనిషికీ మనిషికీ మధ్య సంబంధం ఏర్పడిన నాటీ నుంచీ, 'నాగరికత' పెరుగుతున్న కొద్దీ మనుషుల మధ్య వైరుధ్యం పెరుగుతూ వస్తున్నది. దీనికి మూలకారణం ఏమిటీ?

1970లో ప్రఖ్యాత తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తిగారు ఇంగ్లండ్‌లోని బ్రాక్‌వుడ్‌పార్క్‌లో జూన్ 8వ తేదీన కొంతమంది అభిమానులతో కలిసి 'హింస' అనే సమస్య గురించి విపులంగా చర్చించారు. ఈ చర్చను తరవాత

**Awakening of Intelligence** అనే గ్రంథంలో భాగంగా ప్రచురించారు. ఆ చర్చ ఇలా జరిగింది (సంక్షిప్తంగా)-

తమచుట్టూ కూర్చున్నవారిని కృష్ణమూర్తిగారు ప్రశ్నించారు-హింసలేకుండా మనం జీవించగలమా?-అని. అందరికీ శాంతీ, స్వేచ్ఛా కావాలి. కానీ, యుద్ధాల్ని అరికట్టలేకపోతున్నారు. ఈ సమస్యని అవగాహన చేసుకోవడానికి ఎక్కడనుంచి మొదలుపెట్టాలి చర్చ?- ఒక భూభాగంలో జరుగుతున్న యుద్ధంతోనా, ఒక దేశంలో జరుగుతున్న తిరుగుబాటుతోనా- సమస్య అంచుదగ్గరా, కేంద్రం దగ్గరా- తనతోనూ, తన సొంత ఇంటిలోనూనా, లేక అవతల దూరాన్నుంచా- పైపైనేనా, ప్రగాఢంగానా- అని కూడా ప్రశ్నించారు.

రెండు విధాలా పరిష్కారాన్ని వెతకొచ్చు. కానీ కనీసం పైపైన మార్పు తీసుకురాగలిగితే, పైపైన ఉన్న ఒక సమస్య పరిష్కారమవుతుంది కదా అన్నా డొకతను.

ప్రపంచంలో ప్రతి భాగంలోనూ తిరుగుబాట్లూ, విప్లవాలూ జరుగుతున్నాయి సామాజిక వ్యవస్థలో మార్పు తేవడం కోసం వ్యవస్థని నిస్సంశయంగా మార్చ వలసిందే. దాన్ని హింస లేకుండా మార్చడం సాధ్యమా?- ఎందువల్లనంటే, హింస మళ్ళీ హింసనే సృష్టిస్తుంది. తిరుగుబాటు ద్వారా ఒక పక్షం ప్రభుత్వాధి కారాన్ని చేపట్టగలదు. అది సాధించాక, తన అధికారాన్ని హింస ద్వారా సుస్థిరం చేసుకుంటుంది. నిజానికి ప్రపంచమంతటా జరుగుతున్నదిదే. అందుచేత, హింసను సృష్టించకుండా, పెంచకుండా ప్రపంచంలోనూ, మనలోనూ మార్పు తీసుకొచ్చే మార్గం ఏదైనా ఉందా అని మన ప్రశ్న అన్నారు కృష్ణమూర్తిగారు చర్చకి దారి తీస్తూ.

అయితే, హింసని గురించి చర్చించుకుంటున్నప్పుడు ఆ సమస్యని ఊరికే పైపైన కాకుండా లోతుగా పరిశీలించవలసి ఉంటుందనీ, అది మన జీవిత విధా నాన్ని మార్చవలసి ఉందనీ గుర్తుంచుకోవాలి— అని సూచించారాయన

హింస లేకుండా, వైరుధ్యం లేకుండా ఒక పక్షాన్ని రూపొందించకుండా, బాహ్యంగానే కాక, అంతర్గతంగా కూడా విభజన లేకుండా ఉండటానికి వీలవు తుందా అన్నది దృష్టిలో పెట్టుకోవాలి. ఈ సమస్యని చర్చించాలంటే, ఎక్కడ మొదలుపెట్టాలి? వియత్నాంలో, మధ్య ప్రాచ్యదేశాల్లో జరిగే యుద్ధాలను అరి

కట్టడం తోనా, మరో చోటునుంచా? ఈ సమస్యను అవగాహన చేసుకోవడం అంచు దగ్గర నుంచా, కేంద్ర బిందువు దగ్గర నుంచా అని ప్రశ్నించారు కృష్ణ మూర్తిగారు. అవి రెండూ పరస్పర సంబంధం లేనివీ, వ్యతిరేకమైనవీనా అని కూడా ప్రశ్నించారు చర్చకు నాందిగా.

ఏది మౌలికమైన ప్రశ్న అని అడిగినప్పుడు, హింసకి కారణం ఏమిటి? అని మరో ప్రశ్న వేశాడొక వ్యక్తి

హింసకి కారణాలేమిటన్న విషయమై నిపుణుల్లో కూడా అభిప్రాయ భేదాలున్నాయి. వాటి గురించి బోలెడు గ్రంథాలు రాశారు. కారణాలన్నీ వివరించుకుంటూ పోవాలా, లేక అది మానవ సంబంధాల్లో మౌలికమైన సమస్య కనుక దాని మూలం ఏమిటన్నది పరిశీలించాలా?-అని ఎదురు ప్రశ్న వేశారు కృష్ణ మూర్తిగారు.

హింసని ప్రతిఘటించడం కూడా హింసే కనుక ఏమీ చెయ్యకుండా ఊరుకుంటే సరిపోతుందేమో అన్నాడు మరొకతను.

అప్పుడు కృష్ణమూర్తిగారు ఒక మౌలికమైన ప్రశ్నను లేవనెత్తారు. నిజంగా హింస అనే దాన్నంతటినీ వదిలించుకొని స్వేచ్ఛగా ఉండాలని మనకి ఉందా? అంటే, తనలో ఏ సంఘర్షణా లేకుండా వ్యతిరేకత లేకుండా, దౌర్జన్యం లేకుండా, తన అభిప్రాయమే సరియైనదని ఘోషించకుండా, ఎదుటివారి అభిప్రాయాల్ని ఖండించకుండా ఉండటం. అలా ఉండడం, ఉండలేకపోవడం ఒక రకమైన హింసని సూచిస్తుంది ఆత్మశిక్షణలోని హింసే కాకుండా ఒక పద్ధతి ప్రకారం తన కోరికల్ని కొన్నిటిని మెలిపెట్టి, వాటిని నీతిగానో, మరోలానో ఉండేలా చెయ్యడం- ఇవన్నీ హింసారూపాలే. ఇచ్ఛ అనేది హింస. వీటన్నిటి నుంచీ విముక్తి పొందాలనుకుంటున్నామా మనం? ఏ మనిషి అయినా దాని నుంచి స్వేచ్ఛగా ఉంటూ జీవించగలడా?- అంటే, చిరాకు, కోపం, ఏదో ఒక ఆందోళన, దేనికైనా ప్రతిఘటన, వీటన్నిటి నుంచీ స్వేచ్ఛగా ఉండగలమా?— ఒక మనిషిగా హింస లేకుండా బ్రతకడం సాధ్యమేనా?...మాటల్లోనే కాదు, మనఃస్ఫూర్తిగా.

మానవులు కొన్నివేల ఏళ్లుగా హింసాపూరితంగా జీవిస్తున్నారు- ఒక వ్యక్తిని శారీరకంగా, మానసికంగా హింసాత్మకంగా చేసేదేమిటి? ఈ ప్రశ్నవేసి,

కృష్ణమూర్తి గారు ఈ విధంగా వివరించారు- ఈ హింసకి మూలం వేరుపడటం. విభజన. 'నేను' అనేది లేకుండా మనస్సు జీవించగలదా? 'నేను' ఇది కావాలనుకోవడం, అది కావాలనుకోవడం, జీవితానికి ఒక ప్రయోజనం ఉండాలనుకోవడం. దాని వెనక పరుగెత్తడం, 'నేను' ప్రతిఘటించడం- ఇదే హింసకి మూలం అయినప్పుడు దానితో నేను ఏం చెయ్యాలి? అన్నారు కృష్ణమూర్తి గారు.

మీరేం చెయ్యలేరు అన్నాడొకతను కచ్చితంగా.

అలా అని, ఈ సంఘర్షణలోనే, ఈ హింసతోనే జీవించాలా? మళ్ళీ చర్చ మొదలైంది.

'నేను' అనేది నువ్వూ నేనూ అనీ, మనము వాళ్ళూ అనీ, నల్లవాళ్ళూ తెల్లవాళ్ళూ అనీ- వేరు చేస్తుంది. ఇలాగే 'నేను' ఒక ప్రత్యేక జాతితోనో, ప్రత్యేక సమాజంతోనో ఐక్యమవుతుంది. 'నేను' ఏదో ఒక దురభిప్రాయంతో ఐక్యమవుతుంది. నేను సాధించాలి అంటుంది 'నేను'. అది నిస్పృహ చెందినప్పుడు కోపం, పగా ఉంటాయి. నేను ఆ లక్ష్యాన్ని చేరుకోవాలి. నేను విజయం సాధించాలి అని అంటుంది. అదే ఇది కావాలనీ, అది వద్దనీ అంటుంది. నేను శాంతియుతంగా జీవించాలని అంటుంది, అదే 'నేను' హింసాత్మకంగానూ మారుతుంది.

'నేను' అనేది ఒక ఘనపదార్థం కాదు. స్థిరంగా ఉండదు. అదొక సంచలనం. అది సజీవమైనది. ఒకనాడు అద్భుతంగా ఉన్నట్లు ఉంటుంది దానికి. మర్నాడు మహా నిస్పృహలో ఉంటుంది. ఒకనాడు ఉత్తేజంతో, కామాతురతతో ఉంటుంది. మర్నాడు అలిసిపోయి 'నన్ను కాస్త ప్రశాంతంగా ఉండనివ్వ'మంటుంది. అది నిరంతర చలనంతో చురుకుగా సాగుతుంది. ఈ సంచలనం మరొక విధమైన సంచలనంగా రూపాంతరం చెందడం, హింసాత్మకంగా మారకుండా చూడటం సాధ్యమా....అటువంటి 'నేను'-'నేను'ని వదిలించుకోవాలని, ఇంకోరకమైన 'నేను' కావాలనే కోరికతో అన్నట్లయితే అదింకా హింసాత్మకంగా ఉన్నట్లే. 'నేను శాంతి వాదిని' 'నేను శాంతంగా జీవించాలి' అనే 'నేనూ' సత్యాన్ని అన్వేషించే 'నేనూ', 'నేను అందంగా జీవించాలి', అహింసాయుతంగా జీవించాలి అనే 'నేనూ' ఇంకా హింసకి కారణమవుతూనే ఉంటుంది.

మనస్సు ఈ సజీవమైన దానితో ఏం చేస్తుంది? మనస్సే 'నేను' కదా- 'నేను' ఏ విధంగా ఏ దిశలో సంచరించినా అది హింసాత్మక చర్యేనని. నేను

దాన్ని వాస్తవంగా, అర్థవంతంగా సత్యాన్ని గమనించి, అదెలా ఉందో తెలుసుకున్నానా? మనస్సు అలా చెయ్యకపోతే మాటలతో అంతులేకుండా ఆడుకోవచ్చు అన్నారు కృష్ణమూర్తిగారు.

'మనస్సూ', 'నేనూ' ఒకటేనా అనే సందేహాన్ని వ్యక్తం చేశాడొకతను.

మనస్సు 'నేను'తో వ్యాపకం లేకుండా ఉన్నప్పుడు అప్పుడది 'నేను' కాదు. కాని మనలో చాలామందికి వ్యక్తం కాని, అవ్యక్తంగా కాని 'నేను' తోనే వ్యాపకం ఉంటుంది- 'నేను' వ్యక్తంగా కాని, అవ్యక్తంగా కాని, ఏ విధమైన సంచలనమైనా, అది హింసారూపమే అని మనం చూస్తున్నామా? దాన్ని చూడనట్లయితే ఎందువల్ల చూడటం లేదు? ఏమిటి లోపం? అని అడిగారాయన.

ఆ చూసేది కూడా 'నేనే' కదా అన్న సందేహం మనకి వచ్చేటట్లే అక్కడ ఉన్నతనికీ వచ్చింది.

అలా చూసేది 'నేను' అనేదేనా అని ప్రశ్నించారు కృష్ణమూర్తిగారు.

నేను కాకపోతే 'వివేకమా' అని అతని సందేహం.

ఆ విషయాన్ని స్వయంగా కనుక్కోమన్నారు కృష్ణమూర్తిగారు.

చూస్తూండడాన్ని 'నేను చూస్తున్నాను' అంటాం కదా అన్నాడతను.

'నేను' చూడటం అనేదీ, చూడటం అనేదీ ఇవి రెండూ విభిన్న పరిశీలనలు- 'నేను' చూస్తుంటే అది తప్పనిసరిగా భయపడుతుంది. అందువల్ల ప్రతిఘటిస్తూ- 'నేనెలా జీవించాలి?', 'నేనేం చెయ్యాలి', 'దీన్ని వదులు కోవాలా'? 'వదపట్టుకోవాలా?' అంటూ ఉంటుంది. అందుచేత 'నేను' చేసే సంచలనం ఏదైనా హింసే. కానీ, ఆ రూపాన్ని కేవలం 'చూడటం' అనేది పూర్తిగా వేరు అన్నారు కృష్ణమూర్తిగారు.

ఇదంతా గందరగోళంగా అనిపించి 'నేను' లేకుండా చూడటం అనేది నాకెప్పుడూ అనుభవంలోకి రాలేదు- అన్నాడతను.

దానికి సమాధానంగా— 'నేను'లో నిమిత్తం లేకుండా చూడటం అనేది ఒకటుంది అంటూ వివరించడం మొదలు పెట్టారు కృష్ణమూర్తిగారు. కేవలం పరిశీలించడం- లక్ష్యరహితంగా, ప్రయోజనాన్ని ఆశించకుండా కేవలం 'చూడటం'- ఇది చాలా సులభం. మీరు ఆకుపచ్చ చొక్కా వేసుకొని ఉండటం చూస్తున్నాను-

'నాకు నచ్చింది' అనో, నాకు నచ్చలేదు అనో అనడం లేదు నేను. 'నాకు' అన్న క్షణంలో 'నేను' అనేది ఉన్నట్లే. అందుచేత దానితోపాటే తక్కినవన్నీ అనుసరిస్తాయి- సాధారణంగా ఒక ధ్యేయంతో చూడటమే పరిశీలించడం అనే భ్రమ ఉంటుంది మనకి. అలా ఏ ప్రయోజనం ఆశించకుండా చూడటం కష్టం అంటారా? అంటే మీకు మీరే అడ్డుపడుతున్నట్లే, తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నట్లే. మనం అలా తప్పించుకున్నట్లయితే, దాన్నే- ఆ తప్పించుకోవడాన్నే చూద్దాం- అన్నారు కృష్ణమూర్తి గారు.

హింసకి మూలం ఎక్కడుందో స్పష్టమవుతున్నా 'నేను', 'నాకు' (నా కులానికి, నా జాతికి, నా దేశానికి అనడం కూడా) అని ఆలోచించకుండా ఏ ఆలోచనా సాగదు. మన జీవితంలో ఏ పనీ సాగదు అని నమ్ముతాం అందరం. ఒక చెట్టుకు అందమైన పువ్వులుంటే 'కేవలం చూసి' ఆనందించడం మనకి- పిల్లలకీ పెద్దలకీ కూడా చాతకాదు. వెంటనే ఆ పువ్వుల్ని కోసుకోవాలనీ, సొంతం చేసుకోవాలనీ అనుకుంటాం. మన ప్రతి ఆలోచనా, ప్రతి చర్యా స్వార్థంతో కూడుకున్నది, 'నేను' మీద ఆధారపడినది కాబట్టే మనం హింసాత్మకంగా ఉంటున్నాం. హింసలేకుండా జీవించలేకపోతున్నాం- అని తెలియజెప్పారు కష్ణమూర్తిగారు.

'అహింసా వాదం' అనేది ఒక 'ఇజం' మాత్రమే. మనం హింసాలోచన మానుకోలేకపోతున్నది మాత్రం నిజం! అందుకే మనలో హింస, మనచుట్టూ సమాజంలో హింస కొనసాగుతున్నది. దినదినాభివృద్ధి చెందుతున్నది! హింస లేకుండా చేసుకోవడం మనలోనే ఉందని కృష్ణమూర్తిగారి వివరణ సారాంశం.

(జిడ్డు కృష్ణమూర్తిగారి శత జయంతి సందర్భంగా)

(ఆంధ్రప్రభ, మే 11, 1995)

* * *

# బెర్ట్రాండ్ రసెల్ భవిష్యద్దర్శనం

"వ్యవస్థలు వ్యక్తిత్వాన్ని రూపొందిస్తాయి. వ్యక్తిత్వం వ్యవస్థల్లో మార్పు తెస్తుంది. ఈ రెండు సంస్కరణలూ జంటగా సాగాలి" అన్నారు ప్రపంచ విఖ్యాత తత్త్వవేత్త బెర్ట్రాండ్ రసెల్ తమ స్వీయచరిత్ర చరమాధ్యాయంలో. "ఒక నిజాన్ని చేరుకునే విధానాన్ని నేను సరిగా ఊహించి ఉండకపోవచ్చు, కాని అటువంటిదొకటి ఉంటుందని నేను అనుకోవడంలో తప్పులేదు, ఆ నిజానికి మనం కట్టుబడి ఉండటం అవసరం. స్వేచ్ఛగా, సుఖంగా ఉండే మానవాళితో నిండిన ప్రపంచాన్ని సాధించే మార్గం నేననుకున్నంత దగ్గరలో లేకపోవచ్చు, కానీ, అటువంటి ప్రపంచం సాధ్యం అనుకోవడంలో నేను పొరపడటం లేదు. అంతేకాదు, అటువంటి దాన్ని చేరుకోవడం కోసం జీవించడం ప్రయోజనకరం...." అన్నారు రసెల్ తమ స్వీయచరిత్ర ముగింపులో (v. 3. 1969).

వ్యక్తిగతంగానూ, సాంఘికంగానూ కూడా తమ అభిరుచులకూ, ఆదర్శాలకూ అనుగుణంగా జీవించారు రసెల్. వ్యక్తిగతంగా సౌందర్యారాధకుడు, సౌమ్యుడు, సున్నిత మనస్కుడు. జీవితంలో ఎదురయ్యే 'అల్ప' విషయాలూ, సంఘటనలపట్ల కూడా వివేకవంతమైన దృక్పథాన్ని అలవరచుకున్న మేధావి. సాంఘిక వాస్తవికతకూ, మానవ మనస్తత్వానికీ ప్రాధాన్యం ఇచ్చిన తత్త్వవేత్త.

ద్వేషం, అసూయా, అత్యాశా పెరిగే అవకాశం లేకుండా వ్యక్తులందరూ స్వేచ్ఛగా పెరిగే సమాజాన్ని రూపొందించాలని ఊహించేవారు. అటువంటి ఊహాబలంతోనే, ప్రపంచంలో ఎన్ని ఘోరాలు జరుగుతున్నా తాము చెక్కుచెదరలేదని చెప్పుకున్నారు రసెల్.

1959లో లండన్‌లో బి.బి.సి.కి ఇచ్చిన ఇంటర్వ్యూలో బెర్ట్రాండ్ రసెల్ తమ జీవితానుభవాలనూ, అభిప్రాయాలనూ సుస్పష్టం చేశారు. (ఈ ఇంటర్వ్యూ తరవాత "బెర్ట్రాండ్ రసెల్ స్పీక్స్ హిజ్ మైండ్" అనే గ్రంథంగా వెలువడింది). రసెల్ యౌవనంలో కన్న వృద్ధాప్యంలోనే ఎక్కువ సుఖంగా గడిపినట్లు తెలిపారు.

యౌవనదశలో తనకు స్నేహితులు లేరనీ, తనతో మాట్లాడేవారెవరూ లేరనీ, ఎన్నోసార్లు ఆత్మహత్యచేసుకోవాలనీ అనిపించేదిట కానీ, అది చాలావరకు భ్రమ అని తరవాత క్రమంగా తెలుసుకున్నారట. మనిషి సుఖంగా ఉండాలంటే కావలిసినవి ఆరోగ్యం, ఆత్మీయతతో కూడిన స్నేహసంబంధాలూ, బ్రతకడానికి సరిపడ డబ్బూ, చేతినిండా పనీ... అని రసెల్ అభిప్రాయం. ప్రతిదానికీ వ్యాకులపడటం ఆనందానికి అవరోధం. అందుచేత భవిష్యత్తు ఇంతకన్న మెరుగ్గా ఉంటుందనుకుని, అందుకు తగిన కృషిచేస్తే ఆందోళన తగ్గి ఆనందంగా ఉంటుంది. ఏవైనా అనుకోని సంఘటనలు సంభవిస్తే వాటిని ఎదుర్కోగల ఆత్మస్థైర్యం లేకపోవడం వల్లనే ఆందోళన కలుగుతుంది అంటారు రసెల్.

తను ఉన్న స్థితితో తృప్తిపడకుండా తనకన్న ఉన్నతస్థితిలో ఉన్నవారితో పోల్చుకోవడం అసూయకీ, జీవితంలో అసంతృప్తికీ కారణం అవుతుందంటారాయన. అందుచేత ఇంకొకరితో పోటీగా ముందుకు సాగేకన్న, ఎవరంతటవారు ముందుకి సాగడానికి ప్రయత్నించడం, ముందుకి సాగేవారిని వెనక్కి లాగకుండా ఉండటం ముఖ్యం అన్నారు. జీవితంలో విసుగు అనేది లేకుండా ఉండాలంటే, పురుషుడు గాని స్త్రీగాని ఎవరికి గల శక్తిని వారు సార్థకంగా వినియోగించుకోగలగాలి. వివిధ అభిరుచులు ఉన్నట్లయితే విసుగుకు ఆస్కారం ఉండదు. వృద్ధాప్యాన్ని సుఖప్రదంగా గడపడానికి అవి మరింత దోహదం చేస్తాయి. అయితే, మీ అభిరుచులు ఎంతగా వ్యక్తిగత పరిధిని దాటుతాయో, మీ వ్యక్తిగత జీవితం అంతమవుతోందన్న బాధ అంత తక్కువగా ఉంటుంది అంటారు రసెల్.

చిరంజీవిగా సుఖంగా ఉండే మార్గం గురించి వారి అభిప్రాయాన్ని అడిగితే, సమాధానంగా ... "అది వైద్యులను అడగవలసిన విషయం .. ఎంతో మంది ఎన్నోరకాల చిట్కాల గురించి ప్రచారం చేస్తూ ఉంటారు... ఫలానా మందు వాడితే జుట్టు నల్లబడుతుందని... అది నాకిష్టం లేదు. ఎందుకంటే, నా జుట్టు ఎంత తెల్లబడితే, నే చెప్పేదాన్ని వినడానికి జనం అంత సిద్ధంగా ఉంటారు" అని చమత్కరించారు రసెల్.

అభివృద్ధికరమైన సామాజిక పరివర్తనా, సామాజిక సంస్కరణా-వ్యవస్థల వల్లనే కాకుండా- వ్యక్తులవల్లకూడా సాధ్యం అని చెబుతూ, పూర్వం కోపర్నికస్, గెలీలియో, న్యూటన్, డార్విన్ మొదలైన విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఏ వ్యవస్థ సహా

యమూ లేకుండానే, ఏ యాంత్రిక సదుపాయాలూ లేకుండానే ఎన్నో గొప్ప విషయాలు కనిపెట్టి ప్రపంచ పురోభివృద్ధికి మౌలికంగా దోహదం చేశారని గుర్తు చేశారు రసెల్.

సాంఘిక ప్రయోజనం దృష్ట్యా వ్యక్తికి సాంస్కృతికంగానూ, సాంకేతికంగానూ ఎంతవరకు స్వేచ్ఛ ఉండాలి అన్న ప్రశ్నకు సమాధానంగా, ఇతరులకు నష్టం కలిగించనంతమేరకు 'సృజనాత్మక'మైన విషయాల్లో సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలని అభిప్రాయపడ్డారు. తాము అనుకున్నది సాధించడంలో మహామహులు కూడా సామాజికంగానూ, ప్రభుత్వపరంగానూ ఎన్నో అవరోధాలను ఎదుర్కొని ఎన్నో కష్టనష్టాలను అనుభవించవలసి వస్తున్నదన్నారు.

సంఘ శ్రేయస్సుకోసం, ప్రపంచ శ్రేయస్సుకోసం వ్యక్తి స్వాతంత్ర్యానికీ, జాతి స్వాతంత్ర్యానికీ కూడా హద్దులుండాలన్నారు రసెల్. దేశంలోని సహజ సంపదని జాతీయం చెయ్యాలని సామ్యవాదులు చెప్పినట్లుగా, ఆ సహజ సంపదని కొంతవరకు అంతర్జాతీయం చెయ్యాలని కూడా వాదించవలసి వస్తుందనీ, ఉదాహరణకు చమురు ఒక చిన్న దేశంలో అపారంగా లభిస్తున్నట్లయితే, ఆ దేశం ఒక్కటే ఆ చమురుపై సర్వహక్కులూ కలిగిఉండటం అసంగతమనిపిస్తుందని అంటారు రసెల్.

జాతి, మతం, భాష, సిద్ధాంతం మొదలైన విషయాల్లో దురభిమానాన్ని నిరసించారు రసెల్. ప్రపంచంలోని నేటి దుస్థితికి, శాంతి రహిత వాతావరణానికి ఇటువంటి దురభిమానాలే కారణాలన్నారు. కల్లోలాలను సృష్టించే దురభిమానాలు పెచ్చుపెరగకుండా ప్రపంచం సుస్థిరంగా ఉండే ఏర్పాట్లు చేయవలసి ఉంటుంది. అది రాజనీతిపై ఆధారపడినటువంటిది. హైడ్రోజన్-బాంబులు ఉపయోగించే యుద్ధం కనుక సంభవించినట్లయితే ఉత్తర గోళార్ధంలో ఇంచుమించు ప్రతి ఒక్కరూ సమూలంగా నాశనమైపోవడం, దక్షిణ గోళార్ధంలో అణుశక్తి ప్రసరణ వల్ల విస్తార జన మరణం సంభవించడం ఖాయమని రసెల్ హెచ్చరించారు. ప్రమాదకరమైన ఈ ఆయుధాల పోటీ కొనసాగుతున్నంతవరకూ ప్రపంచయుద్ధం సంభవించగలదనే భయం ఉండి తీరుతుంది అన్నారు. రసెల్ దృష్టిలో, దాన్ని తొలగించే మార్గం ఒక్కటే... అది, యుద్ధానికి ఆవశ్యకమైన ముఖ్య ఆయుధాలన్నిటినీ పూర్తిగా గుత్తకు తీసుకుని, సంపూర్ణ హక్కులు కలిగిన ప్రపంచ ప్రభుత్వాన్ని

ఏర్పాటుచెయ్యటమే; అంతేగాక, ఆ ప్రపంచ ప్రభుత్వం కర్తవ్యం- వివిధ దేశాల మధ్యగల తగవులన్నిటినీ పరిశీలించి, వాటికి పరిష్కారాలు ప్రతిపాదించడం, ఆ పరిష్కారాలు అమలు జరిగేటట్లు చూడటం, ఏ దేశమైనా మరోదేశంపై తిరుగు బాటుకు చేసే ప్రయత్నాన్ని విఫలం చేయటానికి తగినంత బలాన్ని సమకూర్చు కోవడం, అణ్వస్త్ర ప్రయోగానికి ఎటువంటి అవకాశం లేకుండా పరిస్థితులను అదుపులో ఉంచడం. దేశంలో ఆంతరంగిక శాంతినీ, క్రమపద్ధతనీ పాటించడానికి అవసరమైన రక్షక దళాలను మాత్రం అనుమతించడం జరుగుతుంది- అని సూచించారు

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో లభించిన అపారమైన శక్తులవల్ల ప్రపంచానికి ఏర్పడిన ప్రమాదమంతా మానవ మనస్తత్వం మీదే ఆధారపడి ఉందనీ, మనుషుల మనస్సుల్లోని దుష్టమైన రాగద్వేషాలలోనే ఇమిడి ఉందనీ, ఈ విషయాన్ని గ్రహించి, పరమత సహనాన్ని పాటించి, సర్వమానవ సౌఖ్యాన్ని కాంక్షించినట్లయితే, ప్రపంచం ఇంతకుముందెన్నడూ లేనంత సుఖప్రదంగా ఉంటుందనీ రసెల్ విశ్వాసం. ప్రపంచం పూనుకున్నట్లయితే దారిద్ర్యాన్ని నిర్మూలించగలదు. మానవాళి యావత్తూ ఒకే కుటుంబమని విద్యావిధానంలో నొక్కిచెప్పవలసి ఉంది. పొరుగువారిని ప్రేమించడం అనేది మతాలు ప్రబోధించే నీతిసూత్రంగా మాత్రమే కాకుండా వ్యక్తిగత సౌఖ్యం కోసం కూడా అది అత్యంత వివేకవంతమైన పద్ధతి అని గట్టిగా బోధించవలసి ఉంది.

(మిసిమి, సెప్టెంబరు 1994)

***